

# విపుల వినోదిని



## నవంబరు - 09

నవంబరు 'విపుల' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. అందిన సరైన సమాధానాల నుంచి డ్రా ద్వారా అయిదుగురిని విజేతలుగా ఎంపిక చేసి బహుమతులందిస్తాం. సంపాదకులదే తుది నిర్ణయం.

1. గ్రానీకి కాపలాగా వెన్నెల ఎవరినుంచింది?
2. నాగేశ్వర్రావు భార్య?
3. సమీర టీషర్టు వెనక ఉన్న అక్షరాలు?
4. ఇమ్రాన్‌ను కాపాడిన లైన్‌మాన్?
5. సరూ తల్లి రాసే తెలుగు బ్లాగ్ పేరు?
6. స్రవంతి తల్లి?
7. వ్యామోహం వలలో పడితే మనల్ని శిక్షించేది ఎవరు?
8. 'రాక్షసుడి తోట' మూలకథా రచయిత ఎవరు?
9. స్వరూప రెండో కొడుకు?
10. రెండు సీట్లలోనూ దర్జాగా కూర్చున్నదెవరు?

పంపినవారి పేరు: ------------------------------ వయసు (   )

చిరునామా: --------------------------------------------

--------------------------------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

వినోదిని పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

చివరి తేదీ 16

నోట్ : విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

# 100 ప్రత్యేక సంచికలతో తెలుగుకథకు ఉత్తేజం

**తెలుగుకథా ప్రపంచాన్ని సుసంపన్నం చేసింది తెలుగుకథా రచయితలే అయినా, వారిచేత కలం పట్టించి, మంచి కథలని రాయించడానికి పూనుకుంది మాత్రం తెలుగు పత్రికలని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఇవే లేకపోతే వారు రాసిన కథల్ని పాఠకులకి అందించేందుకు తగిన వేదిక ఉండేది కాదేమో అనిపిస్తుంది.**

**త**మ కార్యాలయానికి వచ్చే కథలలో మంచివి ఎంపిక చేసే ధోరణిని కొన్ని పత్రికలు అనుసరిస్తే, తెలుగుకథా రచయితల చేత ప్రత్యేకంగా ఉత్తమ కథలని రాయించిన ఖ్యాతి కొన్ని వార, మాస పత్రికలకు, నాటి వాటి సంపాదకులకు చెందుతుంది. వీటిలో కొన్ని ప్రస్తుతం లేవుకూడా. 1960-70 లలో తెలుగు కథల వాసి, రాసి పెరగడానికి ఆనాటి ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి వారపత్రికలు, యువ, జ్యోతి మాసపత్రికలు ఎంతో దోహదం చేశాయి.


బలివాడ కాంతారావు

ప్రభ, పత్రిక, జ్యోతి (పాఠకులు వాటినిలా పిలిచేవారు) వార పత్రికలు ప్రతి దీపావళికి ప్రత్యేకంగా కథల పోటీలను నిర్వహించేవి. ఉత్తమ కథలకు ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతుల తోపాటు రెండు ప్రోత్సాహక బహుమతులూ ఇచ్చేవారు. ఈ కథల పోటీ ప్రకటన వెలువడగానే ఆనాటి కథారచయితల్లో చాలామంది గెలవాలనే ఉత్సాహంతో కథలను రాసేవారు. ప్రత్యేక శ్రద్ధతో, అదనపు నైపుణ్యంతో ప్రతీ పదం, ప్రతీ వాక్యం చిత్రిక పట్టేవారు. ఫలితంగా ఆ రెండు దశకాలలో కొన్ని వందల ఉత్తమ కథలను రచయితలు సృష్టించారు. అరుదుగా రాసే వారిని కూడా ఉత్తమ కథలు రాసేలా ఈ పోటీలు ఉత్సాహపరిచేవి.

ఈ పోటీలలో మాత్రమే పాల్గొనే కథా రచయితలు ఎందరో ఉన్నారు. సాధారణంగా ఆరు నుంచి ఎనిమిది వారాల గడువుతో ఈ పోటీ కాలం ముగిసేది. ఇతివృత్తం ఆంధ్రుల జీవితానికి సంబంధించినదై ఉండాలనేది ప్రధాన నియమంగా ఉండేది.



అయితే కొందరు రచయితలు, రచయిత్రులు తమ కథకి బహుమతి లభించదేమోనన్న భయంతో పోటీకి పంపకుండా ఆగిపోయేవారు. పోటీకి కథలను పంపడానికి వారిలోని అహం అడ్డొచ్చేది. కాని ఎలాంటి భేషజాలు లేని రచయితలంతా ఈ పోటీల్లో ఆసక్తిగా పాల్గొనేవారు.

ఆనాడు వారపత్రికలు... సినిమాలు తప్ప ప్రజలకి మరో వినోదం ఉండేది కాదు. కాబట్టి దీపావళి సంచిక కోసం పాఠకులంతా ఆత్రంగా ఎదురు చూసేవారు. దీపావళి ప్రత్యేక సంచికలను రెట్టింపు కన్నా ఎక్కువ పేజీలతో, రంగుల్లో, దీపావళి కార్టూన్లతో, ప్రత్యేక వ్యాసాలు, కవిత్వాలతో సర్వాంగ సుందరంగా ముస్తాబు చేసి వెలువరించేవారు. ముఖ్యంగా పత్రికని అచ్చువేసే ఇంకుతో 'కునేగా మరికొళందు' ('కొన్నావుగా మరికొనకు' అని ఆ సెంట్‌మీద జోక్) కలిపి అచ్చు వేయడంతో దీపావళి ప్రత్యేక సంచికలు దూరం నుంచే సువాసనలని వెదజల్లేవి. అటు పాఠకులు, ఇటు కథారచయితలు కూడా వాటి కోసం తహతహలాడుతూ ఎదురు చూసేవారు.


డి.వెంకట్రామయ్య


వేదగిరి రాంబాబు

1962లో ఆంధ్రపత్రికలో సాధారణ ప్రచురణ కథకి 18 రూపాయలు, 'ప్రభ'లో కథలకు పాతిక రూపాయలు పారితోషికం ఇచ్చేవారు. దీపావళి కథల పోటీలో ఎంపికైన కథలకు 'పత్రిక' నూటపదహార్లు బహుమతిగా ఇచ్చేది. క్రమేపి ఈ మొత్తం పెరుగుతూ, ప్రథమ బహుమతి కథకి రూ. 2500, ద్వితీయ బహుమతి కథకి రూ. 1800, తృతీయ బహుమతికి రూ. 700, ప్రోత్సాహక బహుమతికి రూ. 500/- చొప్పున ఇచ్చేవారు.

కథల పోటీలో బహుమతి పొందిన కొందరి వివరాలు దుత్తా దుర్గాప్రసాద్ (దానిమ్మపండు), కలువ కొలను సదానంద (పువ్వులు నలగని రాత్రి), డి. వెంకట్రామయ్య (మనుషులని తినే వాళ్లు), వి. రాజారామ్మోహనరావు (సముద్రం), జగన్నాథశర్మ ('పేగుకాలిన వాసన' ఈ కథ చాలా కథా సంకలనాలలో చోటు చేసుకుంది), పాలకోడేటి సత్యనారాయణరావు ('ఏరు దాటిన కెరటం'- జ్యోతి వీక్లీ/ 'మనిషి మంచివాడు'- జాగృతి), గోడమీది రాతలు (జ్యోతి వీక్లీ), సి. ఎస్. రావు (గుమ్మడి గింజలు, జ్యోతి వీక్లీ), పెద్దిభొట్ల సుబ్బరామయ్య (పొగమంచు- పత్రిక- వీరు చాలా మంచి కథలని కేవలం పోటీలకే రాశారు), విహారి & శాలివాహన (జామచెట్టు జామకాయ ? ), నార్ల చిరంజీవి (మర్రినీడ-మల్లెతీగ), యర్రంశెట్టి శాయి (పల్లకి, బొమ్మరిల్లు- రెండోకథని వీరు తన భార్య శీలంశెట్టి రమాదేవి పేరు మీద రాశారు), యండమూరి వీరేంద్రనాథ్ (పురుషోత్తముడి భార్య- వీరి కలం పేరుతో రాశారు), అరవింద (మూడుకోణాలు), బహుమతి పొందిన మరికొందరు కథారచయితలు.. కొండముది శ్రీరామచంద్రమూర్తి, ఇచ్ఛాపురపు జగన్నాథరావు, సి. రామచంద్రరావు, తిలక్, ఆదివిష్ణు, వాకాటి పాండురంగారావు, పులికంటి కృష్ణారెడ్డి, సింగరాజు

రామచంద్రమూర్తి.

కొన్ని బహుమతి పొందిన కథల వెనక గల కథలు కూడా ఉన్నాయి. నార్ల చిరంజీవి రాసి బహుమతి పొందిన కథ 'మల్లి నీడ-మల్లెతీగ' ఓ ఆంగ్ల కథకి కాపీ అని వచ్చిన విమర్శని 'ప్రభ' ప్రచురించింది. నిబద్ధతగల నార్ల చిరంజీవి తనకి ఇంగ్లీషు రాదని, కాబట్టి తనా కథని చదవలేదని, అయినప్పటికీ బాధ్యత వహించి బహుమతి సొమ్ము తిప్పి పంపుతున్నానని 'ప్రభ'కి ఉత్తరం రాశారు. దాన్ని ప్రచురిస్తూ, దాని కింద 'ప్రభ' సంపాదకులు- 'నార్ల చిరంజీవి ఎలాంటి రచయితో తమకి తెలుసని, ఆయన కాపీ కొట్టి ఉండరని తాము నమ్ముతున్నామని పేర్కొంటూ బహుమతి మొత్తాన్ని తిరిగి ఆయనకి పంపుతున్నామని' తమ వివరణను ప్రచురించారు.


భానుమతీ రామకృష్ణ


అబ్బూరి ఛాయాదేవి

యర్రంశెట్టి శాయి ఆంధ్రపత్రికకి పంపిన కథ 'మైలపడిన పిచ్చుక'కి కూడా బహుమతి లభించింది. ఆ కథని శాయి అంతకుముందు దాదాపు ఏడాది క్రితం 'జ్యోతి' వార పత్రికకి పంపారు. ఏడాదైనా దాని సంగతి తెలియకపోవడంతో 'పత్రిక' నిర్వహించిన కథల పోటీకి దాన్ని పంపారు. 'పత్రిక'లో బహుమతి కథగా ప్రచురించిన వారమే 'జ్యోతి'వీక్లీ కూడా అదే కథని అచ్చువేసింది. దాంతో 'పత్రిక' బహుమతి మొత్తం ఆరు వందల రూపాయలు శాయికి పంపలేదు. ఆ తర్వాత 'ఇతర పత్రికలకి పంపని కథనే పోటీకి పంపాలి' అన్న నిబంధనని అన్ని పత్రికలూ విధించసాగాయి. (జ్యోతి వీక్లీ ఎడిటర్ పురాణం సుబ్రహ్మణ్యశర్మ కావాలనే శాయి కథని ప్రచురించారన్న వదంతి కూడా అప్పట్లో రచయితల్లో ప్రచారమైంది.)

బహుమతి పొందని కథల్లో కొన్నిటిని సాధారణ ప్రచురణకి తీసుకుని ఆ జాబితాని కూడా దీపావళి తర్వాతి సంచికల్లో ప్రచురించేవారు. ఇలా దాదాపు పాతిక, ముప్పై కథలు వరుసగా ప్రచురించేవారు. ఈ పోటీలకి కథలు పంపిన ఆనాటి కథా రచయితలలో కొందరు... శ్రీసుభా, ఇచ్ఛాపురపు రామచంద్రం, వేదగిరి రాంబాబు, అక్కిరాజు రమాపతిరావు (మంజుశ్రీ), హితశ్రీ, తాళ్లూరి నాగేశ్వరరావు (వీరు వెయ్యి కథలకి పైనే రాశారు), ద్విభాష్యం రాజేశ్వర్రావు, పి.వి.బి. శ్రీరామచంద్రమూర్తి, పంతుల జోగారావు, శివల జగన్నాథరావు, అవసరాల రామకృష్ణారావు, ఘండికోట బ్రహ్మాజీరావు, భరాగో, ఐ.వి.ఎస్. అచ్యుతవల్లి, పవని నిర్మల ప్రభావతి, అరిగే రామారావు, డి.కామేశ్వరి, ఇంద్రగంటి జానకీబాల, శంకరమంచి పార్థసారథి, చందు సోంబాబు, రామవరపు వేణుగోపాలరావు, మానస, ఎన్. తారకరామారావు, పోలాప్రగడ సత్యనారాయణమూర్తి, ఆదూరి సీతారామ్మూర్తి, పోలాప్రగడ రాజ్యలక్ష్మి, శీలా వీర్రాజు, శీలా సుభద్రాదేవి, ఎమ్మెస్సార్ మూర్తి, లత, సత్యం శంకరమంచి, ద్వివేదుల విశాలాక్షి, కె. వివేకానందమూర్తి, కనక్‌ప్రవాసి, అర్నాద్, హవిస్, రంగథామ్, కాశీవిశ్వనాథ్, ముద్దంసెట్టి హనుమంతరావు,



బలివాడ కాంతారావు, పాలడుగు వెంకటేశ్వరరావు, డి. ప్రభాకర్, ఉషారాణి భాటియా, కాటూరి రవీంద్ర త్రివిక్రమ్, తాడిగిరి పోతరాజు, జీడిగుంట రామచంద్రమూర్తి, తమిరిశ జానకి, పి.వి.శేషారత్నం, పూసపాటి కృష్ణంరాజు, అందే గోపాలకృష్ణమూర్తి, ఆచంట శారదాదేవి, ఆచంట జానకిరాం, అజంతా, సదానంద శారద, పరుచూరి రాజారామ్, జ్యేష్ఠ, కొంపెల్ల విశ్వం, యం.డి. సౌజన్య, చాగంటి తులసి, వివిన మూర్తి, ఎలక్ట్రాన్, కవనశర్మ, వాడ్రేవు చినవీరభద్రుడు, పిశుపాటి ఉమామహేశ్వరమ్, కోపల్లె శివరాం, మునిపల్లె రాజు, గంధం యాజ్ఞవల్క్య శర్మ, అంగర వెంకటకృష్ణారావు, తురగా జానకీరాణి, శ్రీపతి, పి.ఎస్.నారాయణ, శివరాజు సుబ్బలక్ష్మి, అక్కల సరస్వతీ బాబూరావు, అబ్బూరి ఛాయాదేవి, గంటి వెంకటరమణ, ఆలేటి నాగమణి, పమ్మి వీరభద్రరావు, ఇసుకపల్లి దక్షిణామూర్తి మొదలైనవారు.


అక్కిరాజు రమాపతిరావు

కొన్ని ప్రత్యేక ఇతివృత్తాల మీద కూడా కొన్ని పత్రికలు పోటీలు నిర్వహించేవి. కుటుంబ నియంత్రణ మీద ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కలిసి నిర్వహించిన పోటీలో పాలకోడేటి సత్యనారాయణరావు రాసిన 'శివుణ్ని కుట్టిన చీమ' కథకి బహుమతి వచ్చింది. సాధారణంగా ఆంధ్రప్రభలో మొదటి బహుమతి పొందిన కథకన్నా, ద్వితీయ, తృతీయ బహుమతులు పొందిన కథలు బావుంటాయని ఆనాటి పాఠకుల్లో ఓ అభిప్రాయం ఉండేది. మానవతా విలువలున్న కథలని మాత్రమే 'ప్రభ' ఎంపిక చేసేది. పత్రికలో అన్ని తరహా కథలకీ బహుమతులుండేవి. రెండు మూడు వడపోతలు అయ్యాక మిగిలిన కథలలోంచి బహుమతి కథలని, కన్సొలేషన్ కథలని ఎంపిక చేసేవారు. అయితే న్యాయ నిర్ణేతలు ఎవరనేది గుప్తంగానే ఉంచేవారు కాబట్టి వారి వివరాలు తెలిసేవి కావు. మొత్తం ఎన్ని కథలు వచ్చాయి? ఎన్ని ఎంపికయ్యాయి? లాంటి వివరాలు ఫలితాలు ప్రచురించిన దీపావళి సంచికలోనే ఇచ్చేవారు.




వార పత్రికలు పోటీలతో మంచి కథలు వచ్చేలా చూస్తే, మాసపత్రికలు మరో పద్ధతిలో తమవంతు కృషినందించాయి. జ్యోతి, యువ మాసపత్రికలు దీపావళికి, ఉగాదికి రెట్టింపు సైజులో, ఎక్కువ పేజీలతో ప్రత్యేక సంచికలని వెలువరించేవి. వీటిలో ప్రచురణ కోసం కథకులకి ఉత్తరాలు రాసి ప్రత్యేకంగా కథలని రాయించి, ప్రచురించేవి. ఈ ప్రత్యేక సంచికలకి రచయితలు మంచికథలని రాసి పంపేవారు. ఈ ఒరవడి లేకపోతే 'యువ' ప్రత్యేక సంచికల్లో వచ్చిన భానుమతీ రామకృష్ణ 'అత్తగారి కథలు' తెలుగు సాహిత్యంలో ఉండేవి కావు.

ఇవికాక 'అమరావతి కథలు' అని ఆంధ్రజ్యోతికి సత్యం శంకరమంచి, 'గోదారి కథలు' బి.వి.ఎస్. రామారావు, ఆంధ్రజ్యో

తికి రావిశాస్త్రి రాసిన 'ఆరుసారా కథలు', ఖదీర్‌బాబు రాసిన 'దర్గామిట్ట కథలు', నామిని సుబ్రమణ్యంనాయుడు రాసిన 'మిట్టూరోడి కథలు', దాట్ల నారాయణ మూర్తి రాజు 'దివాణం కథలు', ముళ్ల పూడి వెంకటరమణ 'ఋణానందలహరి', కె.సదాశివరావు రాసిన 'పోస్ట్ బ్రిటిష్ కథలు', సి. రామచంద్రరావు రాసిన 'వేలు పిళ్లై' (పత్రికలో బహుమతి పొందిన కథ) లాంటి పోస్ట్ బ్రిటిష్ కథలు, ఇంకా ఎందరో రచయితలు అనేక ఉత్తమ కథ లని వార పత్రికల్లోనే రాశారు. దాదా హయత్ రాసిన 'అహింస', జయంపు కృష్ణ 'భయం', శ్రీరమణ 'మిథునం', వి.కళ్యాణ సుందరి జగన్నాథ్ 'అలరాస పుట్టిల్లు, త్రిపుర రాసిన 'భగవంతం కోసం', యండ మూరి వీరేంద్రనాథ్ రాసిన 'లవర్స్ మస్ట్ లెర్న్', పురాణం సుబ్రమణ్యశర్మ రాసిన 'సీత జడ', దేవరకొండ మురళి 'సగటు తండ్రి' ఇలా ఎన్నో మంచి కథలని ఆనాటి వార, మాస పత్రికలు అందించాయి.

జ్యోతి మాసపత్రిక ఎడిటర్ వేమూరి సత్యనారాయణ 1977లో బహుమతుల విషయంలో ఓ వినూత్న ప్రయోగం చేశారు. ప్రతీ సంచికలో వెలువడ్డ కథల్లో ఉత్తమకథని పాఠకులచేత ఎంపిక చేయించి, అలా జనవరి నుంచి డిసెంబరు దాకా ఎంపిక చేసిన పన్నెండు కథల్లోంచి మళ్లీ ఓ కథని పాఠకులచేత ఉత్తమకథగా ఎంపిక చేయించి దానికి బహుమతిని చ్చారు. అదే దేవరకొండ మురళి రాసిన 'సగటు తండ్రి'. అధిక ప్రకటనలతో వ్యాపారదృష్టితో ఈ ప్రత్యేకసంచికలు తెచ్చినా కొన్ని వందల ఉత్తమ కథలు రాయించి, ప్రచురించేవారు. చాలాకాలం తర్వాత దీపావళికి 'నవ్య' వారపత్రిక ప్రత్యే క సంచికని తేవడం ప్రారంభించింది.

కొందరు రచయితలు కేవలం కొన్ని పత్రికల్లోనే ఎక్కువ రచనలు చేసేవారు. జలంధర 'వనిత' మాసపత్రికకి, పెద్దిభొట్ల సుబ్బరామయ్య, ఆదివిష్ణు, హవిస్, రంగ ధామ్ 'ఆంధ్ర పత్రిక'కి, యద్దనపూడి సులో చనారాణి, రావిశాస్త్రి, బీనాదేవి ఆంధ్రజ్యోతికి ఇలా...


ముళ్లపూడి వెంకటరమణ


బి.వి.యస్.రామారావు

ఈనాటికీ ఆనాటి కథాసౌర భాలు పాఠకులు మర్చిపో లేరు. తరచూ 'రచన' మాసప త్రికలో ఆనాటి బహుమతి పొందిన కథలని పునర్ముద్రిస్తు న్నారు. వాసిగల కథలు రావ డానికి పత్రికలపాత్ర ఎంతో ఉందని తెలుగు కథాచరిత్ర రుజువు చేస్తోంది.

ఈనాడు ఆ వార, మాసపత్రికలు లేక పోయినా దినపత్రికలకి ఆదివారం అను బంధంగా వచ్చే పత్రికల్లో చక్కటి కథలు ప్రచురిస్తున్నారు. వారానికి ఒక కథ చొప్పున వాటిలో ప్రచురిస్తున్నారు కాబట్టి వచ్చిన వాటిలో మంచి కథలని ఎంపిక చేసే అవకాశం ఉండటంతో ఆదివారం అనుబంధాలూ మంచి కథలు అందించేం దుకు దోహదం చేస్తున్నాయి.

**-మల్లాది వెంకటకృష్ణమూర్తి**
వ్యాసరచయిత



★ 'తెలుగు కథకు ఉత్తేజం' పేరిట మల్లాదిగారు రాసిన వ్యాసం ఆనాటి సాహితీ పరిమళాల్ని తిరిగి మాకందించింది. ఆయనకు మా ప్రత్యేక అభినందనలు

– *అంగర కృష్ణారావు*, విశాఖ

★ 'మిస్టర్ మిరియం' జోకులు చదువుతున్నంతసేపూ అలరించాయి. కథల్లో 'మేకవన్నె పులి' కొందరు మగవారి బుద్ధిని బైటపెట్టింది. విపులలో కథలకు వేస్తున్న బొమ్మలు చాలా బాగుంటున్నాయి.

– *వి.రమాదేవి*, ఆరుగొలను

★ ఈ రోజుల్లో మానవ సంబంధాలన్నీ ఆర్థిక బంధాలుగా మారడాన్ని 'కామేశం మామ' కథ ప్రస్ఫుటం చేసింది. ఆర్థికంగా అందరినీ ఆదుకోలేకపోయినా, కాస్తంత మాటసాయమైనా చేస్తే మనసుకి తృప్తి అని చాటింది 'పరోపకారి' కథ. అక్టోబరు విపులలోని తెలుగు కథలన్నిటిలోనూ ఈ రెండూ చాలా బాగున్నాయి. ఇతర భాషల కథల్లో మనసుని బాగా కదిలించింది 'అమ్మా! నువ్వెళ్లిపో'. కన్నవారు.. అందులోనూ వృద్ధులమీద గౌరవం, అభిమానం ఉండితీరాలని గట్టిగా చాటిచెప్పింది. ఇక 'నూరేళ్ల తెలుగు కథ'లో మల్లాదిగారి ప్రత్యేక వ్యాసం మొత్తం సంచికకే మకుటం వంటిదని చెప్పాలి.

– *ఎం. శ్రీలక్ష్మి*, విశాఖపట్నం

★ మల్లాదిగారు అక్టోబరు సంచికలో రాసిన ప్రత్యేక వ్యాసం చదివాను. దీపావళి కథల పోటీల్లో ఎంపికైన కథలకు నాకు గుర్తున్న వరకూ 1962కి ముందు ప్రభ, పత్రికవారు ప్రథమ బహుమతిగా రూ. 75/- ఇచ్చేవారు. రెండు, మూడు బహుమతులుగా వరసగా రూ. 50/-, 25/- ఇస్తుండేవారు. అప్పట్లో బహుమతి మొత్తం పెరగడానికి కూడా ఓ కారణముంది. 'ప్రభ'లో తెన్నేటి హేమలతగారు 'ఊహాగానం' శీర్షిక నిర్వహించేవారు. అదే సమయంలో ఆంధ్రపత్రికవారు నవలల పోటీ ప్రకటించి, బహుమతి రూ. 200/- అన్నారు. అది సరికాదంటూ శీర్షికద్వారా ఆమె విమర్శించారు. ఎంతో కష్టపడి నవలలు రాసే రచయితలకు బహుమతి అంతేనా అని నిరసించారు. అప్పట్లో ప్రభ, పత్రిక పోటాపోటీగా నడుస్తుండేవి (లేదా) పాఠకులు అలా భావించేవారు. తర్వాత ప్రభ 'కథల పోటీ' ప్రకటన చేస్తూ, మొదటి బహుమతి మొత్తాన్ని 250 రూపాయలకి పెంచింది. అంటే ఆంధ్రపత్రిక.. నవలకు ప్రకటించిన దానికంటే అది రూ. 50 ఎక్కువ. రెండు పత్రికల మధ్యా అలా పోటీ పెరుగుతూ వచ్చి, కథకు ప్రథమ బహుమతి రూ. 2500 ఇచ్చేవరకూ వెళ్లింది.

ఆంధ్రప్రభ మొదటిసారిగా ప్రకటించిన ప్రథమ బహుమతి మొత్తం రూ. 250.. నాడు నాగార్జున సాగర్‌లో అసిస్టెంట్ ఇంజనీర్‌గా పనిచేస్తున్న దుత్తా దుర్గాప్రసాద్‌గారి 'దానిమ్మ పండు'కు దక్కింది.

– *సిహెచ్. శివరామ ప్రసాద్*, హైదరాబాద్

★ అన్ని కథలూ బాగున్నాయి. పాత్రలు మా కళ్లముందు కన్పించాయి. అంతకుముందు నెల సెప్టెంబరులో 'మరణం ఒక డ్రామా' కూడా ఎంతో సహజంగా ఉంది. ఆ కథా రచయిత పొన్నాడ సత్యప్రకాశరావుగారికి హ్యాట్సాఫ్.

– *వి.గంగరాజు*, వైజాగ్

★ 'తెలుగు కథకు ఉత్తేజం' పేరిట దీపావళి కథల పోటీలకు సంబంధించి ప్రసిద్ధ రచయితల కథల్ని మల్లాది చక్కగా స్పృశించారు. శిష్యులైన కథాశ్రేష్ఠులు నామిని, దాట్లలను ప్రస్తావించారు కానీ వారి గురువు కె.ఎన్.వై. పతంజలిని, ఆయన అద్భుతకథ 'చూపున్న పాట'ని ప్రస్తావించకపోవడం చాలా పెద్ద వెలితి.

అలనాటి కథ 'బోల్తాకొట్టిన రిక్షా' ఇటీవల రాసిన కథలాగే ఉండటం గోపీచంద్‌గారి ముందుచూపుకి నిదర్శనం. అలాగే నేపాలీ అనువాద కథ'అమ్మా! నువ్వెళ్లిపో!' ఎంతగానో కదిలించింది. హ్యాట్సాఫ్ టు కాలిపు వీరభద్రుడు.

'విశ్వకథామృతం'లో భాగంగా వచ్చిన మొపాసా 'ప్రియురాలి హృదయం' చదివి చలించిపోయాను. అంతటి గొప్పకథను చక్కగా అనువదించిన ఎన్.వి.యస్. నాగభూషణాచార్యులు అభినందనీయులు.

– *పెన్మెత్స సూరిబాబు*, హైదరాబాద్

మీ అభిప్రాయాల్ని vipula@eenadu.net కు మెయిల్ చేయవచ్చు

తెలుగు కథ

- ఓ. శాంతిశ్రీ



# వెన్నెల

**కూ..**కూ..అంటున్న కోయిల తియ్యని సంగీతానికి కళ్లు తెరిచాను.

రాత్రే కొత్తగా ఆ ఇంట్లోకి దిగడం వల్ల సామాన్లు సర్దే హడావిడిలో చుట్టూ వాతావరణాన్ని అంతగా పరిశీలించలేదు.

పనితో అలసిపోయి ఉండటంవల్ల రాత్రి పడుకోగానే నిద్రపట్టేసింది. కోయిల రాగం తోగానీ మెలకువ రాలేదు.

ఏమైనా చక్కని కోయిల రాగంతో ఉషోదయం కావడం మనస్సుకు చాలా ఆహ్లాదంగా.. ఆనందంగా అనిపించింది.

కోయిలమ్మ అడ్రస్ తెలుసుకుందామని బద్ధకంగా దుప్పటి తీసి లేచి, కిటికీ దగ్గరకు వెళ్లి చూశాను.

పక్కనే ఉన్న మేడమీద ఒక పెంకుటిల్లు కనిపించింది. చూట్టానికి చాలా ముచ్చటగా ఉంది.

వర్షం కూడా పడినట్లుంది. చెట్లమీద ఆకుల చివర్లనుండి నీటిబిందువులు రాలుతూ.. రోడ్లన్నీ వర్షం నీటితో కడిగినట్లు ఉన్నాయి.

కనబడే చెట్లమధ్యలో ఓ చెట్టు చిటారు కొమ్మన ఊయలూగుతోంది కోయిలమ్మ.

కాఫీ పెట్టుకోవటానికి వంటింట్లోకి వెళ్లాను.. అమ్మ ఉంటే ఈ చేతులు కాల్చుకోవాల్సిన బాధ ఉండేది కాదు.

కొంచెంసేపు ఆగి కాఫీ కప్పుతో మళ్లీ కిటికీ దగ్గరకు వెళ్లాను.

కోయిల ఈసారి రెట్టించి, రెట్టించి కూస్తోంది..కోయిల గొంతుతో పాటు మరింకేదో తియ్యని గొంతు వినపడినట్లు అనిపించింది.

అటువైపు చూస్తే..ఆ పెంకుటింట్లో నుంచి ఓ చిన్నపాప నోటికి చేతులు అటూ ఇటూ పెట్టి 'కూ.. కూ..' అంటూ కోయిలని రెచ్చగొడుతూ కనిపించింది.

బహుశా ఆరేడేళ్లు ఉండొచ్చు. చక్కగా.. ముద్దుగా ఉంది.

"గ్రానీ! కోయిల చూడు నాతోపాటు ఎలా అరుస్తోందో.." అంటూ అప్పుడే మెట్లెక్కి పైకి వస్తున్న ఒక పెద్దావిడ వైపు పరుగుపెట్టింది.

"ఉండవే బంగారుతల్లీ.. అలా పరిగెత్తితే పడిపోతావ్.." అంటూ ఆ చిన్నారి చేయి పట్టుకొని మేడమీదికి నడిచింది ఆవిడ.

చేతిలోని గింజల్ని మేడమీద చల్లడం ప్రారంభించింది.

చిన్నారి కూడా "నేనూ జల్లుతా" అంటూ చేతిలోని కొన్ని గింజల కోసం కాళ్లు ఎత్తి మరీ ముసలావిడ నుంచి లాక్కుంటోంది.

"ఆగవే. తల్లీ.." అంటూ కొన్ని గింజలు ఆ చిన్నారి చేతిలో పెట్టిందామె.

తన చిట్టి చిట్టి చేతులతో గింజలను విసిరింది చిన్నారి.

ఆ చుట్టూరా ఉన్న చెట్లన్నింటిమీదా నిల్చొని గింజల కోసమే ఎదురుచూస్తున్న పావురాలన్నీ ఒక్కసారిగా అక్కడ వాలాయి.

ఆ గింజలు తింటున్న పావురాళ్ల

గుంపును చూపిస్తూ..

"గ్రానీ! వీటికెందుకు రోజూ అం పెడుతున్నావ్? " అని అడిగింది చిన్నారి.

"ఉదయమే ఇలా పచ్చని చెట్లని, కోయిలమ్మని, పావురాళ్లనీ పలకరించామనుకో, రోజంతా బాగుంటుందే బంగారూ!" అంటూ ఆ చిన్నారి తల నిమిరింది ఆవిడ.

"మరి సూర్యుడిని కూడా చూడాలన్నావ్‌గా గ్రానీ!" అంటూ ఆవిడ చీర చెంగట్టుకొని అటూ ఇటూ పరిగెత్తడం మొదలుపెట్టింది చిన్నారి.

"ఔనురా..సూర్యశక్తి అపారమైంది. అందుకే ఆయన్ని రోజూ పొద్దున్నే చూశామనుకో. ఆ కిరణాలవల్ల మనకూ చాలా ఆరోగ్యం. సరే కానీ..ముందు స్కూలుకి పద. ఆలస్యమైపోతోంది. రా.. స్నానం చేద్దువు" అంటూ లోపలికి తీసుకెళ్లిపోయింది.

★ ★ ★

అప్పుడే రెండు రోజులు అయిపోయింది నేను ఈ ఇంట్లోకి వచ్చి.

రోజూ ఆఫీస్‌కి వెళ్లడం ఒక యుద్ధకాండ అయిపోయింది. ఉరుకులు..పరుగులు.. అంతకన్నా ఇబ్బందికరమైన ట్రాఫిక్.

ట్రాఫిక్‌లో చిక్కుకుపోయిన బస్ గురించి..అందులో ఉండిపోయిన నా పరిస్థితి గురించి ఆలోచిస్తుంటే..

'ఒక హెలికాప్టర్ కొనుక్కుంటే' అని మెరుపులాంటి ఆలోచన వచ్చింది.

ఒకవైపు చిరాకుగా ఉంటే మళ్లీ వెనుక నుంచి హారన్ల మోత! సగం ఈ ప్రయాణంలోనే అలసిపోతున్న నా ఈ దుస్థితిని తిట్టుకుంటూ కిటికీలోంచి తల పక్కకి తిప్పాను. ఈనాడు, హిందూ, ప్రజాశక్తి ..ఇలా అన్ని పత్రికలూ చదవటం అయిపోతుంది ఆఫీసు బస్‌లోనే. ఐదడుగుల దూరంలో ఆగి ఉన్న స్కూల్ బస్.. నాకు సరిగ్గా పక్కగా ఉన్న కిటికీ పక్కన కూర్చొని ఉంది ఎదురింటి చిన్నారి.

ఎందుకో ఆ చిన్నారిని చూడగానే అలసట మాయమైపోయింది.

"హలో" అంటూ చేయి ఊపాను, ఆ చిన్నారికి కనపడేలా.

బదులుగా కాస్త భయంగా నావైపు చూస్తూ తల దించేసుకుంది. ఒక్క నిమిషం ఆగి..మళ్లీ తల ఎత్తి నావైపు చూసింది..

నేను మళ్లీ చేయి ఊపాను. ఈసారి కాస్త చిరునవ్వు చిందించింది.

తను కూడా చిట్టి చేయి ఊపటం మొదలుపెట్టింది.

ఎప్పుడూ బ్యాగ్‌లో చాక్లెట్స్ పెట్టుకొని తిరగడం నాకు అలవాటు.

"ఇంత వయస్సు వచ్చినా చాక్లెట్స్ తింటావేంటి ఇంకా" అని ఎంతమంది వెక్కిరించినా..

నా ఈ తీయని అలవాటు అయితే మానలేకపోయాను.

బ్యాగులోనుంచి ఒక చాక్లెట్ తీసి కిటికీలో నుంచి చేయి బైటకు చాపి ఆ చిన్నారికి అందించే ప్రయత్నం చేశాను.

వెంటనే తన బుజ్జి బుజ్జి చేతులని కిటికీలోంచి బైటకు పెట్టి చాక్లెట్స్‌ను అందుకునేందుకు శతవిధాలా ప్రయత్నించింది.

చాలా చిన్ని చిన్ని చేతులు అవ్వడం వల్ల అందుకోలేకపోయింది.

వీలయినంత నా చేయిని చాపి అందించే ప్రయత్నం చేస్తూనే ఉన్నాను నేను..

ఈ లోపల ఏమయిందో.. తల లోపలికి పెట్టి బ్యాగ్ వెతికి స్కేలు బయటకు తీసింది..

ఆ స్కేల్‌ని పట్టుకొని నా చేయిదాకా అందించగలిగింది. చాక్లెట్‌ని ఆ స్కేల్ అంచున ఉంచాను.

అతి జాగ్రత్తగా ఆ స్కేల్‌ను అలాగే లోపలికి తీసుకుంది.

ఇదంతా రెప్పవేయకుండా చూస్తున్న



ఆమె మిత్రబృందం అంతా ఒక్కసారిగా చప్పట్లు చరుస్తూ కేరింతలు కొట్టారు.

'ఏదో విజయం సాధించా'అన్న గర్వంతో నావైపు చూస్తూ మళ్లీ చేయి ఊపింది చిన్నారి.. బస్ కదిలింది.

★ ★ ★

ఆదివారం సాయంత్రం కాస్త గాలి పీల్చుకునేందుకు తీరిక దొరికే సమయం.

మళ్లీ తెల్లారితే హడావిడే..

కథల పుస్తకాలు రెండు, మూడు పట్టుకొని పార్కుదాకా నడుచుకుంటూ వెళ్లా.

అక్కడ పిల్లల కేరింతలతో చాలా సందడిగా ఉంది.

ఈ ప్రపంచాన్నే మర్చిపోయి ఆటలమీదే ధ్యాసపెట్టి ఆడుతున్నారు ఆ చిన్నారులు..

ఆ పిల్లల గుంపులో ఆ చిన్నారి కనిపించింది.

తెల్లటి కుచ్చుల, కుచ్చుల గౌను వేసుకొని ఉయ్యాల ఊగుతోంది.

ఊపు ఊపుకీ పెద్ద పెద్దగా నవ్వుతోంది.

చాలా ముద్దుగా ఉండి దగ్గరకు తీసుకోవాలనిపించింది.

వెంటనే చేయి ఊపాను 'ఇటు రమ్మని'

"రాను" అన్నట్లు తలూపింది.

కాసేపు ఆగి మళ్లీ తనే పరిగెత్తుకుంటూ వచ్చింది.

"నీ పేరు ఏంటి? " అన్నాను.

"వెన్నెల" అంది.

దగ్గరకు తీసుకుంటూ.. "వెన్నెల అంటే ఏమిటో తెలుసా? " అన్నాను.

వెంటనే ఆకాశంలో చందమామకేసి వేలు చూపించింది.

"నేను కూడా వెన్నెల అంత చల్లగా ఉండాలని మా అమ్మ పెట్టిందంట ఆ పేరు.." చెప్పింది.

"నువ్వు ఏ క్లాస్? "

"ఫస్ట్‌క్లాస్"

"మీ నాన్న ఏం చేస్తారు? "

"దేవుడి దగ్గర ఉన్నాడంట. సైకిల్ వేసుకొని వస్తాడని మా గ్రానీ చెప్పింది. కానీ ఇప్పుడే రాడట. నేను బాగా చదువుకొని పెద్దయ్యాక.. అప్పుడు బోల్డన్ని చాక్లెట్స్ తీసుకొని వస్తాడంట"

ఏదో తెలియని బాధ అనిపించింది.

వెంటనే "మీ అమ్మ ఎక్కడ? " అని అడిగా..

"అమ్మ కూడా నాన్న దగ్గరే ఉందంట.. గ్రానీ చెప్పింది. నేను అన్నం తినకపోతే అమ్మ ఏడుస్తుంది అట..అందుకని నేను ఆం తొందర తొందరగా తినేస్తాను, గ్రానీ పెట్టగానే.."

మనస్సంతా బరువుగా అయిపోయింది.

వెన్నెల తలమీద చేయి ఉంచి... "వెన్నెలా! గ్రానీ నీతో రాలేదా? " అన్నాను.

"లేదు.. గ్రానీ ఇంట్లో పడుకుంది. గ్రానీకి అబ్బు వచ్చింది కదా మరి..అందుకని సోనీని తోడుగా ఉంచి, నేను ఒక్కతినే ఆడుకోవడానికి వచ్చాను" అంది.

ఎందుకో వెంటనే ఆమెను చూడాలనిపించింది నా మనస్సుకు.

వెన్నెల చేయి పట్టుకొని "మీ ఇంటికి తీసుకెళ్లు" అన్నాను.

"ఎందుకు ఆంటీ? " అంది.

"ముందు తీసుకెళ్లు" అన్నా.

ఐదు నిమిషాల్లో ఇంటికి చేరాం.

కాలింగ్ బెల్ కొట్టాను. "తలుపు తీసి ఉంది, రారా" అంటూ వినబడింది ఆమె గొంతు.

తలుపుతీసి లోపలికి వెళ్లాను.

ఒక్కరే మంచంమీద పడుకొని వున్నారు. నన్ను చూడగానే అరుస్తూ మీదకు వచ్చింది ఓ కుక్క.

ఒక్క ఉదుటున బైటకు దూకాను.

"ఫర్లేదులే అమ్మా! ఏం అనదు. వెన్నెలా! ఈ సోనీని బైట కట్టేసిరా" అంటూ వెన్నెల చేతికి ఆ కుక్కచైన్ అందించింది ఆవిడ.

అప్పటికి నా ప్రాణం కుదుటపడింది.



'ఇంతకీ సోనీ అంటే ఈ కుక్కా!. దీనినా వెన్నెల..గ్రానీకి తోడుగాపెట్టి వచ్చాననదీ..' అనుకున్నా.

మెల్లగా వెళ్లి ఆవిడ మంచంమీద పక్కగా కూర్చున్నాను.

"నమస్కారం అండీ... నా పేరు సహజ. మీ పక్క బిల్డింగ్‌లో సెకండ్ ఫ్లోర్‌లో ఈ మధ్యనే కొత్తగా దిగాను. ప్రతి రోజూ మిమ్మల్నీ, వెన్నెలని చూస్తూ ఉంటాను. మీకు ఒంట్లో బాగాలేదని తెలిసి పలకరిద్దామని వచ్చాను" అంటూ ముగించాను.

ఆవిడ నావైపు చూసి నవ్వుతూ "మంచి దమ్మా..నువ్వు ఏం చేస్తుంటావు? " అని అడిగారు.

"నేను సాఫ్ట్‌వేర్ ఇంజనీర్"నని చెప్పాను.

"సంతోషం తల్లీ.. మా వెన్నెలని కూడా ఇంజనీర్‌ని చెయ్యాలని నా ఆశ.. వాళ్ల అమ్మ ఆశ కూడా. మా అబ్బాయి కూడా ఇంజనీరే.. ఉద్యోగం చేస్తుండగానే పోయాడు.." అంటూ బాధపడ్డారు.

ఏమని చెప్పి ఆమెని ఓదార్చాలో అర్థం కాలేదు నాకు.

వెంటనే ఆవిడ చీరచెంగుతో కళ్లు తుడుచుకుంటూ అన్నారు "అదే యాక్సిడెంట్లో వెన్నెల అమ్మా, నాన్నా పోయారు. కూతురు, అల్లుడు, కొడుకు ముగ్గురూ ఒకే సారి.. నన్ను ఒక్కదాన్నే చేసి వెళ్లిపోయారు తల్లీ.. నేనొక్కదాన్నే ఎలా వెన్నెలను పెంచాలో ఏమిటో? ..ఇదంతా జరిగి అయిదేళ్లు అయినా, నాకు ఇంకా ప్రతి రోజూ నిన్నే జరిగినంత బాధ"

బాధపడుతున్న ఆవిడను రెండు చేతులతో పట్టి లేపి కూర్చోబెట్టా..

"మీకు ఏమిటి అనారోగ్యం? " అడిగాను.

"ఏముంది తల్లీ.. వార్ధక్యం కదా. సహజంగా వచ్చే నీరసం, ఆయాసం, షుగర్, బీపి అన్నీ ఉన్నాయిలే. అవే ఇలా అప్పుడప్పుడు దాడి చేస్తుంటాయి. అన్నింటికి మించి అప్పుడప్పుడు గుండెల్లో కలుక్కుమని అనిపిస్తూ ఉంటుంది తల్లీ"

"అయ్యో.. మరి డాక్టర్‌కి చూపించుకోవాల్సింది కదండీ" అన్నాను, ఆవిడకు మంచి నీళ్లు అందిస్తూ..

"ఆ మందులూ ఉన్నాయికదా అని. ఒక్కదాన్నే వెళ్లలేక ఆగాను తల్లీ" అన్నారు.

"అదేంటండీ. చుట్టాలు ఎవరూ లేరా.. కనీసం ఎప్పుడైనా ఒక్కసారి వచ్చి సాయపడటానికి" అని అడిగాను.

"లేకేం? ఉన్నారు... కానీ ఏ ఎండకి ఆ గొడుగు పట్టే రకాలు. మా వెన్నెలని పెంచుకుంటాం అని కూడా ముందుకు వచ్చారు మొదట్లో..దానిమీద ప్రేమతో అనుకునేవు.. వారికి డబ్బుమీద వ్యామోహం. నా కొడుకు.. అల్లుడు ఇద్దరి ఆస్తికీ వెన్నెల వారసురాలు. మూడు నెలల క్రితం వరకూ బాగానే వచ్చిపోయేవారు. మా అబ్బాయి, అల్లుడూ కలిసి చేసిన వ్యాపారం కోసం ..ఎక్కడో పెద్ద మొత్తంలో అప్పు చేశారు. ఆ అప్పుకింద ఉన్న ఆ కాస్త ఆస్తినీ స్వాధీనం చేసుకొన్నారు కోర్టు వాళ్లు. గతిలేక ఈ ఇంట్లో ఉంటున్నాం అద్దెకు. మా వారి పేర ప్రతి నెలా పెన్షన్ వస్తుంది. దానితోనే ప్రస్తుతం నెట్టుకొస్తున్నాం. ఇదంతా జరిగాక ఆ చుట్టాలు కనపడడం లేదు. నాకేమీ భయంలేదు... కానీ నేను పోతే వెన్నెల అనాథాశ్రమానికి వెళ్లాలి. అదే నా దిగులంతా. అల్లారుముద్దుగా చూసుకునేది వాళ్ల అమ్మ. రేపు ఆశ్రమానికి వెళ్లడమంటే? చివరికి ఆ తల్లి కోరికైనా నెరవేర్చలేక పోతున్నానే" అని పెద్దగా ఏడ్చేశారు ఆవిడ.

వెంటనే ఆమెను గుండెలకు హత్తుకున్నాను. నన్ను మరింత గట్టిగా పట్టుకుని ఏడ్చేశారు తనివితీరా..

★ ★ ★

ఆఫీస్ నుంచి రాగానే వెన్నెల ఇంటికి

వెళ్లడం అలవాటయిపోయింది.

ఆవిడకు మందులు వేయడం, వెన్నెలతో హోమ్‌వర్క్ చేయించడం, ముగ్గురం కలిసి భోజనం చేయడం..

హార్ట్ స్పెషలిస్ట్‌కు చూపించాక ఇప్పుడు ఆవిడ ఆరోగ్యం కాస్త కుదుటపడింది.

వెన్నెలతో నా అనుబంధం మరింత బలపడింది. చిన్నారుల నవ్వంత స్వచ్ఛత ఇంకోటి ఉండదు.

ఆ పసివాళ్ల మనసులు చాలా త్వరగా అల్లుకుపోతాయి.

బామ్మగారికి దగ్గు బాగా పెరిగిపోవడంతో వాళ్లింట్లోనే పడుకోవాలని నిర్ణయించుకున్నాను.

చల్లగాలికి కాసేపు మేడమీద చాప వేసుకుని పడుకున్నాను.

"ఆంటీ! కథ చెప్పవా" అంటూ వెన్నెల పక్కన చేరింది.

చందమామ పుస్తకం పక్కన పెట్టి.. అప్పుడే చదివిన ఒక కథ చెప్పాను.

ఊకొడుతూ నిద్రలోకి జారిపోయింది.

తీసికెళ్లి గదిలో పడుకోబెట్టా.

పక్కనిండా పుస్తకాలు పడేసి ఉన్నాయి. వాటిని మెల్లగా తీసి సర్ది టేబుల్‌మీద పెడుతుండగా కనపడింది ఓ పుస్తకం. అది వెన్నల దగ్గర ఎప్పుడూ ఉండే పుస్తకం.

మొదటి పేజీలో ఒక బొమ్మవేసి గ్రానీ అని పేరు పెట్టింది.

రెండో పేజీలో మూడు బొమ్మలు వేసి అమ్మ, నాన్న, మామయ్య అని పేర్లు పెట్టింది.

మూడో పేజీలో ఒక చిన్న పాప బొమ్మ వేసి 'పరిమళ' అని రాసింది.

తన మనసులో చోటుచేసుకున్న వాళ్లందరికీ ఆ పుస్తకంలో కూడా చోటు ఇచ్చింది కాబోలు.

నాలో ఏదో తెలియని తీయని అను





భూతి. పసివాళ్ల హృదయాలంత కల్మషం లేని చోటు మరెక్కడ?

ప్రపంచంలో పడ్డాక, అదే హృదయంలో ఎక్కడ నుండి వస్తోంది కుటిలత్వం?

..అమాయకంగా, ముద్దుగా నిద్రపోతున్న వెన్నెలని ముద్దుపెట్టుకున్నా.

★ ★ ★

అమ్మా నాన్నని తీసుకురావడానికి విజయవాడ వెళ్లాను.

అక్కడ మిగిలి ఉన్న సామాను అంతటినీ తీసుకొని బయలుదేరాం.

దారిలో అమ్మకి వెన్నెల గురించి అంతా చెప్పాను.

"ఏమిటీ.. వెన్నెల నీకు బాగా నచ్చినట్లు ఉంది. నీ సొంత కూతురి ముచ్చట్లు చెప్పినట్లు చెప్పుకుంటున్నావు మురిపెంగా" అంటూ నవ్వేసింది అమ్మ.

"అమ్మా! నిన్ను కూడా వెన్నెల 'గ్రానీ' అంటుంది.. సరేనా? .." అన్నాను అమ్మ వైపు చూస్తూ.

"దానికేం భాగ్యంగానీ.. అలానే పిలవమను. నీ హడావిడి చూస్తుంటే ఆ పిల్లని త్వరగా చూడాలనిపిస్తోంది" అంది అమ్మ.

"మరే ఔనురా! నాకు కూడా" అన్నారు నాన్నగారు.

మెల్లగా ఇంటికి చేరాం సామాను అంతా దించగానే, అమ్మ వెన్నెలను చూస్తానని తొందరపెట్టింది.

వెంటనే అందరం వెన్నెల ఇంటికి చేరాం.

వెన్నెల ఒక్కతే బైట కూర్చొని ఉంది.

నన్ను చూడగానే పరిగెత్తుకుంటూ వచ్చి నా కాళ్లు చుట్టేసింది.

వెంటనే ఎత్తుకొని ముద్దుపెట్టి, చాక్లెట్ ఇచ్చాను చేతికి. "వద్దు" అంటూ తల ఊపింది.

కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయి వెన్నెలకి.

నాకేదో అనుమానం వచ్చి "గ్రానీ ఏదీ? " అన్నాను.

"ఏమో తెలియదు. రమ్య అంటీ ఏమో

‘అమ్మమ్మ... అమ్మ దగ్గరికి వెళ్లింది’ అని చెప్పింది” అంది.

గుండె జల్లుమంది ఒక్క నిమిషం.

ఒక్క ఉదుటన పక్కింటి రమ్యగారి ఇంట్లోకి వెళ్లిపోయాను.

నన్ను చూడగానే ఆవిడ కళ్లనీళ్ల పర్యంతం అయ్యింది.

“వచ్చావా.. సహజా!... నీ ఫోన్ నెంబరు కూడా లేకపోయింది. మొన్న రాత్రి నువ్వు అలా వెళ్లగానే దగ్గు మందు పోశాను. అయినా లాభం లేకపోయింది. నిద్రలోనే ప్రాణాలు పోయాయి. చుట్టాలంతా వచ్చారు. ఎవరో వాళ్ల చెల్లెలిగారి అబ్బాయి అట.. కొడుకు వరస కదా..తల కొరివి పెట్టాడు” అన్నారు.

నా మెదడు మొద్దుబారిపోయింది. అసలేం జరిగిందో అర్థంకాలేదు.. తేరుకొని వెన్నెల కోసం వెతికాను.

నా ఆత్రం చూస్తూ..“సహజా! నిన్న సాయంత్రం వాళ్ల గ్రానీని తీసికెళ్లినప్పటి నుంచి ఏం తినలేదు. ఒకటే ఏడుపు.. నీ కోసం. అన్నట్లు, ఆవిడ మొన్న రాత్రి నేను మందు వేయటానికి వెళ్లినప్పుడు.. నీకు చెప్పమని నాలుగు మాటలు చెప్పారు” అన్నారామె.

‘ఏమిట’న్నట్లు చెమర్చిన కళ్లతో ఆవిడ వైపు చూశాను.

నా చూపులోని ప్రశ్నను అర్థం చేసుకున్నట్లు చెప్పారు “తనకు ఏదన్నా అయితే, నీకు ముందుగా చెప్పినట్టు.. వెన్నెలని అనాథాశ్రమంలో చేర్చమన్నారు. అక్కడైతే పిల్లల్ని బాగా చూస్తారట. అడ్రస్ వివరాలు డైరీలో ఉన్నాయి ”అని.

బైటకు వెళ్లి చూశాను.. గులాబీమొక్కకు నీరుపోస్తూ బాల్కనీలో నిల్చుంది వెన్నెల.

దగ్గరకు వెళ్లి తలమీద చేయివేశాను.

నావైపు చూస్తూ..“మొక్కలకి నీళ్లుపోస్తే హాయిగా తాగేసి.. నాలా పచ్చగా ఉండండి.. అని దీవిస్తాయట. గ్రానీ చెప్పింది ఆంటీ..” అంది.

గుండెను మెలిపెడితే ఇలాంటి నొప్పే ఉంటుందేమో.. అనిపించింది.

★ ★ ★

“సహజా! నువ్వు ఆలోచించే ఈ నిర్ణయం తీసుకున్నావా? ” అడిగింది అమ్మ.

“అమ్మా! నేను ఆలోచించకుండా ఏ పనీ చేయను. అది నీకు తెలుసు.. తెలిసి మరీ అడగటంలో ఏంటి నీ ఉద్దేశ్యం” అన్నాను విసుగ్గా.

“అది కాదురా తల్లీ! రేపు నీకు పెళ్లి అవుతుంది.. ఆ వచ్చే అబ్బాయి నీ నిర్ణయాన్ని సమర్థించలేదనుకో..ఏంటి పరిస్థితి? ” అంది దిగులుగా.

పక్కనే ఉన్న నాన్నగారు “అర్థం చేసుకున్నవాడే వస్తాడులే శేషూ! ఊరికే దిగులు పడకు. అయినా అది మనం ఎలా పెంచామో అలానే ప్రవర్తిస్తుంది. సుమతీ శతకాలు, వేమన శతకాలు వల్లె వేయించావు నువ్వు. వివేకానందుడి జీవిత చరిత్రని చదివి వినిపించాను నేను. మరి అవన్నీ గాల్లో వదిలేయలేదు కదా! సహజ ఈ నిర్ణయం తీసుకోవడం నాకు చాలా సంతోషంగా ఉంది. ఇక నువ్వు వేరే ఏమి ఆలోచించకుండా, వెళ్లి వెన్నెలకి అన్నం పెట్టు” అన్నారు.

నాన్న దగ్గరకు వెళ్లి ఆయన కాళ్ల దగ్గర కూర్చున్నాను. “ఏమిట్రా!” అంటూ నా చేయి పట్టుకున్నారు.

ఎందుకో తెలియని బాధ పెల్లుబికింది.. నాన్నని గట్టిగా పట్టుకున్నాను.

తండ్రి స్పర్శలో ఉన్న ధైర్యం.. కొండంత ఊరటనిచ్చింది ఒక్కసారిగా.

“నాన్నగారూ! ఎప్పుడో వయస్సు అయిపోయాక ఏదో చెయ్యాలి, ఒక ఆశ్రమం పెట్టాలి.. పసివారికి, అనాథలకి చేయూతనివ్వాలి.. అని ఎంతో అనుకునేదాన్ని. ఎప్పుడో ఎందుకు? ఇప్పుడే ఎందుకు కాదు అనిపిస్తూ ఉండేది అప్పుడప్పుడూ. చూస్తూ చూస్తూ నా బాధ్యతని విస్మరించలేకపోయాను నాన్నగారూ! అందుకే మీ అభిప్రాయాన్ని తెలుసుకోకుండానే ఈ నిర్ణయం తీసుకున్నాను. తప్పైతే క్షమించండి.. వెన్నెలమీద జాలితో ఈ నిర్ణయం తీసుకోలేదు నాన్నగారూ! నా స్వార్థంతో తీసుకున్న నిర్ణయం ఇది..వెన్నెల పసితనపు నవ్వులో ఉన్న నిర్మలత్వం, ఆ చిన్న మనస్సులో ఉన్న ప్రేమ, ఆ చిలుకపలుకుల్లో ఉన్న తియ్యదనం..ఇవన్నీ తనివి తీరా ఆస్వాదించాలన్న స్వార్థం నాది. ఒక మంచి బాధ్యత తీసుకున్నానన్న సంతృప్తి.. అంతే..”

“సహజా! నీ నిర్ణయం సరయింది అనుకున్నప్పుడు ఎవరినీ అడగాల్సిన అవసరం లేదురా! అందులో తప్పు ఏమీ లేదు. లేచి వెళ్లి అన్నం తిని పడుకో..రేపు పొద్దున్న పదిగంటలకే ముహూర్తం..ఆ దత్తత స్వీకారం అయ్యాక, అప్పుడు తీరిగ్గా నీ కూతురితోపాటు కూర్చొని మరీ కబుర్లు చెప్పుకుందాం సరేనా..” అంటూ చల్లగా నా బుగ్గని తాకింది ఆయన చేయి.

ఇదే ఊరట, ఇదే స్థయిర్యం నేను కూడా వెన్నెలకి అందించగలిగితే..

నాన్న నాకు నేర్పిన విద్య.. నేను వెన్నెలకి అందించగలిగితే..

అది కూడా ఈ ప్రపంచాగ్నికి సమిధ కాగలదేమో.. అనిపించింది.

లేచి బెడ్రూంలోకి వెళ్లాను. వెన్నెల మంచంమీద కూర్చొని బొమ్మలు వేస్తోంది.

ఈసారి ఆ బొమ్మకి ‘సహజ ఆంటీ’ అని పేరుపెట్టింది.

ఆ స్వచ్ఛమైన మనస్సులో స్థానం సంపాదించిన ఆనందంలో వెన్నెలని గట్టిగా హత్తుకొని ముద్దాడాను.

నవ్వుతూ తిరిగి నాకూ ముద్దు పెట్టింది వెన్నెల.

తొలకరి జల్లు చిట్టిగులాబీపై పడినప్పుడు..పడే ఆ నీటిబొట్టు.. గులాబీకి అందించే స్పర్శ అది. అబ్బా..ఎంత బాగుందీ అనుభూతి!

V

కన్నడ కథ

-తిలక్‌నాథ్ మంజేశ్వర్

# పడగ

అనువాదం : వింధ్య వాసిని

**నా**గేశ్వర్రావుకి షాక్ తగిలినట్లయింది. ఆయన మనస్సు, శరీరం స్తంభించినట్లయింది. ఊపిరి మాత్రం ఆడుతోంది, అయితే శరీరంలో చలనం లేదు.

ఇప్పుడే ఒక ఐదు నిమిషాల క్రితం ఇంట్లో ఫోన్ రింగయింది. ఆయన తీసుకున్న రిసీవర్ ఇంకా చేతిలో అలాగే ఉంది. 'మీరు డయల్ చేసిన నెంబరు సరిగా ఉందో లేదో చూసుకోండి' అని కన్నడ, ఇంగ్లిష్, హిందీ భాషలలో చెప్తోంది. ఆయన మాత్రం అదే భంగిమలో, అలాగే కూర్చుని ఉన్నారు.

ఆఫీస్‌కి టైమయిందని ఇంతసేపూ తొందర చేసిన వ్యక్తి.. నిశ్శబ్దంగా ఏం చేస్తున్నారో చూద్దామని ఆయన భార్య సరోజమ్మ డ్రాయింగ్ రూమ్‌లోకి తొంగి చూసింది. భర్త ధ్యానం చేస్తున్నట్లుగా ఉండటం గమనించి, గాభరా అయినా సంబాళించుకుని అంది "ఏమండీ, ఫోన్ పట్టుకుని ఉండిపోయారేమిటి? ఎవరినుంచా ఫోన్? "

నాగేశ్వర్రావు ఆవిడ మాటలకి ఉలిక్కిపడి, నిద్రనుంచి మేలుకున్నట్లు చూశారు. ఆవిడేమంటోందో అర్థంకానట్లు కళ్లు పెద్దవి చేశారు. "ఏమయింది? మైమరిచిపోయేంతలా ఏం జరిగింది? " అన్న ఆమె ప్రశ్నకి, ఈ లోకంలోకి పూర్తిగా వచ్చేసిన మనిషిలా మారారు. పెద్దగా నిట్టూరుస్తూ "రాంగ్ నంబర్" అని లేచి డ్రస్ మార్చుకోవడానికి పక్క రూంలోకి వెళ్లారు.

"రాంగ్ నంబర్ అయితే, ఇంతగా షాక్ తగిలినట్లు ఎందుకయ్యారు? ఏదో దాస్తున్నారు.. ఏమయింది చెప్పండి" అంటూ ఆయన వెంటపడింది సరోజమ్మ.

"గాభరా ఏమీ లేదు. సాయంత్రం వచ్చాక చెప్తాను. పాత అనుభవాలేవో గుర్తొచ్చాయి. భయపడొద్దు. ఏం కాలేదు.. వెళ్ళొస్తాను, టైమయింది" అని డ్రస్‌చేసుకుని కారు తీసుకుని వెళ్ళిపోయారు.

నాగేశ్వర్రావుది ఒక చిన్న గార్మెంట్స్ ఫ్యాక్టరీ. అక్కడ తయారయిన దుస్తులు చాలావరకూ ఎక్స్‌పోర్ట్ చేస్తారు. వందమంది పైనే అమ్మాయిలు పనిచేస్తారక్కడ. వాళ్ళందరినీ సూపర్‌వైజ్ చేసేందుకు కొందరు ఉద్యోగులున్నారు. ఏ విధమైన ఒడుదొడుకులు లేకుండా వ్యాపారం జరిగిపోతోంది. లాభం బాగానే ఉంది. నాగేశ్వర్రావు వయస్సు అరవై దాటింది. ఇంట్లో ఆయన, ఆయన భార్య సరోజమ్మ.. ఇద్దరే. స్వంత బంగళా, కారు, బ్యాంక్ బ్యాలెన్స్ అంతా బాగానే జరుగుతోంది.

ఆఫీస్‌కి చేరి తన ఛాంబర్లో కూర్చున్నా, ఆయన మనసు స్థిమితం అవలేదు. పొద్దుటి ఫోన్‌కాల్ మరీ మరీ గుర్తొస్తోంది. ఫోన్ రింగయింది. "హలో" అనేంతలో "పప్పా" అనే రెండక్షరాల కోయిల



స్వరం వినిపించినట్లయింది. నాగేశ్వర్రావు శరీరం జలదరించింది. సున్నితమయిన, తీయని కంఠస్వరం. 'పప్పా 'అనే ఆ శబ్దంలో ప్రేమ నిండి ఉంది.

'ఆ పప్పా అనే అతనెవరో? ఆ జీవితం ధన్యం' అనిపించింది నాగేశ్వర్రావుకి.

ఆయన అదే ఆప్యాయతతో, "హలో" అన్నారు. అయితే వెంటనే తెలిసిపోయింది, అది రాంగ్ నంబర్ అని. ఇప్పుడాయన్ను అలా పిలిచేవారెవరూ లేరు. మళ్లీ "హలో" అన్నారు.

"ఇది 26573666 కాదా? " అంది కోయిల స్వరం. ఆయన అనుకున్నట్లే అయింది, "కాదమ్మా, ఇది 26572666"

"సారీ, రాంగ్ నంబర్" అంటూ కనెక్షన్ కట్ అయింది.

అదో మధుర కంఠం. అలా అనిపించుకున్నవాడిదే పుణ్యం. రోజంతా.. వారాలు, నెలలు.. ఇలాగే పిలిపించుకుంటూ ఉంటే.. ఉన్నట్లుండి నాగేశ్వర్రావు ఆ కంఠం వ్యక్తి గురించే ఆలోచన మొదలుపెట్టారు. ఎంత ఉండొచ్చు వయసు? పదహారు నుంచి పద్దెనిమిదేళ్ల కన్నా ఎక్కువ వుండదు. బాల్యం నుంచి యవ్వనంలోకి అడుగుపెడుతున్న స్వరం అది అని ఖచ్చితంగా అనిపించింది. అందమయిన అమ్మాయి. మంచి చదువుతో పాటు సంగీతం కూడా వచ్చి ఉండొచ్చు. వచ్చు కాదు, వచ్చే ఉండాలి. ఆ స్వరం అలా రాగయుక్తంగా ఉంది. సంగీతం తెలిసినట్లుంది. అమ్మాయి ఎక్కడ ఉంటోందో?

ఆమె చెప్పిన ఫోన్ నంబర్ గుర్తొచ్చింది. శ్రమలేకుండా ఫోన్ నంబర్ దొరికినందుకు సంతోషమయింది. అపరిచితులకు అలా ఫోన్ నంబర్ ఇవ్వడం ఆమెది తప్పు కదా.. అనిపించినా, తనకు సులభంగా దొరికినందుకు ఆనందించాడాయన.

నాగేశ్వర్రావుకు.. ఆ నంబరుకు ఫోన్ చేయాలని అనిపించింది. ఆ స్వరాన్ని వింటూ ఉంటే చాలనే కోరిక ఆయనలో మొదలయింది. ఆ కంఠస్వరంతో 'పప్పా' అనిపించుకోవాలని కోరిక. 'అయితే ఇప్పుడు ఆమె నన్ను అలా ఎందుకు పిలుస్తుంది? అంకుల్ అనవచ్చు. పప్పా కాని వారిని పప్పా అని ఎందుకు పిలుస్తారు? అదీకాకుండా ఆ అమ్మాయి ఇప్పుడు ఎక్కడో బయట ఉండి ఉండాలి, ఇంటికి ఫోన్ చేసుంటుంది..' అని తనను తాను నిగ్రహించుకున్నారు.

మధ్యాహ్నం అయ్యేటప్పటికి, 26573666కి ఫోన్ చేయకుండా ఉండలేననిపించింది. డయల్ చేసి, ఆ స్వరంకోసం.. రిసీవర్.. చెవి దగ్గర పెట్టుకుని కాచుకున్నారాయన. ఒక స్త్రీ గడుసు స్వరం 'హలో' అని వినిపించింది. మాట్లాడకుండా, రిసీవర్ పెట్టేశారు.

తను ఇంటికి ఇంకా రానట్లుంది. తన పిచ్చిగానీ, ఆ వయసు అమ్మాయిలు.. ఈ టైంలో ఇంట్లో ఎందుకుంటారు? కాలేజీకి వెళ్ళుంటుంది. పదహారు నుంచి పద్దెనిమిదేళ్ల మధ్య అమ్మాయి అయితే, జూనియర్ కాలేజీలో ఉంటుంది.

సాయంత్రం ప్రయత్నించి చూశారు. ఊహూ.. రాత్రి అయితే తప్పక వచ్చి ఉంటుంది అనుకుని, ఎంతో ఆశగా ఇల్లు చేరారు. సరోజమ్మకి ఉదయం సంఘటనలే గుర్తు లేవు. ఇంటికొచ్చిన నాగేశ్వర్రావు, రాత్రి చాలాసార్లు అదే నంబర్‌కి డయల్ చేసి చూసినా ఫలితం లేకపోయింది. భర్త ఫోన్‌చేయడంలో మునిగిపోయి అసలు మాట్లాడటం లేదని గుర్తించిన సరోజమ్మకి, ఉదయపు సంఘటన గుర్తొచ్చింది. వివరం అడిగి చూసినా, నాగేశ్వర్రావు.. రహస్యాన్ని విప్పిచెప్పలేదు.

ఎవరెవరో ఫోనెత్తి, 'హలో' అంటున్నారు కానీ, ఆ స్వరం మాత్రం వినిపించలేదు. ఆయన నిరాశ చెందలేదు. టెలిఫోన్ డైరెక్టరీ చేతికి తీసుకున్నారు. ఆ నంబర్ కోసం చూశారు. 'పురుషోత్తం, 11 పార్క్ రోడ్' అనే చిరునామా గుర్తుపెట్టుకున్నారు.



మరురోజు పొద్దుటే లేచి, భార్యకేదో సాకుచెప్పి, కారు తీసుకుని బయలుదేరారు. ఆరోజు వాకింగ్ కూడా వదిలేశారు. పార్క్ రోడ్‌కి వచ్చినా, నంబర్ పదకొండు వెతకడం కొంచెం కష్టమయింది. ఆ రోడ్‌లో ఇంటి నంబర్లు వరస క్రమంలో లేవు.

రోడ్‌కు రెండు వైపులా దట్టంగా పెరిగిన పెద్ద వృక్షాలు.. వీధికి పందిరి వేసినట్లుగా ఉన్నాయి. ఉత్తమ, మధ్య తరగతి వర్గం వాళ్ళే ఆ లే అవుట్‌లో ఎక్కువ మంది ఉన్నట్లున్నారు. ఒకటి లేదా రెండు అంతస్తులున్న ఇళ్ళు. చక్కని కాంపౌండ్లు, లోపల ఏపుగా పెరిగిన పూలమొక్కల మధ్య పార్క్ చేసున్న కార్లు, మోటార్‌సైకిళ్ళు కనిపిస్తున్నాయి.

పదకొండో నంబర్ గేటుకి కాస్త దూరంలో తన కారు నిలిపి చూస్తూ కూర్చున్నారాయన. అరగంట అయిన తర్వాత, చక్కగా డ్రస్ చేసుకున్న, పద్దెనిమిదేళ్ల వయసున్న అమ్మాయి కాలేజ్ బ్యాగ్‌తో బయటికొచ్చింది. గేట్ తెరిచి రోడ్‌మీదకొచ్చి ఫుట్‌పాత్ మీద నడవసాగింది. 'అవును. నా ఊహలో ఉన్న వయసు అమ్మాయి ఈమే. అమ్మాయి మంచి అందగత్తె. మేకప్ కూడా చక్కగా చేసుకుంది. లావెండర్ రంగు చుడిదార్‌లో ముద్దుగా కనిపిస్తూ ఉంది. అదంతా ఐదు అడుగుల ఏడంగుళాల ఆ అమ్మాయికి ఇంకా శోభను తెచ్చిపెడుతోంది. ఆమెను మాట్లాడిద్దామా? ఏమని మాట్లాడించేది? మాట్లాడించినా తప్పేం లేదు' అనుకున్నాడాయన. ఆమె తాత వయసుంటుంది నాగేశ్వర్రావుకి. ఆయనీ మీమాంసలో ఉండగానే అమ్మాయి, వీధి మలుపు తిరిగి కనుమరుగయింది.

★ ★ ★

రెండు రోజుల్లో నాగేశ్వర్రావు, చాలా 'ఫుట్‌వర్క్' చేశారు. ఆ అమ్మాయి ఏ కాలేజీకి వెళుతుంది? ఎన్ని గంటలకి వెళుతుంది? ఎప్పుడు తిరిగి వస్తుంది? మళ్ళీ బయటికి వెళుతుందా? ట్యూషన్‌లు, స్నేహితులు, షాపింగ్ అంటూ బయటికి వెళుతుందా? ఇలాంటి వివరాలన్నీ కనుక్కున్న తర్వాత, నేరుగా వాళ్ల ఇంట్లోకి వెళ్లడానికి నిశ్చయించుకున్నారు.

ఒక ఉదయం అమ్మాయి వెళ్లటానికి అర్ధగంట ముందుగా, వాళ్ల ఇంటి తలుపు తట్టారు. తనకంటే చిన్నవయసుండి, ఇంట్లో ఆ సమయంలో ఎలాంటి డ్రస్‌లో ఉంటారో అలాగున్న.. ఇంటి యజమాని తలుపు తెరవగానే.. నాగేశ్వర్రావు.. "పురుషోత్తమరావ్? " అని అడిగారు

"అవును. మీరు? "

అలా అన్నప్పుడు.. ఏం చెప్పాలో, ఎలా మొదలుపెట్టాలో చాలాసార్లే రిహార్సల్ చేసుకుని ఉన్నా.. ఆయనకి కాస్త ఎక్కువే తబ్బిబ్బు అయింది. పురుషోత్తం ఆయన్నింకా తలుపు దగ్గరే నించోబెట్టి ఉన్నారు.

"మీ సమయం ఐదు నిమిషాలు నా కోసం వెచ్చిస్తారా? "

హఠాత్తుగా 'డిప్లొమసీ' తోసుకుని బయటికొచ్చింది.

"తప్పకుండా. లోపలికి రండి"

గౌరవం పుట్టించే వేష-భూషణాలు, గంభీరమయిన వ్యక్తిత్వం నాగేశ్వర్రావుది. అయితే, ఫోన్ చెయ్యకుండా నేరుగా ఇంట్లోకి రావడం మాత్రం పురుషోత్తమరావుకి కొంచెం అనుమానం కలిగించింది.

వచ్చినాయనకి కూర్చోవడానికి సోఫా చూపించి, తానూ ఎదురుగా కూర్చున్నారు. మర్యాద కోసం 'ఏం తీసుకుంటారు? ' అని అడుగుదామని అనుకునేలోగా, ఇంతకు ముందు చూసిన అమ్మాయి లోపల్నుంచి డ్రాయింగ్ రూంలోకి వస్తూ కనిపించింది. ఎవరో అపరిచితులుండటం గమనించి, ఒక క్షణం నిలుచుండిపోయింది. అది చూసిన నాగేశ్వర్రావు, తనకు తెలియకుండానే లేచి నిలుచుని ఆ అమ్మాయినే చూస్తూ ఉండిపో



యారు. అమ్మాయి 'ఈ అపరిచితుని ప్రవర్తనకి సిగ్గుపడింది. సంకోచంగానే "బై అంకుల్" అని ఇంటి యజమానికి చెపుతూ, టకటకమంటూ హైహీల్స్ శబ్దం చేసుకుంటూ బయటికి వెళ్లిపోయింది.

ఆమె నోటి నుండి వచ్చిన 'బై అంకుల్' మాటలు విని, నాగేశ్వర్రావు బెలూన్‌లోంచి గాలితీసేసినంత నిరుత్సాహంతో కూర్చుండిపోయారు. తాను ఏ వ్యక్తి స్వరం వినాలని ఇంత శ్రమ తీసుకుని వచ్చారో, ఆ స్వరం 'యజమానురాలు' ఈమె కాదు.. అని మాట్లాడగానే తెలిసిపోయింది. ఇంతవరకూ చేసిన ఆలోచనలు, తను ఇంతవరకూ పడిన కష్టం అన్నీ వ్యర్థం అనిపించింది.

తన కళ్ల ఎదురుగా ఏం జరుగుతోందో అర్థం కాకున్నా, పరిస్థితిని ఒక నియంత్రణలోకి తీసుకురావడానికి ప్రయత్నం చేస్తూ, "మా చెల్లెలి కూతురు" అన్నారు పురుషోత్తం. 'అమ్మాయి రాగానే ఎందుకీయన అలా చూశాడు? లేచి నిలుచుని, షాక్ తగిలినట్లు ఎందుకు అయిపోయాడు?..' ఆయనకేమీ అర్థంకాలేదు. నాగేశ్వర్రావు నుండే అందుకు కావలసిన వివరణ వస్తుందేమో అని ఎదురుచూశారు.

"క్షమించండి. ఏదో ఉద్దేశంతో వచ్చాను. ఎలా మొదలుపెట్టాలో తెలియకుండా ఉంది. అందుకని ఇంకా నెర్వస్‌గా ఉంది.. నన్ను తప్పుగా అర్థం చేసుకోవద్దు.." అని ఆయన అంటుండగానే,

"పప్పా" అనే మాట.. ఆయన ఎదురు చూస్తున్న స్వరంలో వినిపించింది.

వెనుతిరిగి చూశారు. పన్నెండు లేదా పదమూడు సంవత్సరాల చక్కని అమ్మాయి కనిపించింది. యూనిఫామ్‌లో ముద్దుముద్దుగా ఉంది. వీపుమీద స్కూల్‌బ్యాగ్‌తో ఉంది. అక్కడ కొత్తవాళ్లెవరో ఉన్నారని చూస్తోంది. 'పప్పా' అనటం తప్పయినట్లు చూస్తోంది. ఇప్పుడు కూడా నాగేశ్వర్రావు అప్రయత్నంగా లేచి నిలుచుని అమ్మాయినే చూస్తున్నారు. అయితే ఇప్పుడాయన కళ్ళు




మెరుస్తున్నాయి. 'పప్పా.. పప్పా' అని మెల్లగా తనలో తనే గొణుగుతున్నారు. తండ్రీ-కూతుర్లిద్దరికీ, వచ్చినాయన ప్రవర్తన కాస్త అనుచితమనిపించింది. అయితే జరుగుతున్న నాటకంలో తమ ప్రవేశమెప్పుడో.. తెలియకుండా ఉంది ఇద్దరికీ.

"మీ అమ్మాయా?" చివరికి నాగేశ్వర్రావే అన్నారు.

"అవును"

"ఏ క్లాసమ్మా?"

"సిక్స్త్ క్లాస్"

"ఇలా రామ్మా"

అమ్మాయి సంకోచంగా తండ్రి వైపు చూసింది.

"ఫర్వాలేదు రామ్మా, నన్నూ, నిన్నూ ఒక సంఘటన దగ్గరికి తెచ్చింది. ఒకరోజు నువ్వు ఫోన్ చేశావు చూడు. 26573666కు చేయవలసిన ఫోన్ 26572666కి చేశావు" తన ప్రవర్తనకి వివరణ నిస్తూ అన్నారు నాగేశ్వర్రావు.

అమ్మాయికి.. వాళ్ళ నాన్న 'ఫర్వాలేదు' అన్నట్టు చూసేసరికి, ధైర్యంవచ్చింది. స్కూల్‌బ్యాగ్ పక్కనపెట్టి ఆయన దగ్గరికి వచ్చింది. తన పక్కనే కూర్చోబెట్టుకుని, ఒక చేత్తో దగ్గరికి తీసుకున్నారు. తలమీద ముద్దుపెట్టుకుని, బుగ్గలమీద ఎంతో ప్రేమగా తడిమారు.

"ఈ పాప గతంలోని మా అనుభవాలని కదిపింది. ఆమె చేసింది రాంగ్ నంబర్ అయినా.. 'పప్పా' అనే శబ్దం, దాంతోపాటే వినవస్తున్న ఆ స్వరం.. మళ్ళీ మళ్ళీ వినాలన్న కోరిక నాలో కలిగించింది. నా ప్రవర్తన మీకు అసహజంగా కనిపించవచ్చు, అమ్మాయికి కూడా. అవునూ. నీ పేరేమిటమ్మా పాపా?"

"లహరి"

"ఓహ్! లహరి! స్వరానికి తగిన పేరు. మరిక నువ్వు లోపలికెళ్ళమ్మా. నాకు మీ నాన్నగారితో కాస్త పని ఉంది" అన్నారు నాగేశ్వర్రావు.

"రావుగారూ! ఒకరోజు ఉదయం ఫోన్ వచ్చింది. 'పప్పా' అనే ఆ మొదటి శబ్దంతో, నా శరీరంలోని నరాలన్నీ మీటినట్లయింది. ఆ తీయని శబ్దానికి, నేను స్టన్ అయిపోయాను. నా గత స్మృతులేవో వెలికితీసినట్లయింది. నా కూతురి స్వరం అది. సుమారు పదిహేనేళ్ళ క్రితం కనుమరుగయిన మా అమ్మాయి కూడా స్వరం ఇలాగే ఉండేది.."

తర్వాతి అరగంట సమయమూ.. నాగేశ్వర్రావు మాటలను, పురుషోత్తం వింటూనే ఉన్నారు. మధ్యలో అమ్మాయి.. స్కూల్‌కి టైమయిందని బయటికొచ్చింది. 'బై పప్పా', 'బై అంకుల్' అనటం తప్ప, మాటలన్నీ నాగేశ్వర్రావువే. ఆయన కళ్ళలో నీళ్ళు నిండాయి. కంఠం గద్గదమయింది. మధ్య మధ్య ..మాటలు రావడం కష్టమయింది.

ఉన్న ఒక్క ఆడపిల్లనీ ముద్దుగా పెంచి పెద్దచేశారు. అతి శ్రావ్యమయిన కంఠస్వరం ఆమెది. 'పప్పా.. పప్పా' అని పిలిచే విధానం, ఆ మాటలు ఆమె స్వరంనుండి బయటికి వచ్చే విధం, పాప పెరిగి అమ్మాయి అవటం, కాలేజీలో చేరడం, ఆమె అందం ద్విగుణీకృతమవడం, స్వరం ఇంకా మధురం కావడం..ఇలా చెప్తూనే ఉన్నారు.

అయితే ఒకరోజు, ఆ స్వరం కర్ణకఠోరమయి మిగిలిపోయింది! కూతురు ఎవరో అబ్బాయి వెంట తిరుగుతున్నదని ఎవరి ద్వారానో తెలిసి, కోప్పడ్డారు. మరో మాట లేకుండా ఆ విషయాన్ని ఒప్పుకుంది. అతడినే పెళ్ళి చేసుకుంటానని చల్లగా జవాబిచ్చింది. అబ్బాయి ఎవరని తెలిశాక అమ్మానాన్నలిద్దరికీ గుండెలు ఆగినంత పని అయింది. 'మర్రి రౌడీ" అనే వాడి పేరు.. ఇంకా కొంతమంది అమ్మాయిల పేర్లతో కలిసి వినిపించటం తెలుసు.

ఎన్నో రకాలుగా బుద్ధిచెప్పటం, అడగటం, బలవంతం, బ్లాక్‌మెయిల్, వేడుకోవడం, జబర్దస్తీ.. ఏవీ ఫలితాన్నివ్వలేదు. దాంతో విసుగుపుట్టి, ఇల్లు విడిచి పొమ్మంటే.. గడపదాటి వెళ్ళిపోవడమే ఆఖరు! ఆ తర్వాత ముఖం చూపించడం కాదుకదా, ఒక ఫోన్ కాల్ కూడా లేదు. మూడు పూటలా మనస్తాపం, కన్నీరు, విషాదం. పండుగ- పబ్బాలు చేయటం నిలిచిపోయింది. ఎక్కడైనా కన్యాదానం జరుగుతుండటం చూస్తే నిరాశ, నిరుత్సాహం. బంధువులు అడిగే ప్రశ్నలకి జవాబు చెప్పలేక, పెళ్ళిళ్ళకి వెళ్ళటం కూడా మానేశారు.

పురుషోత్తం నోరు కట్టేసినట్లు అయింది. ఎలా రియాక్ట్ అవాలో అర్థంకాలేదు.

"పొద్దున్నే వచ్చి మీ తలతింటున్నాను. క్షమించండి. మీకు ఒకే ఒక రిక్వెస్ట్. ఈ ముసలాయన చాలా అతి చేస్తున్నాడని మీకు అనిపించినా ఫర్వాలేదు. లహరిని నేను అప్పుడప్పుడొచ్చి చూడవచ్చా? మాట్లాడించవచ్చా? "

పురుషోత్తంకి 'పాపం, చాలా బాధపడిన మనిషి' అనిపించి.. సులభంగానే అంగీకరించారు.

వారంలోపలే, నాగేశ్వర్రావు వచ్చి లహరిని కార్లో బయటికి తీసుకెళ్ళటం మొదలుపెట్టారు. ఇంటికి కూడా తీసుకెళ్ళి రకరకాల బహుమతులు, డ్రస్‌లు, ఐస్‌క్రీం, చాకొలేట్స్ ఇప్పించసాగారు. పురుషోత్తం భార్యకి ఏదో అతిగా అనిపించింది. 'మగవాళ్లకి ఇదంతా ఎందుకు అర్థంకాదు? ' అనుకుంది. లహరి మాత్రం సంతోషంగా ఉంది.

భార్య మాటలవల్ల పురుషోత్తం మనసులో కూడా అనుమానం తలెత్తింది. దానికితోడు టీవీలో చూపించిన ఒక గోవా వార్త! ఆయనకి చురుకు తగిలినట్లయింది. 'ఈయన.. పిల్లలను లైంగిక పనులకు ఉపయోగించే మనిషి కాదుకదా..' అనిపించింది. ముసలాయన అందమయిన కథ కల్పించి చెప్పి నమ్మించాడని తోస్తోంది. 'వయసుకొస్తున్న అమ్మాయి.. పుష్టిగా పెరిగింది. అయినా ఆ రకమయిన ఆసక్తి కలిగేంత వయసు కాదులే' అని సమాధానం చెప్పుకున్నారు. 'జరుగుతున్నది ఎలా ఆపాలి' అని ఆయన తల్లడిల్లుతుండగానే, నాగేశ్వర్రావు రాక!

"ఏదీ.. లహరి? " అంటున్నంతలోనే, లహరి గెంతుకుంటూ బయటికొచ్చింది.

"రావుగారూ, ఇకనుంచి పాపకి, మీకు కూడా కష్టం కలిగించను. ఆమె స్వరం నాకు వినిపిస్తుంటే చాలు, అందుకే ఈ అరేంజ్‌మెంట్" అంటూనే ఆకర్షణీయంగా కనిపిస్తున్న కొత్త మొబైల్ ఫోన్‌సెట్టును అమ్మాయి చేతిలో ఉంచారు. లహరి కళ్ళు మెరిశాయి. ఆమెకి సంతోషంతో పాటు, అంత ఖరీదయిన వస్తువు బహుమతిగా రావటం ఆశ్చర్యంగా ఉంది. ఆయన నిజాయతీని శంకించినందుకు కాస్తంత పశ్చాత్తాపం అనిపించింది పురుషోత్తంకి.

"కనెక్ట్ అయింది. ఫోన్‌బిల్ కూడా నేనే కడతాను. నీ స్వరం నా చెవిన పడుతుంటే అంతే చాలు"

లహరి ఆయన భుజంమీద తలపెట్టి, రెండు చేతులూ ఆయన మెడచుట్టూ వేసింది. చెంపమీద ముద్దుపెట్టి "థాంక్స్ తాతా" అంది. ఆయన్ని ' తాతా' అనటం ఇదే మొదట. " ఓహ్, తాతనా నేను? ఏదీ ఇంకొకసారి అనమ్మా" అని తాను కూడా లహరి నుదుటిమీద ముద్దుపెట్టుకున్నారు.

★ ★ ★

నెలరోజులు గడిచాయి.

"ఏమే చిన్నీ! మీ నాగేశ్వర్రావు తాత ఏరీ? పత్తాలేరే? మొబైల్ కూడా రింగ్ అవటం లేదు"!

పాపలో ఉలుకూ పలుకూ లేదు. ముఖం దీనంగా ఉంది. కళ్లలో నీళ్లు.

"ఏమే మాట్లాడవు? ఎనీథింగ్ రాంగ్? "

అవునని తల పైకీ కిందకీ ఊపింది.

ఏమయిందని వాళ్లక్కయ్య చూపులతోనే ప్రశ్నించింది. ఆమె చెవి దగ్గర ముఖం చేర్చి "టూ కొట్టాను" అని చిన్నగా అంది లహరి.

"ఎందుకూ? " అని మళ్లీ ప్రశ్న.

"తాత కాదు, అది భూతం. అదీ ఒద్దు, ఆ మొబైలూ ఒద్దు"

"ఏమయింది చిన్నీ, సరిగ్గా చెప్పు? "

"హి టచ్డ్.. అన్ టచబుల్స్" చెవిలో చెప్పింది.

"అంటే ఏంటే? అర్థం కాకుండా మాట్లాడుతున్నావెందుకు? "

అక్క చేతిని తన చేతిలోకి తీసుకుంది. తన తొడల మధ్య, ఎదమీద ఉంచింది. "ఇక్కడంతా నిమురుతాడే" అంటూ ఏడుపు ముఖం పెట్టింది. "షిట్" అంటూ కోపంతో ఆ మొబైలును ఎత్తి నేలకేసి కొట్టింది. అయినా ఏమీ జరగనట్టే అందులోంచీ వినిపిస్తోంది.. 'మీరు ఫోన్ చేసిన చందాదారుడు ఇంకొక కాల్‌లో బిజీగా ఉన్నారు. దయచేసి కొద్దిసేపు ఆగి ప్రయత్నించండి'

"నువ్వేం చేశావు? ఊరికే వచ్చావా? ".. గొణిగింది అక్కయ్య.

అమ్మాయి ముఖంలో చిరునవ్వుతో పాటు, కొంటెతనం కూడా తొంగిచూసింది.

బొటనవేలు, చూపుడువేలికి మధ్యలో ఉన్న ఆ వస్తువును చూపించింది.

అదొక గుండుసూది!

తెలుగు కథ

-ఇంద్రగంటి జానకీబాల



# వేయిన్నొకటి

ఆదిలక్ష్మికి ఆక్రోశంగా వుంది. ఆ దుఃఖం ఆమెని ఒక్క నిముషం కూడా స్థిమితంగా నిలబడనీయడంలేదు. మూడు రోజులుగా గుక్కెడు నీళ్లు తాగిందేమో గానీ, పట్టెడు అన్నం తినలేదు. రెండు చుక్కల పాలుగానీ, కాఫీగానీ, టీగానీ తాగలేదు. ఇంక ఫలహారం గురించి చెప్పేదేముంది. ఇంట్లో ఎవ్వరికీ సరిగ్గా తెలీదు సంగతి. ఆమెందుకు బాధపడుతోందో కూడా ఎవరికీ తెలీదు. అసలు బాధపడుతోందని కూడా తెలీదు. ఆమె తిన్నదీ, లేనిదీ పట్టించుకున్నవారు లేరు.

ఇంక ఈ నరకబాధ తను భరించలేననుకుంది ఆదిలక్ష్మి. తనకి విముక్తికావాలి. ఈ బాధ కొద్దికాలానికి అనేక రకాల అవమానాలకి దారి తీస్తుందని ఊహించింది. తల్లిగా తను తలవంచుకుని ఆ అవమానం స్వీకరించలేనని నిర్ణయించుకుంది.

పాతిక నిద్రమాత్రలు ఒలుచుకుని పెట్టుకుంది. రెండు బాటిల్స్ నీళ్లు ఎదురుగా పెట్టుకొని కళ్లనీళ్లు పెట్టుకుంది. ఒక్కక్షణంలో దుఃఖం వరదలా పొంగుకొచ్చేసింది. అంతలోనే చచ్చిపోవడానికి ధైర్యాన్ని కూడదీసుకుంది.

గుప్పెట్లో మాత్రలు అంచెలంచెలుగా మింగి నీళ్లన్నీ తాగేసింది. కనీసం అరగంట వ్యవధి వుంటుంది కదా అనుకుంది. జరిగింది మళ్లీ మళ్లీ ఆమె మస్తిష్కంలో గిరగిరా తిరుగుతూ పిండిమరలా రొదచేయడం మొదలుపెట్టింది. మగత కమ్మేసేలోగా, ఆమె మనసు చురుకుగా గతాన్ని నెమరువేసింది.

★ ★ ★

సంధ్య.. ఇంట్లో అడుగుపెడుతూనే "వదినా! వదినా!" అంటూ విసురుగా పిలుస్తూ వచ్చింది. ఆ విసురులో ఉత్సాహం కలగలిసి వుంది. ఆదిలక్ష్మి "రావమ్మా రా- అందాల హడావిడి ఆడపడుచా" అంటూ వెళ్లి వాటేసుకుంది.

"ఏం ఆడపడుచో.. ఒక మర్యాద లేదు, మన్ననలేదు. అన్నింటికీ నేనే ఎదురురావాలి గానీ- నువ్వు కదలవు కదా!" అందామె.

"ఇప్పుడు నీకొచ్చిన లోటేవిటి? ముందా విషయం చెప్పు" అంది బుజ్జగింపుగా ఆదిలక్ష్మి.

సంధ్య మూతి మూడు వంకర్లు తిప్పి "కబుర్లకేం లోటులేదు" అంది.

ఇంతలో వాసు గదిలోంచి బయటకొచ్చి "ఏవిటే సందీ- రావడమే తుపానులా వచ్చావు. అంతా బాగున్నారా" అన్నాడు.

"నువ్వా ఇక్కడే వున్నావా? మరీ మంచిది. ఇద్దర్నీ కలిపి ఒకేసారి అడిగేస్తాను" అంది సంధ్య.

“అడగవమ్మా! నీకన్నా మాకు పరాయి వాళ్లెవరున్నారు” అంటూ కొంటెమాట విసిరాడు అన్నయ్య వాసు.

“అన్నయ్యా! ఇది వేళాకోళం కాదు. సీరియస్” అంది.

“ఇంతకీ సంగతేవిటో చెప్పు”

“మా సాకేత్‌కి ఉషనిస్తారా? లేదా? ” అంది.

ఆదిలక్ష్మి చటుక్కున వెళ్లి ఆడపడుచు చేతులు పట్టుకుంది.

“ఎంతమాటన్నావు సంధ్యా” అని కుర్చీలో కూర్చోబెట్టింది.

“మేమిద్దరం వద్దామనుకుంటున్నాం. నిన్నూ, మీ ఆయన్నీ ఇదే విషయం అడగాలని” అంది.

“ఏదీ? రాలేదుగా!”

“ఉష ఈ వారం చివర్లో వచ్చేస్తుంది. దానికిక్కడకి ట్రాన్స్‌ఫరైంది. వచ్చిన వెంటనే దానితో ఒకమాట చెప్పి..” అంటూ ఆగాడు వాసు.

“అంటే నీ కూతురికి కొత్తగా చెప్పాలన్న మాట” అందామె బుంగమూతిపెట్టి. “మా సాకేత్‌తో నేనేం మాట్లాడలేదు. నేనెంతంటే అంతే వాడికి” అంది.

“మరీ పాతకాలం మాటలు మాట్లాడకు. ఎదిగిన పిల్లలు. చదువుకీ, ఉద్యోగాలకీ.. ఊళ్లుపట్టుకు తిరుగుతున్నవాళ్లు” నెమ్మదిగా అంది ఆదిలక్ష్మి.

అందరూ కబుర్లలోపడి, జోక్స్ వేసుకుంటూ, వేళాకోళాలు చేసుకుంటూ గడిపేశారు. ఆ రాత్రే సంధ్య రిజర్వేషన్ వుందని వెళ్లిపోయింది. ఆదిలక్ష్మి ఆనందంతో ఆకాశంలో ఎగురుతోంది.

నాలుగు రోజుల తర్వాత ఆదివారం ఉదయం ఉష దిగింది. వస్తూనే గలగల మాట్లాడుతూ అందర్నీ అలరించింది. అరగంటలోనే ఆదిలక్ష్మి.. కూతురికి చెప్పింది. “మొన్ననే సంధ్యత్త వచ్చి వెళ్లింది”

“ఉండాల్సింది, నేనొచ్చేవరకు”

“దానికి సంసారం ఉంది కదా! ఇంతకీ అంత అర్జంటుగా ఎందుకొచ్చిందో తెలుసా? ”

“నాకేం తెలుసు. మీరు చెప్తేకదా”

“నీ పెళ్లి బావతో ఖాయం చేసుకుందామని..”

ఉష ముఖం చిన్నబోయింది.

“నువ్వేమన్నావు? ” అంది తల్లివైపు చూడకుండా.

“అనడానికేముంది? ఎప్పట్నించో అనుకుంటున్నదే కదా!”

ఉష మాట్లాడలేదు. లోపలికెళ్లిపోయింది. ఆదిలక్ష్మి గుండెల్లో రాయిపడింది.

ఉష బొద్దుగా, తెల్లగా వుంటుంది. చూడంగానే ఆకర్షణీయంగా వుంటుంది. దూరంనుంచి చూసినా, మెత్తగా దూదిపింజలా వుంటుందామె ఒళ్ళు అనిపిస్తుంది. బొద్దుగా వున్నప్పటికీ మహా చలాకీగా వుంటుంది. గలగల మాట్లాడేస్తూ, పకపకా నవ్వేస్తూ, చెంగుచెంగున గెంతేస్తూ తిరిగేస్తుంటుంది. ఆ గుణాలన్నీ మేనత్త సంధ్యకి ఎంతో ఇష్టం. ఎప్పట్నించో ..ఉష తన కోడలని.. చెప్పుకుని మురిసిపోతూ ఉంటుంది. దానికి తగ్గట్టుగా సంధ్యకి అందమైన ఆరడుగుల కొడుకున్నాడు. అతనికి అందరూ ఆశించే ఇంజనీరింగ్ చదువుంది. ఈ మధ్యనే మంచి జీతంతో ఉద్యోగమొచ్చింది. అలాంటి సంబంధం మామూలుగా తీసుకురావాలంటే లక్షలు పొయ్యాలి. కావలసిన సంబంధం, కావాలని చేసుకోవడంవల్ల చాలా బాధలు ఉండవు. ఆదిలక్ష్మి దేనికీ లోటు చెయ్యదు. సంధ్య పేచీలూ పెట్టదు.

ఒక్కొక్కసారి ఆదిలక్ష్మికి కూతుర్ని చూస్తే భయమేస్తోంది. ఇక్కడే ఇంజనీరింగ్ చదివినంతకాలం తల్లి కొంగుపట్టుకుని తిరిగేది. తల్లి చెప్పినట్టు.. డ్రస్సు, డ్రస్ రంగు, జుట్టు, బొట్టూ. అన్నీ అమ్మ చెప్పినట్టే. రెండేళ్ల క్రితం బెంగుళూరులో ఉద్యోగం వచ్చి. వెళ్లింది. అంతే పూర్తిగా మారిపోయింది. తల్లిని చూస్తే ఒకటే విసుగు. ఆమె దగ్గర కూర్చుని ఒక్కక్షణం కూడా మాట్లాడేందుకు ఇష్టపడటం లేదు. ఏదో ఒక వంక పెట్టుకుని తుర్రుమని పారిపోతోంది. బట్టల సెలెక్షనే కాదు, రంగుల ఎంపికా మారిపోయింది. తల్లి ఏది చెప్పినా విసుగే, విదిలించి పారేయడమే. ఆదిలక్ష్మికి ఎంతో అవమానం కలిగినా, కన్నకూతురు కదాని సర్దుకుపోతోంది. మనసులో ఆమెకి చిన్న భయం బయలుదేరింది. తనతో ప్రవర్తించినట్టే సంధ్యతో కూడా ప్రవర్తిస్తే ఏం బాగుంటుందీ.. అని భయంగా ఉంది.

ఈరోజు పెళ్లిమాట చెప్పగానే ముఖం ముడుచుకు వెళ్లిపోయింది కూతురు.

ఆదిలక్ష్మి అందరు దేవుళ్లకీ మొక్కుకుంది, ఉష మనసులో వేరే ఊహలేమీ లేకుండా చెయ్యమని...

‘ఈ రాత్రి ఉషని గట్టిగా పట్టుకుని విషయం తేల్చేయాలి. మొన్న సంధ్య వచ్చి అడిగితే ప్రాణం చచ్చిపోయినట్టనిపించింది. వదిన వెక్కిరించింది కూడా, ఆడపడుచు వచ్చి అడగడం ఎక్కడా చూళ్లేదు. ఏమైనా మీ ఆడబిడ్డ మంచిది అంటూ తనకి ఒక చురకా వేసింది. చదువులు పెద్దగా చదివినా, వేరే ఊళ్లకి ఉద్యోగానికి వద్దు అంటే వినిపించుకున్నవారెవరు? బాహాటంగా బయట మసలుతుంటే, తల్లిదండ్రులకి దూరంగా.. స్నేహాలు, షికార్లు, సినిమాలు, ప్రేమలు-పెళ్లిళ్లు అంటూ మొదలవుతాయి. తీరా వాళ్లొక నిర్ణయానికొచ్చాక మనం చచ్చి గీపెట్టినా లాభం వుండదని ఆమె చాలా సార్లంది కానీ.. తను వినిపించుకోలేదు’..

ఆదిలక్ష్మి వేగంగా ఆలోచిస్తూ, నాలుగ్గంటలకే వంట పూర్తి చేసి కూర్చుంది. చీకటి పడగానే ఉషని డాబామీదకి తీసుకెళ్లి నాలుగు విషయాలు స్పష్టంగా చెప్పాలి. ముఖ్యంగా దాని చేతిలో సెల్‌ఫోన్ లేకుండా చూడాలి. లేకపోతే, తను మాట్లాడగానే అది మోగుతుంది. ఇక అంతే, పకపకలు- వికవికలు.. ఓ పట్టానది పూర్తి కాదు. చెప్పేది మధ్యలో ఆగిపోతుంది. మళ్లీ మొదటికొస్తుంది. ‘ఇంతకీ ఏమిటీ’ అంటూ విసుగ్గా ముఖంపెట్టి తనేం చెప్పినా ‘సర్లే చూద్దాం’ అంటూ చక్కాబోతుంది. ఈరోజలా జరక్కుండా చూడాలి. గట్టిగా పట్టుకుని ‘ఊ’ అనిపించి వదలాలి.. ఆదిలక్ష్మి గట్టి నిర్ణయంతో స్థిమిత

పడింది.

సరిగ్గా సాయంత్రం అయిదున్నరకి రెండు బ్యాగులతో సమీర ఆటోదిగింది. ఆదిలక్ష్మికి ఒళ్లు మండిపోయింది. ఉత్సాహమంతా ఉఫ్‌మని ఎగిరిపోయింది. మామూలుగానే ఉష 'ఆకుకందదు పోకకు పొందదు' అన్నట్టు వుంటుంది. ఇంక ఈ సమీర వచ్చిందంటే తనకేం దొరుకుతుంది?

ఆదిలక్ష్మి నీరుకారిపోయింది. ఉష ఉత్సాహంతో పరిగెట్టుకెళ్లి ఫ్రెండుని వాటేసుకుంది. ముఖం మాడ్చుకున్నా మర్యాద కోసం పలకరించింది ఆదిలక్ష్మి. తన సమస్య భూతంలా ఆమెను భయపెట్టడం మొదలుపెట్టింది.

ఇద్దరూ చేతులు కలుపుకుని ఎడతెరిపి లేకుండా మాట్లాడేసుకుంటుంటే.. ఆ తండ్రి వాళ్ల స్నేహం చూసి మహదానందపడిపోతున్నారు. చూసినకొద్దీ ఆదిలక్ష్మికి చిరాకు పెరిగిపోతోంది.

ఆదిలక్ష్మి దృష్టితో చూస్తే సమీర చీదరగానే అనిపిస్తుంది. మగరాయుళ్లా క్రాపు కొట్టించుకుంది. మడమల దగ్గర చిరిగి చీలికలైన జీన్స్ ప్యాంటు వేసుకుంది. ఎర్రటి టీషర్టు పాతగా వున్నది..వేసుకుంది. దానివెనుక 'కిస్ మీ' అని పెద్ద అక్షరాలు వెక్కిరిస్తున్నాయి. 'ఉద్యోగానికి ఇలాంటి డ్రస్ వేసుకునే వెళ్తుందా' అని చిరాకు పడిపోయింది ఆదిలక్ష్మి.

ఉష మాత్రం తల్లి భావాలేం పట్టించుకోవడం లేదు. హాయిగా వాళ్లు మాట్లాడేసుకుంటున్నారు. ఇద్దరూ ఏడాదిగా సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లుగా బెంగుళూరులో పనిచేస్తున్నారు. ఇద్దరూ ఇక్కడి బ్రాంచ్‌కి ట్రాన్స్‌ఫరై వచ్చేశారు. కూతురొచ్చిందని ఆనందపడబోతుండగా, వెనకాలే తోకలా సమీర వచ్చేసరికి ఆదిలక్ష్మి చిరచిరలాడిపోతోంది. ఆమె మనోభావాలు కొంతవరకు పసిగట్టిన వాసుదేవరావు ఆశ్చర్యపోయాడు. పిల్ల.. స్నేహితులు రావడం - వాళ్లు ఆంటీ ఆంటీ అంటూ ఆమె వెంట తిరగడం - ఆమె కూడా వాళ్లని ఉషతో సమానంగా ఆదరించి ప్రేమించటం ఎప్పుడూ జరిగే విషయమే. మరెందుకిలా? ఉష.. పెళ్లి విషయంలో నిర్లక్ష్యంగా వుందని ఆమె బాధపడుతోందని అతనికర్థమైంది. ఉషతో మాట్లాడటానికి అవకాశం ఇవ్వటం లేదని అవమానపడిపోతోందని కూడా.. అతనికి కొంత అర్థమైంది.

★ ★ ★

ఉదయం ఎనిమిదిన్నరైంది. నిన్న ఆరేసిన బట్టలు డాబామీదే మర్చిపోవడం వల్ల, అవి తీసుకొచ్చి కింద ఆరేద్దామని..బయలుదేరింది ఆదిలక్ష్మి. ఉష, సమీరా ఇంకా నిద్ర లేవలేదేమిటని డాబా మీద వున్న సింగిల్ బెడ్‌రూంలోకి అడుగుపెట్టింది. లోపల గడియవేసి లేకపోవడంతో తలుపుతోసుకుని లోపలికి వెళ్లిన ఆమె అవాక్కయి, స్థాణువులా వుండిపోయింది. ఇద్దరూ ఒకే మంచంమీద మెలికలు చుట్టుకుపోయిన పాముల్లా పడుకుని ఉన్నారు. వంటి మీద బట్టలు అంతంత మాత్రంగా వున్నాయి. ఒక్క నిముషంలో ఆదిలక్ష్మికి అంతా అర్థమైపోయింది. ఒళ్లంతా గజగజ వణికిపోయింది. ముఖంలోకి వేడిగా, వేగంగా రక్తపోటు తన్నేసినట్లుగా అయిపోయింది. వాళ్లని లేపాలని గానీ, వాళ్ల ముఖాలు చూడాలనిగానీ అనిపించలేదు. మెట్లమీంచి దొర్లిపోతానేమోనని భయపడుతూనే పరుగులాంటి నడకతో కిందకొచ్చేసి, తమ బెడ్‌రూంలో మంచంమీద వాలిపోయింది.

ఆ తర్వాత రోజంతా వాళ్లిద్దరికీ ఎదురుపడకుండా తప్పించుకుని మసలింది. వాళ్లసలు ఈమెనుగానీ, ఇంటి వాతావరణాన్నిగానీ పట్టించుకునే స్థితిలో లేరు. ఆదిలక్ష్మిలో కోపం తారస్థాయికి చేరుకుంది. ఉషని పీకపిసికి చంపేద్దామని చాలాసార్లు లేచింది. కానీ తమాయించుకుంది. భర్తతో ఈ సంగతి చెప్దామని ముందుగా అనుకుంది. కానీ అతనొక విచిత్రమైన మనిషి. భార్య ఏది చెప్పినా, దాన్ని వ్యతిరేకించటం, సంభాషణని పక్కదారి పట్టించటం - చివరికి ఆమెనొక ఫూల్‌గా చూసి, గేలిచేసి వదిలేయడం సర్వసాధారణం. అతను స్థిమితంగా..తను చెప్పింది వింటాడనే నమ్మకం.. ఎంత ఆలోచించినా కలగలేదు. అందుచేత ఆమె ఒక అవ





మానంలోకి, ఒక విషాదంలోకి, ఒక నిరాశలోకి జారిపోయింది. అప్పుడామెకి ఒక్కటే మార్గం కనిపించింది. తనీ పరిస్థితుల్ని ఎదుర్కొంటూ అవమానంతో ఉండలేదు. దోషిలా అందరిముందూ సంజాయిషీ ఇచ్చుకుంటూ నిలబడే శక్తి తనకి లేదు. తనీ పరిస్థితి నుంచి నిష్క్రమించాలంటే 'చచ్చిపోవాలి.. అదొక్కటే సరైన పరిష్కారం' అని గట్టిగా అనిపించింది.

★ ★ ★

"అమ్మా! నిద్రపోకండి - అమ్మా! కళ్లు తెరవండి- కళ్లు తెరవండి. నిద్రపోకండి" అంటూ నర్స్ ఆమెని కుదిపేస్తోంది.

ఆదిలక్ష్మికంతా అమోమయంగా వుంది. అతికష్టంమీద కళ్లు తెరుస్తోంది, మూసుకుపోతున్నాయి. తెరిపి మరుపులుగా ఒక్కొక్కటీ గుర్తుకొస్తున్నాయి.

మూడు రోజులు ట్రీట్‌మెంట్ చేశాక, 'ప్రాణానికి ప్రమాదం లేద'ని తేల్చిచెప్పారు. ఎక్కువ టాబ్లెట్స్ మింగేయడం, ఇంట్లో వాళ్లు ఆలస్యంగా చూసి హాస్పిటల్‌కి తీసుకురావడం.. ప్రాణంమీదికి తీసుకొచ్చాయి. అయితే సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్‌వారు.. అంచులదాకా వెళ్లిపోయిన ఆదిలక్ష్మిని వెనక్కిలాక్కొచ్చారు.

వాసుదేవరావు కంగారుపడిపోయాడు. అతనికీ, భార్య ఆదిలక్ష్మికీ పెద్దగా గొడవలేం లేవు. ఆత్మహత్యకి పాల్పడేటంత పరిస్థితి ఎందుకొచ్చిందో అర్థం కాలేదు.

"ఒకవేళ దానికిష్టం లేకపోతే, ఇష్టమైనవాడినే చేసుకోనీండి. దానికింత గొడవపడి ప్రాణాల మీదికి వదినెందుకు తెచ్చుకుందో తెలీటం లేదు" అంటూ సంధ్య వలవలా ఏడ్చింది.

ఆర్నెల్లు హడావిడిగా గడిచిపోయాయి. వాసుదేవరావుకి విషయం అర్థమైంది. కలవరపడ్డాడు. ఉషకి ఎంతో నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు. ఆమె వినలేదు. సమీరని వదిలి తనుండలేనని చెప్పేసింది. ఆ చెప్పిన మూడు రోజులకి ఉష-సమీర కలిసి వేరే ఫ్లాట్ తీసుకుని దూరంగా వెళ్లిపోయారు. తల్లి పరిస్థితి చూసినా ఆమె పెద్దగా చలించలేదు. అదొక ఉన్మాదస్థితిగా అర్థంచేసుకుని తండ్రి తలబాదుకున్నాడు.

"వైద్యపరంగా నీ జీవన విధానం మంచిదికాదు. స్వలింగ సంపర్కం వల్ల ఎయిడ్స్ వచ్చే ప్రమాదం వుందని వైద్యనిపుణులు చెప్తున్నారు" అన్నాడు వాసుదేవరావు ఉషని పట్టుకుని చివరిగా. ఆమె అదేం పట్టించుకోకుండా వెళ్లిపోయింది.

దగ్గర మిత్రులు ఆమెకి కౌన్సిలింగ్ చేయించమన్నారు. ఆమె వాళ్ల దగ్గరగా మసిలితేనే కదా.. ఏదైనా ప్రయత్నం..! వాసుదేవరావు.. ఆదిలక్ష్మి మీదనే దృష్టి నిలిపాడు. ఏమైనా ఆమెని రక్షించుకోవాలని తీవ్ర ప్రయత్నాలు మొదలుపెట్టాడు. ఆదిలక్ష్మి స్తబ్దుగా, నిరాసక్తంగా, పిచ్చిచూపులు చూస్తూ ఉండిపోయింది. 'ఆరోగ్యం బాగానే వుంది. ఆమెకే కౌన్సెలింగ్ చేస్తే, ఆలోచనా ధోరణి మారుతుంద'ని చెప్పారు. వాస్తవాన్ని యథాతథంగా స్వీకరించే శక్తి వస్తుందని చెప్పారు.

'ఆమెకి కాస్త ఉత్సాహం, సంతోషం కలిగే వాతావరణం కల్పించండి. పిల్లలు ఎంపిక చేసుకున్న జీవన విధానాన్ని బట్టి తమ ఇంటి పరువు, ప్రతిష్ఠ పోతాయనీ తల్లిదండ్రులు భావించకూడదు. పిల్లలు మనలాగే ఆలోచించి, మన ఆచారాలు, అభిప్రాయాలు తు.చ. తప్పకుండా అనుసరిస్తారని, మనం చెప్పిన పెళ్లి చేసుకుంటారనీ ఆశించకూడదు. రాజకీయ, సామాజిక, ఆర్థికపరమైన మార్పులు వేగంగా వస్తూన్న సమయంలో కన్నపిల్లలు పదహారేళ్లు దాటినప్పటి నుంచీ వారి అభిప్రాయాలు, ఆలోచనలు వారే ఏర్పరచుకుంటారని తల్లిదండ్రులు గ్రహించాలి. కులం, మతం, చదువు, సంపాదన, పెళ్లి గురించి వారి సొంత భావాలు ఏర్పరచుకుంటారు. వారు కులాంతర వివాహం చేసుకున్నారనో, మతం మార్చుకున్నారనో, వేరే రకమైన జీవన విధానాన్ని ఎంచుకున్నారనో.. మన పరువు ప్రతిష్ఠలు పోయాయని బాధపడటం అజ్ఞానమే అవుతుంది. తల్లిదండ్రులకి అవి తప్పుగా, చెడుమార్గాలుగా తోచవచ్చు. కానీ వారి జీవితాలు వారే జీవించాలి కనుక, వారి కష్టసుఖాలు వారే ఎదుర్కోవాలి కనుక, తల్లిదండ్రులు ఏమీ చేయలేరు. ఇది ఆడపిల్లలైనా, మగపిల్లలైనా ఒకటే. మన జీవితాలేకాక పిల్లలి జీవితాలు కూడా మనమే జీవించాలనుకోవడం తల్లిదండ్రుల వెర్రే అవుతుంది- నిజమే. అహం దెబ్బతింటుంది. కోపంతో మనసు రగిలిపోతుంది. క్రోధం పెరుగుతుంది. మనసుకి సుఖముండదు.

ఆడపిల్ల మగపిల్లవాడ్ని ప్రేమించాలి. మగపిల్లవాడు ఆడపిల్లని కోరుకోవాలి. ఇది సహజం. కానీ ఒక్కొక్కసారి అసహజంగా ఈ హోమో సెక్సువల్ అనుబంధం ఏర్పడే అవకాశమూ వుంటుంది. మన సంస్కృతిలో ఇవేమీలేవని, ఇవన్నీ పాశ్చాత్య దేశాల ప్రభావం అనీ మనం అనుకుంటాం. కానీ అది నిజం కాదు. మన సంస్కృతిలోనూ అన్నీ వున్నాయి. మరుగునపడి ఎన్నో వున్నాయి. ప్రతి జాతి జీవనవిధానం, మనుగడలోనూ హోమోసెక్స్ వుంది. దాన్ని ఏనాడూ సమాజం అంగీకరించలేదు. ఇప్పుడిప్పుడే దాన్ని ఆమోదిస్తున్నారు. అది చాటుమాటుగానే సాగుతుంటుంది. ఆ స్థితి నుండి వాళ్లని బయటకి లాగగలిగితే మంచిదే'.

ఇలా ఆదిలక్ష్మికి ఎన్నోవిధాల కౌన్సెలింగ్ జరిగింది. ఆమెలో నెమ్మదిగా చలనం మొదలైంది. 'ఎప్పుడైనా మీ అమ్మాయి ఆ జీవితం మీద విరక్తిచెంది మీ దగ్గరకొస్తే ఆదరించండి'.. ఆదిలక్ష్మి ఆలోచిస్తూ వుండిపోయింది. నిద్రమాత్రలు మింగడంవల్ల కడుపులో ఏర్పడిన అల్సర్ ..వుండుండి మండుతోంది. V

ఒరియా కథ

-సంజయ్‌కుమార్ శతపథి

# తప్పిపోయిన బాలుడు

అనువాదం : సి.హెచ్.శ్రీనివాసమూర్తి

**కా**లపురుషుడి క్రూరహస్తాలు.. నన్నొక యువ క్రికెటర్ దశనుండి మధ్యవయసొచ్చిన టీం మేనేజర్‌గా మార్చేశాయి. వేసవి క్రికెట్ టోర్నమెంటులో పాల్గొనటానికి, నాకంటే చాలా చిన్నవాళ్ళయిన క్రికెట్ టీంతో ఉత్తరభారతానికి ప్రయాణమయ్యాను. నిజానికి పోటీలు ఢిల్లీలో జరగకపోయినా, నా టీం మెంబర్ల కోరిక మేరకు ఢిల్లీకి టిక్కెట్లు తీసుకున్నాం.

నిజాముద్దీన్-ఉత్కళ్ ఎక్స్‌ప్రెస్.. రూర్కెలాలోనే ముప్పావుగంట ఆలస్యమైంది. పిల్లలందరిలో అసహనం పెరిగింది. వీరేంద్ర అనే పంజాబ్ కుర్రాడు "అంకుల్! మీరు మా కోచ్‌లోనే ప్రయాణం చేయాలి" అన్నాడు. ఎందుకో అతని సంబోధనకు నేను కొద్దిగా ఇబ్బందిగా ఫీలయ్యాను. అది గమనించిన తక్కిన పిల్లలు వీరేంద్రను కోప్పడ్డారు. అలా 'అంకుల్' అని పిలవొద్దనీ, పిలవాల్సివొస్తే 'సార్' అనో, 'మేనేజర్ గారూ' అనో మర్యాదపూర్వకంగా పిలవాలని హెచ్చరించారు. నేను వాళ్ళకు సర్దిచెప్పాను. "వీరేంద్ర నన్ను అలా పిల్చినందుకు నాకేం చిన్నతనం లేదు. నా మనసు అసలీ విషయం గురించి ఆలోచించటం లేదు. యిప్పటి స్థితి చూస్తుంటే, నేను నా చిన్నతనంలో మీలా యువ క్రికెటర్‌గా ఉన్నప్పటి రోజులు గుర్తొస్తున్నాయి" అన్నాను. "మీలాగే నేను కూడా అల్లరి చేసేవాణ్ణి. అప్పుడొకసారి ఇలాగే ఫ్రాంక్ వొరెల్ ట్రోఫీకోసం, యిదే ఉత్కళ్ ఎక్స్‌ప్రెస్‌లో లక్నోకి వెళ్ళాను. తేడా ఏమిటంటే, అప్పుడు నేను కూడా ఒక ప్లేయర్‌నే. పురుషోత్తం అనే మా మేనేజర్ చాలా అసక్తికరమైన వ్యక్తి. 'అంకుల్' అనేది ఆయనకొక భయంకరమైన మాట. ఎవరైనా అంకుల్ అంటే చాలా అసహనానికి గురయ్యేవాడు. వీరేంద్ర నన్ను అలా సంబోధించినప్పుడు ఆయన గుర్తొచ్చారు. పాపం! ఆయనిప్పుడు లేరు" అన్నాను.

"చూశారా? నా వల్ల సార్ మూడ్ పాడుకాలేదు" అన్నాడు వీరేంద్ర చిరునవ్వుతో. నేను అతని మాటలు పట్టించుకోలేదు.

"ఆ సమయంలో జరిగిన ఒక సంఘటన ఈనాటికి కూడా నా మనసులో అలాగే నిల్చిపోయింది. నేనెప్పుడైనా రైలు ప్రయాణం చేసే సమయంలో అది గుర్తుకు రాకుండా ఉండదు" అన్నాను.

"సార్, అదేమిటో మాకు కూడా చెప్పరా?" అంటూ పిల్లలందరూ చుట్టూ చేరి ప్రాధేయపడసాగారు.

"ఇప్పుడీ గందరగోళంలో వీలుపడదు. రైలు రానీయండి. ఎక్కి సీట్లలో సెటిల్ అయిన తర్వాత చెప్తాను" అన్నాను.

మరి కొంతసేపటికి రైలు వచ్చింది. పిల్లలందరూ ఎక్కేసి పెట్టేబేడా సర్దుకుని ఎవరి సీట్లలో వారు కూర్చున్నారు. రైలు క్రమంగా స్పీడందుకుంది. నేను నా జ్ఞాపకాల దారాలను పోగుచేసుకుంటూ చెప్పటం మొదలుపెట్టాను.

"ఆరోజు కూడా ఉత్కళ్ ఎక్స్‌ప్రెస్ యిలాగే గంట లేటు. మా అందరికీ ఒకే



కంపార్ట్‌మెంటులో సీట్లు దొరకటం సాధ్యం కాలేదు. కొందరికి ఎస్-5లో, మిగతావారికి ఎస్-6లో దొరికాయి. మా మేనేజర్ పురుషోత్తం చాలా సరదా మనిషి. సెన్స్ ఆఫ్ హ్యూమరున్న వ్యక్తి. దురదృష్టవశాత్తూ అతని భార్య మరణించింది. ఎదిగిన పిల్లలకు యిష్టం లేకపోయినా, అతను మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు. ఆ అమ్మాయికి కూడా యిది రెండో పెళ్ళే. రైల్లో మా మెంబర్లందరికి రెండు రోజులకు సరిపడా పాకెట్‌మనీ యిచ్చి, ఢిల్లీ వెళ్ళేంతవరకు అందులోనే సర్దుకోవాలని చెప్పేశాడు. వాళ్ళందరికీ, ప్రత్యేకంగా విక్రం, గౌతమ్ అనే పిల్లలకు- అతను 'అంకుల్' అని పిలవొద్దని ముందే హెచ్చరించాడు. అందునా ఆడ ప్రయాణీకులున్న చోట 'అంకుల్' అనిపించుకోటం అతనికి యిష్టముండేది కాదు. పిలవాల్సొస్తే, పేరు పెట్టిగానీ, మేనేజర్ అనిగానీ పిలవమని చెప్పాడు.

కొంతమంది పిల్లలు తమ ట్రంకు పెట్టెలను ఒకదానిమీద మరొకటి పెట్టి, టేబుల్‌గా అమర్చి, పేకాట మొదలుపెట్టారు. మరికొందరు ఏవేవో నవలలు చదవటంలో నిమగ్నమయ్యారు. తక్కినవాళ్ళు.. ఆడుతున్నవారి పక్కన చేరి ప్రేక్షకుల్లా మారారు. అలా చూస్తూ చూస్తూండగానే లంచ్ టైమయింది. రైలు బిలాస్‌పూర్ స్టేషన్‌లో ఆగింది. మేనేజర్‌గారు ఆ స్టేషనుకుండే అపఖ్యాతి గురించి అందరినీ ముందే హెచ్చరించి జాగ్రత్తగా ఉండమన్నారు. అంతకుముందే లంచ్‌కి ఆర్డరివ్వటం మూలంగా కొన్ని నాన్ వెజ్, మరికొన్ని వెజ్ ప్లేట్లు మా ముందుకొచ్చాయి. భగవంతుడు ఎందుకు పెట్టాడో తెలియదుగానీ, ఈ రైలు కూడు రుచీ పచీలేని చప్పటి కూడని తెలిసినా, నాకు మాత్రం పరమాన్నంలా తినాలనిపించేది. ఆకలికి నేను అస్సలు ఓర్చుకోలేను.

లంచ్ తీసుకున్న తర్వాత నేను వాష్‌బేసిన్ దగ్గరికెళ్లాను. అక్కడొక దంపతులు, రెండు మూడేళ్ళ కుర్రాడితో కనిపించారు. కుర్రాడు ముద్దొచ్చేలా వున్నాడు. బూరెల్లాంటి బుగ్గలతో, నల్లగా రింగులు తిరిగి మెరుస్తున్న వెంట్రుకలతో, బుగ్గమీద నల్లటి చాదు చుక్కతో ఎవరినైనా యిట్టే ఆకర్షించేలా వున్నాడు. బహుశా వాడికి దిష్టి తగలకుండా వాళ్ళమ్మ చాదు చుక్క పెట్టినట్లుంది. ఆ పిల్లాడి తండ్రి చూడటానికి అంత అందంగా లేకపోయినా దృఢమైన శరీరంతో ఎత్తుగా వున్నాడు. ఆమె అందం అంచనా వేయటానికి వీలులేకుండా నిలువెల్లా పరదాలో వుంది. పిల్లాడు మాత్రం ఒకచోట కుదురుగా వుండటం లేదు. తల్లి కోప్పడుతున్నా వినకుండా అపరిచితులతో కూడా ఆటలాడుకుంటున్నాడు. భుక్తాయాసం వల్ల చాలామంది ప్లేయర్లు కునుకుతీయసాగారు. నేను కొద్దిసేపు నడుం వాల్చి, తిరిగి పేకాటాడుతున్న వాళ్ళ దగ్గరికొచ్చాను. మా టీంలోని ఓ ముస్లిం కుర్రాడు అక్కడ తనున్న కంపార్ట్‌మెంటులో ఏమీ తోచక మేమున్న చోటికొచ్చాడు. అతను పక్కనున్న ముస్లిం దంపతులతో ఉర్దూలో మాట్లాడాడు. మేమంతా క్రికెట్ ప్లేయర్లమని తెలియటంతో, ఆ దంపతులకు మామీద అభిమానం కలిగింది. వాళ్ళు కూడా క్రికెట్ అభిమానులే. పాకిస్తాన్ ఫాస్ట్‌బౌలర్ ఇమ్రాన్‌ఖాన్ మీది అభిమానంతో తమ కుర్రాడికి ఇమ్రాన్ అని పేరు పెట్టుకున్నారట.

పరిచయాలు పెరిగిన తర్వాత, ఆ ముస్లిం యువతి ముఖం మీదున్న పరదాను తొలగించింది. అంత అందమైన ముఖాన్ని నేనింతవరకు చూడలేదంటే నమ్మాలి. మా టీములో అందరూ యువకులమే, బ్రహ్మచారులమే. అందమైన ఆమె ముఖం చూసి ఎవరికి ఎలాంటి తలపులు కలిగాయో చెప్పటం కష్టం. ఒకవేళ వెండి తెర మీదనో, సినీ పత్రికల అట్టలమీదనో చూసుంటే వుండొచ్చు. కానీ ఎదురుగా ఏ మేకప్ లేకుండా చూడటం ఓ అపూర్వ అనుభవం. నాకొకవేళ అటువంటి అమ్మాయే దొరికితే, మతాలను తుంగలో తొక్కి, కళ్ళు మూసుకుని తాళికట్టేవాణ్ణని అనిపించిందా క్షణంలో.

ఆ చిన్న కుటుంబం బిలాస్‌పూర్‌కు చెందిందనీ, అతను ఇండియన్ ఆర్మీలో పనిచేస్తాడనీ, వారు సెలవులు గడపటానికి యాత్రలకు బయలుదేరారనీ మాటలమధ్య తెలిసింది. మగవాళ్లు స్వతహాగా వ్యామోహపరులు కదా! వసంతంలో పూర్తిగా వికసించిన తామరపూవుకు తన అస్థిత్వాన్ని తెలియచేయాలనే కోరిక సహజంగానే కలుగుతుంది. యుక్తాయుక్త విచక్షణుండదు. మాలో ప్రతివాడూ ఆ కుర్రాడిని ముద్దుచేయాలని తాపత్రయపడేవాడే. అందంగా వున్న అమ్మకొడుకు అందరికీ ముద్దే కదా. ఎత్తుకునే మిషమీద కొందరైతే అమ్మ వొడిలోంచే.. ఆ కుర్రాణ్ణి అందుకోవాలని ప్రయత్నించారు.. కనీస స్పర్శానందం కోసం.

నా శిష్యగణమంతా పెద్దపెట్టున నవ్వారు. "సార్, మీరు అందర్నీ అంత పరిశీలనా దృష్టితో చూడటం ఆశ్చర్యంగా వుంది. కానీ మీరు కూడా ఆ కుర్రాణ్ణి ముద్దుచేశారా లేదా? ముందా విషయం చెప్పండి" అన్నారు.

"పర ధనాన్ని, పర స్త్రీని కోరటం మహా పాపం" అన్నాను సామెత గుర్తుకొచ్చి. కానీ అబద్ధమాడినందుకు నాలో నేనే సిగ్గుపడ్డాను. నేను కూడా అందరిలా ఆ పిల్లాడిని ముద్దుచేసినవాడినే.

ఇమ్రాన్‌కు.. అందరూ తననలా ముద్దు చేయటం వెగటనిపించిందేమో.. మాటి మాటికీ తల్లిదగ్గరికి పరుగెత్తేవాడు. కొద్దిసేపటికి సూర్యాస్తమయమవటంతో, ఆ పిల్లాడి తండ్రి ఓ చద్దర్ తీసి సీట్లమధ్య పరచి నమాజ్ ప్రారంభించాడు. మేం ఏం చేయాలో తెలియక కిటికీలగుండా దూరంగా ఎరుపెక్కుతున్న ఆకాశాన్ని చూస్తూ కూర్చున్నాం. ఆలం మాత్రం ఆ ముస్లిం దంపతులతో కొద్దిగా ఎక్కువ చనువే సంపాదించాడు. ఇమ్రాన్‌ను తరచుగా తన కోచ్‌కు తీసుకెళ్ళేవాడు"

చెప్తూ చెప్తూ నేను కొద్దిగా విరామం తీసుకున్నాను.

"ఇప్పటికి చెప్పింది చాలు. ఇప్పుడొచ్చే స్టేషన్ అనుప్పూర్. ఇక్కడ సమోసాలు బాగుంటాయంటారు. రెడీగా ఉండండి" అన్నాను. నిజానికి అక్కడ రైలు కొద్దిసేపే ఆగాలి. కానీ రైల్వేవాళ్లు ముఖ్యంగా గార్డులు అనుమతించిన సమయానికంటే కొద్దిగా ఎక్కువసేపే ఆగుతారు. దీనివల్ల ప్రయాణీకులకు, దుకాణాల వాళ్లకీ.. ఇద్దరికీ మేలు

జరుగుతుంది. రైలు తిరిగి బయలుదేరిన తర్వాత నేను నా కథను కొనసాగించాను.

"ఆరోజు ఆ పిల్లాడు ఆలంతో మరో కోచ్‌లోకి వెళ్లిపోయిన తర్వాత, మేమా విషయం పట్టించుకోలేదు. మేమంతా యువకులం. ఆకలి అధికంగా ఉంది.. రాత్రి ఎనిమిదిన్నరకు డిన్నర్ ట్రాలీ వచ్చేసింది. కంపార్ట్‌మెంటంతా రైల్వే భోజనం వాసన వ్యాపించింది. ఇమ్రాన్ కూడా తినే టైమయింది. వాళ్ళమ్మ అతని కోసం పిలిచింది. కొద్దిసేపటివరకు అతడెక్కడో ఆడుకుంటూ గడిపాడు. నేను నవల చదవటంలో నిమగ్నమైపోయి అతన్ని గమనించలేదు. నేను మొదటిసారిగా ఒక చాక్లెట్ అందించినప్పుడు, అతనన్న మాటలు మనసులో మెదిలాయి. "అమ్మకి కోపం వస్తుంది. అమ్మకు చెప్పి ఆ తర్వాత తింటాను".

యిప్పుడు ఇమ్రాన్ కోసం వెతుకుతున్నారు. నా పుస్తకం ముందుకు సాగటం లేదు. ఆలం దగ్గరున్నాడేమోనని వెతికారు. అక్కడా లేడు. మా టీం మొత్తం.. మా కంపార్ట్‌మెంటుకు అటూ యిటూ వున్న కోచ్‌లన్నీ వెతికాం. సీట్లకింద కూడా చూశాం. దొరకలేదు. ఆ తల్లి గుండె తల్లడిల్లింది. తండ్రి మాత్రం తప్పంతా ఆమెదేనని తిట్లకు లంకించుకున్నాడు. సాధారణంగా ఆర్మీ ఆఫీసర్లు ప్రశాంతంగా వుంటారు. కానీ కోపమొస్తే సర్దటం కష్టం.

మేం వెంటనే చెయిన్ గుంజాలని నిర్ణయించుకున్నాం. రైలు ఆగితే మిగతా కోచ్‌లను కూడా వెదకవచ్చు. రైలు చాలా వేగంగా వెళుతోంది, ఆలస్యం కవర్‌చేయటానికి. అందరం కలిసి రెండు మూడు చోట్ల చెయిన్ లాగాం. 'ఉత్కళ్'కు ఆగక తప్పిందిగాదు. డ్రైవరు, గార్డు ఉరుకులు పరుగులతో మా కోచ్‌ల వైపొచ్చి విచారించారు. మేమంతా ఏకకంఠంతో "మేమే రైలుని ఆపామ"ని చెప్పాం. ఆమెను చూపిస్తూ 'ఆమె పిల్లవాడు కనిపించటంలేద'ని చెప్పాం, అదురు బెదురు లేకుండా.

దీనవదనంతో నిల్చున్న ఆమెను చూడగానే, కోపంతో వచ్చిన వారు కాస్తా చల్లబడ్డారు. బహుశా ఆమె అందం ముందు నోట మాటరాకపోయుండవచ్చు. దేవుళ్లయినా మూగబోక తప్పదు. వీళ్లంతా మానవమాత్రులు. "వచ్చే స్టేషన్..'కుట్నీ'. అక్కడ అన్ని కంపార్ట్‌మెంట్లు వెతకొచ్చు. స్టేషన్ మాస్టర్ కూడా మీకు సహాయం చేస్తాడు" అన్నారు.

ఆ అర్ధగంట కాలం మాకు ఒక యుగంలా గడిచింది.. ఆ చిన్నకుర్రాడు మాకందరికీ ఆత్మీయుడైనాడు. మా టీంలో ఒక సభ్యుడైనాడు. కుట్నిలో కూడా కుర్రాడి ఆచూకీ తెలియకపోవటంతో, ఆ దంపతులు అక్కడే దిగిపోయారు. పరదా వెనుకనున్న ఆ మాతృమూర్తి ముఖాన్ని చూడలేదు గానీ, ఆమె గుండె గాయాన్ని మాత్రం అర్ధంచేసుకున్నాం. మేం చేయగలిగిందేమీలేదు, హృదయపూర్వకంగా సాను






భూతి చూపించటం తప్ప. తప్పిపోయిన తనయుడు క్షేమంగా తిరిగి తల్లి ఒడి చేరాలని మనసారా దేవుళ్ళను ప్రార్థించాం.

ఉత్కళ్ ఎక్స్‌ప్రెస్ తన దారిన తాను గమ్యంవైపు పరుగులు తీసింది. ఇమ్రాన్ కనపడకపోవటంతో, బరువెక్కిన వాతావరణంలో మేమా రోజు రాత్రి ఏమీ తినలేకపోయాం. మాలో మేమే.. ప్రతి ఒక్కరం.. చాలా ఫీలయ్యాం. టోర్నమెంటులో మొదటి మాచ్‌కు ముందు 'కనీసం ఇమ్రాన్ కోసమైనా మనం పట్టుదలతో ఆడి కప్పు గెలుచుకోవాలి' అని పురుషోత్తంగారు నూరిపోశారు. ఆ మాటల ప్రభావంవల్లనో ఏమో, మేం మాత్రం అద్భుతంగా ఆడి కప్‌ను కైవసం చేసుకున్నాం. తిరిగి రావటానికి అదే ట్రెయిన్ ఎంచుకున్నాం. మా అందరి గుండెల్లో ఒకటే ప్రశ్న. 'ఇమ్రాన్ తిరిగి తన తల్లిని చేరగలిగాడా? ఒకవేళ చేరితే సజీవంగానా? నిర్జీవంగానా? '

నా టీం మెంబర్లు ఈ సస్పెన్సును భరించలేకపోతున్నారు. "ఆ తర్వాత ఏమయింది సార్? మీరు తరువాత ఎప్పుడైనా ఆ కుర్రాడి విషయం కనుక్కున్నారా? తర్వాతేం జరిగిందో మీకు తెలుసా? ఇమ్రాన్ దొరికాడా? " లాంటి ప్రశ్నలతో ముంచెత్తారు.

"ఇప్పటికే చాలా లేటయింది. తరువాత ఏం జరిగిందో రేపు చెప్తాను" అంటూ నిద్రకు ఉపక్రమించాను.

మరురోజు ఉదయం చాయ్‌వాలాల కేకలతో కంపార్ట్‌మెంటులో సందడి మొదలైంది. నేను కూడా నిద్రలేచి, కాలకృత్యాలు తీర్చుకుని, టిఫిన్‌కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాను. నా తోటి ప్రయాణీకురాలొకరు "ప్లీజ్, మీరు నిన్న చెప్తున్న కథ పూర్తి చేయరూ? నేను మరో రెండు స్టేషన్ల తర్వాత దిగిపోవాలి" అంది. అంటే నా శిష్యగణమే కాకుండా, తోటి ప్రయాణికుల్లోనూ కొందరిని ఆ ఘటన ఆకర్షించిందన్నమాట.

ప్లేయర్లంతా ఫలహారాలను ముగించి, నా చుట్టూ మూగారు సిద్ధంగా. మరోమారు బతిమిలాడించుకోకుండా నా కథను అందుకున్నాను, మధ్యమధ్యలో టీ తాగుతూ.

"ఎనిమిది సంవత్సరాల తర్వాత ఓ మారు నేను ఇదే ఎక్స్‌ప్రెస్‌లో పనిమీద ఢిల్లీకి బయలుదేరాను. ఈసారి నేను, నా భార్య, నాలుగు సంవత్సరాల కుమారుడు ఉన్నాం. అందరం కలిసి నా బావమరిది పెళ్లికి వెళ్తున్నాం. అనుకోకుండా బిలాస్‌పూర్‌లో అదే దంపతులు తారసపడ్డారు! అతణ్ణి కదిలిద్దామనుకున్నాను గానీ, ధైర్యం చేయలేకపోయాను. పాత గాయాన్ని కెలికినట్లవుతుందనిపించింది. ఆమె చేతిలో ఓ పాలుతాగే పసివాడున్నాడు. 'ఇమ్రాన్ శాశ్వతంగా కన్పించకుండా పోయాడా? ' ఈ సందేహమే నన్ను ఆనాడు కూడా వెంటాడింది. అతను నా చేతిలో ఉన్న పత్రికను అడిగి తీసుకుని పేజీలు తిరగేయసాగాడు. నేను నా కుతూహలాన్ని ఆపుకోలేకపోయాను. మౌనాన్ని ఛేదిస్తూ "మీ అబ్బాయి.. ఇమ్రాన్.." అంటూ నసిగాను.

"మా ఇమ్రాన్ మీకు తెలుసా? " అన్నాడు ఆశ్చర్యపోతూ, "బహుశా మీకు గుర్తులేదనుకుంటాను. ఇమ్రాన్ తప్పిపోయిన ఆ దురదృష్టకరమైన రోజున, నేను నా రూర్కెలా క్రికెట్ టీంతో మీతో పాటు ప్రయాణించాను" అన్నాను.

"ఆ.. ఇప్పుడర్థమైంది, మిమ్మల్ని యిదివరకు ఎక్కడ చూశానో" అని ఒక నిట్టూర్పు విడిచాడు. "ఆనాడు మేం రైలు దిగిన తర్వాత ఏం జరిగిందో చెప్తాను. కానీ అందుకు నేను ప్రిపేర్ కావాల్సి వుంటుంది. మనం కొద్దిగా అవతలికిపోయి మాట్లాడుకోవటం మంచిది" అని అతను భార్యకు దూరంగా అవతలికి నడిచాడు. నేను అనుసరించాను. అతను మొదలుపెట్టాడు.

"ఆ రోజు కుట్ని స్టేషన్‌మాస్టరు చాలా సహాయం చేశాడు. ఆ రూట్‌లో ఉన్న అన్ని స్టేషన్లకు ఫోన్లు చేసి, ఇమ్రాన్ వివరాలిచ్చాడు. అక్కడినుంచి వివరాలు రాబట్టటానికి ప్రయత్నించాడు. ఆ ప్రాంతాల్లో పిల్లలను బలవంతంగా ఎత్తుకుపోయిన సంఘటనలు ఏవీ జరగలేదన్నాడు. నడుస్తున్న రైలునుండి దురదృష్టవశాత్తు పడిపోతే తప్ప.. ఇమ్రాన్ తప్పక దొరుకుతాడని ధైర్యం నూరిపోశాడు. నాలుగు గంటల తర్వాత మా కోసం ప్రత్యేకంగా వ్యాన్ మాట్లాడి మమ్మల్ని 'సెటోలా' స్టేషన్‌కు పంపించాడు. అక్కడే మేం ముందుగా ఇమ్రాన్ తప్పిపోయాడని గ్రహించింది!

ఏదైనా అద్భుతం జరిగితే తప్ప, ఇమ్రాన్ బతికి బయటపడి మా వద్దకు చేరుకునే అవకాశం లేదని గ్రహించాం. మేం సెటోలా చేరి విచారిస్తే, ఆ పోలికలున్న కుర్రాణ్ణి తాము చూడలేదని చాలామంది చెప్పారు. ఆరోజు స్టేషన్‌లో ఎవరూ దిగలేదని తెలిసింది. మరురోజు ఉదయానికి కూడా ఇమ్రాన్ ఆచూకీ దొరకలేదు, దొరుకుతాడన్న ఆశ కూడా అడుగంటసాగింది. నిరాశతో ఉన్న నేను.. ఇక బిలాస్‌పూర్ పోవటం మంచిదని నా భార్యతో చెప్పాను. కానీ ఇమ్రాన్ విషయం తెలియకుండా తాను ఒక్క అడుగు కూడా వెనక్కువేయనని తెగేసి చెప్పింది. ఆరోజు సాయంత్రం అస్తమిస్తున్న సూర్యుణ్ణి నిర్లిప్తంగా చూస్తూ కూర్చున్న సమయంలో, ఎవరో స్టేషన్ మాస్టారుతో మాట్లాడటం కనిపించింది. రైల్వే లైన్‌మాన్‌కు అంతకు ముందురోజు రాత్రి ఎవరో కుర్రాడు దొరికాడని, ట్రాక్ పక్కన పడి ఉంటే తీసుకెళ్ళిపోయాడనీ చెబుతుంటే వినిపించింది. అతనా రోజు డ్యూటీకి రాలేదని తెలిసింది. మాలో ఆశాకిరణం మెరిసింది. విచారిస్తే ఆ లైన్‌మాన్ పేరు బాబూరావని, పరమ తాగుబోతని, స్టేషన్‌కు దగ్గరే అతని ఇల్లనీ తెలిసింది.

ఏమాత్రం ఆలస్యం చేయకుండా అతనింటికి పరుగెత్తాం. అతని భార్య మమ్మల్ని చూసి తిట్టసాగింది. "కుర్రాణ్ణి గాలికొదిలేసి గాడిదలు కాస్తున్నారా? " అని నిలదీసింది. తన భర్త రెండురోజులనుండి నిద్రాహారాలు లేకుండా హాస్పిటల్ చుట్టూ తిరుగుతున్నాడనీ, పోలీసోళ్ళ చేతిలో లాఠీ దెబ్బలు కూడా తిన్నాడనీ వాపోయింది.

కానీ నా భార్య కన్నీళ్లు చూసిన తర్వాత ఆమె మెత్తబడిపోయింది. మేం కుర్రాడి విషయం అడిగితే వివరంగా చెప్పింది. అంతకు ముందురోజు రాత్రి బాబూరావు డ్యూటీలో ఉన్నాడట. దూరంగా ఉన్న సిగ్నల్‌హౌస్ నుండి తిరిగి వస్తుంటే, లాంతరు వెలుగులో ట్రాక్ పక్కనే అపస్మారక స్థితిలో ఉన్న పిల్లవాణ్ణి చూశాడట. భగవంతుడే తమకా బిడ్డను ప్రసాదించాడనుకొని ఇంటికి తీసుకొచ్చాడు. పిల్లలు లేని ఆ దంపతులు పెంచుకుందామనుకున్నారు. ఇంకా అపస్మారకంగా ఉండటంతో హాస్పిటల్‌కు తీసుకుపోతున్న సమయంలో, పోలీసులు అడ్డగించారు. అతను అసలు విషయం చెప్పినా వినిపించుకోకుండా అతన్ని తీవ్రంగా కొట్టారు. ఇద్దర్నీ మొదట పోలీస్ జీప్‌లో స్టేషన్‌కు తీసుకుపోయి, తరువాత హాస్పిటల్‌లో జాయిన్ చేశారు. మరురోజు ఉదయం బాబూరావొచ్చి కొంత డబ్బు తీసుకుని వెళ్ళాడు. "పన్నెండయింది, ఇంకా రాలేదు" అంటూ మధ్యమధ్యలో ఏడుస్తూ చెప్పింది.

మేం అల్లాకు కృతజ్ఞతలు తెలుపుకున్నాం. మా ఆశలు చిగురించాయి. వెంటనే రిక్షా ఎక్కి హాస్పిటల్‌కు వెళ్లాం. పేరు తెలీని ఓ కుర్రాణ్ణి బాబూరావు అక్కడ చేర్పించాడని చెప్పారు. వార్డ్‌కెళ్లి చూస్తే, మా కళ్ళను మేమే నమ్మలేకపోయాం. బెడ్‌షీట్ కూడాలేని ఐరన్ మంచంమీద ఇమ్రాన్ నిశ్చలంగా పడుకుని

ఉన్నాడు. అతనికి సెలైన్ ఎక్కిస్తున్నారు. బాబురావు.. పక్కనే కూర్చుని, సూది ఎక్కించిన ఇమ్రాన్ చేతిని కదలకుండా పట్టుకు కూర్చున్నాడు. చూర్ణంతో ఇమ్రాన్ నుదురంతా అద్దినట్లుంది. మేం బెడ్ దగ్గ రికి నడిచాం. అక్కడున్న నర్సు.. మందు లన్నీ అయిపోయాయని, త్వరగా తెప్పిం చటం అవసరమని చెప్పింది.

పాపం! బాబూరావు తన దగ్గరున్న డబ్బంతా మందులకు, సెలైన్ బాటిళ్ళకు ఖర్చు చేసేశాడు.

మేం పిల్లాడి తల్లిదండ్రులమని అతనికి తెలిసిపోవటంతో, చాలా యిబ్బందిగా ఫీల య్యాడు. తనలో తనే గొణుక్కుంటున్నట్లు "మీ పిల్లాడిని యిక మీరే చూసుకోండి" అంటూ సజల నయనాలతో ఓ మారు వాణ్ణి ముద్దాడి బయటికెళ్లిపోయాడు. కన్నీళ్ళను ఆపుకోవటం అతనితరం కాలేదు. మేం అతని బాధను గమనించగలిగాం. ఆ క్షణంలో ఇమ్రాన్‌ను గురించిన సమా చారం మాకు అందకుండా వుంటేనే బాగుం డేదనిపించింది. అతను నిరుత్సాహపడ్డట్లు స్పష్టంగా తెలుస్తోంది. దైవం ప్రసాదించిన బిడ్డ చుట్టూ చాలా అందమైన, ఆనందకర మైన జీవితాన్ని వూహించుకున్న దాఖలాలు మాకు స్పష్టంగా కనిపించాయి.

ఇమ్రాన్ అదే హాస్పిటల్‌లో క్రమక్ర మంగా కోలుకున్నాడు. పదిరోజుల తర్వాత డిశ్చార్జి చేశారు. తప్పిపోయిన కొడుకు తిరిగి మాకు దక్కిన సంతోషంలో మేమే నాడూ బాబూరావును మరువలేదు. ఒక సాంప్రదాయపు హిందువు, నిస్వార్థంగా ఇమ్రాన్‌కు సేవలందించి ప్రాణదానం చేశాడు. ఆ పిల్లాడి మతం అతనికి పట్ట లేదు. అతనికోసం ఏదైనా చేయటానికి సిద్ధ పడ్డాడు. దెబ్బలుతిన్నాడు. డబ్బులు ఖర్చు పెట్టాడు. రాత్రీ పగలూ కంటికి రెప్పలా కాపాడాడు.

మేం మా వూరికి తిరుగు ప్రయాణమ య్యేరోజు, బాబూరావును కలవాలని వె ళ్లాం. ఆ యింటికెళితే తాళం ఎదురయిం ది. చుట్టుపక్కల విచారిస్తే, ఆలుమగలు కలిసి తిరుపతి వెళ్ళారని తెలిసింది. పెళ్ళ యిన చాలాకాలం తర్వాత బాబూరావు భార్య గర్భవతి అయిందట. మొక్కుతీర్చుకో టానికి తిరుపతి వెళ్ళారట.

యిప్పటికి కూడా ఆ సంఘటన మా మనసుల్లో నిలిచిపోయింది. బాబూరావుకు, అతని భార్యకు..వారు మాకు చేసిన మహో పకారానికి బదులుగా మేం బాధనే అందించాం! మర్చిపోవటం మావల్ల కాలేదు. కానీ సంతోషమేమిటంటే, యిరు మతాల దేవుళ్ళు దయతలచారో ఏమో కానీ బాబూరావు భార్య గర్భం ధరించింది. మా ఇమ్రాన్ మాకు దక్కాడు. బాబూరావు చేసిన మహోపకారం మేం ఏనాడూ మరు వలేనిది. ఇమ్రాన్ యిప్పుడు హైదరాబా ద్‌లో బోర్డింగ్ స్కూల్లో చదువుతున్నాడు. చదువుల్లోనే కాకుండా క్రికెట్‌లో కూడా చాలా చురుకుగా వున్నాడు"

అంతలోనే మా అబ్బాయి అవతలికి వెళ్తుంటే సహ ప్రయాణీకుడొకడు "ముందు నీ కొడుకును గమనించుకో. లేకపోతే మరో సంఘటన జరగొచ్చు" అన్నాడు చిరు నవ్వుతోనే హెచ్చరిస్తూ

"అసలు ఇమ్రాన్ రైలునుంచి ఎలా పడ్డాడు? ".. నేను అడిగాను.

"ఎలా పడిపోయాడో ఎవరికైనా ఎలా తెలుస్తుంది? నాకు తెలిసిందల్లా ఇమ్రాన్ నాకు దక్కాడు. బాబూరావు చలవే దీనికి కారణం.. అంతే"

కథంతా విని నా పిల్లలు "అద్భుతంగా వుంది" అన్నారు ఏకకంఠంతో. వాళ్ళలో రిలీఫ్ కన్పిస్తోంది. ఏకబిగిన చెప్పటం మూలాన నా గొంతు తడారిపోయినట్లు గ్రహించిన వీరేంద్ర ఫ్లాస్కు తెరిచాడు. "అలసిపోయినట్లున్నారు. ప్లీజ్.. ఓ కప్పు టీ తాగండి" అన్నాడు ఆప్యాయంగా. V




చీకటిపడుతోంది. పనినుంచి అయిదు కల్లా వచ్చేసి, రాత్రికి వంట వండింది సరూ. జేమ్స్ ఆలస్యంగా వస్తానని చెప్పాడు. ఈలోగా కాస్త సమయం చిక్కితే కంప్యూటర్లో సర్ఫ్ చేస్తోంది. తనకిష్టమైన సినిమా వార్తలు చూసింది. అలా ఒక వార్తలోంచి మరో వార్తలోకి దూకుతూ చివరికి తన తల్లి రాసే తెలుగు బ్లాగ్ 'స్వేచ్ఛ' కొచ్చి చూసింది. తెలుగులో కాస్త పేరున్న రచయితల్లో తల్లి మల్లికొకరు.

పుట్టింది ఇండియాలోనే అయినా పెరిగిందంతా అమెరికాలోనే. తెలుగు అంత సునాయాసంగా చదవలేకపోయినా, కూడబలుక్కుని నెమ్మదిగా చదవగలదు. చిన్న

ప్పుడు తల్లిదండ్రుల బలవంతమ్మీద తెలుగు నేర్చుకుంది. చిన్నతనంలో ఇంట్లో తెలుగు మాట్లాడినా, కొంత వయసు దాటాక ఇంగ్లీషే మాట్లాడేది. మెల్లమెల్లగా తెలుగు మాట్లాడ్డం మానేసింది.

'ఈసారి తల్లి ఏం కొత్త వ్యాసం రాసిందా' అని చూసింది. తను చదివినా చదవకపోయినా అప్పుడప్పుడు తల్లి బ్లాగ్ చూస్తుంటుంది.

"నిలదొక్కుకునే ఆశయాలు" పేరుతో కొత్త వ్యాసం రాసిందామె. ఆర్థికంగా స్త్రీలు నిలదొక్కుకోవాలన్న అంశంతో రాసిందని మొదటి రెండు పంక్తులూ చదవగానే అర్థమయ్యింది సరూకి. చదువుతూండగా జేమ్స్ వచ్చాడు. వస్తూనే నవ్వుతూ పలకరించాడు. తన కంప్యూటరున్న గది, కారు గరాజ్ పైనే ఉంటుంది. గరాజ్ చప్పుడు కూడా వినిపించలేదనుకుంది.

"నీకో గుడ్ న్యూస్" రాబర్ట్ మొహం వెలిగిపోతోంది.

ఏమిటన్నట్లు చూసింది సరూ.

"మన మేరేజ్‌కి మా అమ్మా నాన్నా ఇద్దరూ కలిసొస్తున్నారు. నాకివాళే ఈ-మెయిల్ వచ్చింది. నేనూ ఇందాకనే వాళ్లతో మాట్లాడాను"

"ఇద్దరూ కలిసొస్తున్నారా? " రెట్టించింది సరూ. జేమ్స్ తల్లి న్యూయార్క్‌లో ఉంటుంది. తండ్రి సియాటల్లో ఉంటాడు. ఇద్దరూ విడాకులు తీసుకొని చాలాకాలమయ్యింది. అందుకే అనుమానంవచ్చి అడిగింది సరూ.

"అవును, నేను మన మేరేజ్ ప్రపోజల్ విషయం వాళ్లకి మెయిల్ చేశాను. అది చూసి ఇద్దరూ ఫోన్లో మాట్లాడుకున్నారట. పెళ్లికి ఇద్దరూ తప్పకుండా వస్తామని చెప్పారు.. ఇంకో విషయం- మేరేజ్‌కీ, డైమండ్ రింగ్‌కీ, మిగతావాటికి డబ్బు ఇస్తానని చెప్పారు. పెళ్లి మాత్రం గ్రాండ్‌గా చేసుకోమని చెప్పారు"

విడిపోయిన జంట వీళ్లని మాత్రం ఘనంగా పెళ్లి చేసుకోమని చెబితే నవ్వొచ్చింది సరూకి.

"గుడ్! మీ వాళ్లొస్తున్నారు. మేరేజ్‌హాల్ వాడికి డిపాజిట్ కట్టావా? "

అవునన్నట్లు జవాబిచ్చాడు జేమ్స్.

తనకి మాత్రం చాలా సింపుల్‌గా పెళ్లి చేసుకోవాలనుంది. చాలాసార్లు జేమ్స్‌కి చెప్పింది. ఉన్నంతలోనే స్నేహితుల్ని పిలుద్దామని నిర్ణయించుకున్నారు.

"జేమ్స్! నాదో చిన్న రిక్వెస్ట్. మేరేజ్ సింపుల్‌గా చేసుకుందాం"

"నువ్వు పదేపదే చెప్పనవసరం లేదు. నీ కోరిక ప్రకారమే డైమండ్ రింగ్ కూడా అతి తక్కువ ఖరీదులో కొన్నాను కదా. ఎంగేజ్‌మెంట్ పార్టీ కూడా మానేశాను కదా? .."

అవునన్నట్లు తలూపింది సరూ.

"అడగడం మరిచాను. మీ పేరెంట్స్‌ని పెళ్లికి రమ్మనమని పిలిచావా? "

ఏం జవాబివ్వాలో తెలీలేదు సరూకి. చెప్పడమైతే అమ్మా, నాన్నలకి చెప్పింది. నాన్న వస్తానన్నారు. అమ్మ ఎటూ తేల్చి చెప్పలేదు. మాటల్లో అర్థమయ్యిందేమిటంటే, ఆవిడకీ పెళ్లి అంతగా ఇష్టంలేదు. క్రితంసారి బోస్టన్ వెళ్లినపుడు జేమ్స్‌ని పరిచయం చేసింది. అప్పుడావిడ అతన్ని చూసింది. పైకి అనకపోయినా తల్లికి జేమ్స్ నచ్చలేదన్న విషయం అర్థమయ్యింది సరూకి. ఆ తరువాత మాటల్లో మధ్య మధ్యన బయటపడింది.

"మా అమ్మ ఇంకా కన్‌ఫర్మ్ చేయలేదు. నాన్నయితే తప్పకుండా వస్తారు.. అది సరేకానీ, ముందు నువ్వు త్వరగా షవర్ తీసుకొని రా.. డిన్నర్ చేద్దాం" అంటూ సరూ కంప్యూటర్ ముందునుండి లేచింది.

సరూ తల్లీ, తండ్రి కూడా విడిపోయి చాలా కాలమయ్యింది. ఇద్దరూ బోస్టన్‌లోనే ఉంటారు. తండ్రి బోస్టన్ యూనివర్శిటీలో



ప్రొఫెసర్. తల్లి బ్యాంకులో పనిచేస్తుంది. సరూ హైస్కూల్ జూనియర్ గ్రేడ్‌లో ఉండగా ఇద్దరూ విడాకులు తీసుకున్నారు.

డిన్నర్ రెడీ చేయడానికి కింద డైనింగ్ రూంకొచ్చింది సరూ.

జేమ్స్ షవర్ అయ్యాక కిందకొచ్చాడు. డిన్నర్ రెడీ చేస్తోంది సరూ. ఇంతలో సరూ సెల్‌ఫోన్ మోగింది. చాలాసార్లు రింగవడం విని, మేడపైన మర్చిపోయిన సెల్ చూడమని జేమ్స్‌కి చెప్పింది. జేమ్స్ సరేనంటూ పైకి వెళ్లాడు.

డైనింగ్ టేబిల్ దగ్గర కూర్చుంటుండగా జేమ్స్ వచ్చాడు. అతని మొహం విచారంగా ఉంది. ఏం మాట్లాడకుండా భారంగా అక్కడ కూర్చున్నాడు. ఏమయ్యిందన్నట్లుగా అతనికేసి చూసింది.

"సరూ.. రేపు ఉదయం మనం బోస్టన్ వెళ్లాల్సుంటుంది"

"ఏం? దేనికి..? " ఆదుర్దాగా అడిగింది సరూ.

"మీ నాన్నగారికి హార్ట్‌ఎటాకొచ్చింది. హాస్పిటల్లో ఉన్నారట. ఆయన ఫ్రెండొకాయన ఫోన్ చేసి నీకు చెప్పమన్నారు.."

సరూ నోట మాటలేదు.

★ ★ ★

ఆ మర్నాడుదయమే సరూ, జేమ్స్ బోస్టన్ వెళ్లారు. వెళ్లేసరికి, సరూ తండ్రి మూర్తి చనిపోయాడు. సరూ తట్టుకోలేకపోయింది. తన బాధ చెప్పుకోడానికెవరూ లేరు. హార్ట్‌ఎటాక్ రాగానే మూర్తి స్నేహితులు మల్లిక్కి ఫోన్ చేసి చెప్పారట. ఎందుకో తల్లి తనకి ఫోన్ చేసి చెప్పలేదు. తనకీ.. తల్లికీ వార్త చెప్పాలనిపించలేదు. శవాన్ని ఇంటికి తీసుకొచ్చారు. మూర్తి మరణవార్త విని స్నేహితులు చాలామంది వచ్చారు. అంత్యక్రియల ఏర్పాట్లు జేమ్స్ చూస్తున్నాడు. మూర్తి స్నేహితులూ కొంత మంది సాయం చేస్తున్నారు.

ప్రశాంతంగా కళ్లు మూసుకొని నిద్రపోతున్నట్లుగా ఉన్నాడు తండ్రి. తనకయితే బాధుంది కానీ, కన్నీళ్లు రావడం లేదు. తండ్రి శవంకేసి చూస్తూ ఉండిపోయింది.

డెబ్బై అయిదేళ్ల వయసులో ఏ తోడూ లేకుండా ఒంటరిగానే బతికాడు. సరూకి తండ్రంటే ఇష్టం. తల్లితో విడిపోయి చాలా కాలమయ్యింది. తనకి తెలిసీతెలియని వయసులోనే అన్నీ జరిగిపోయాయి. కొన్నాళ్లు తల్లి దగ్గరే ఉంది. తను కాలేజీలో చేరాక తండ్రి వచ్చి కలిసేవాడు. తన చదువు ఖర్చంతా ఆయనే ఇచ్చాడు.. అంతే కాదు. పాకెట్‌మనీ కూడా ఇచ్చేవాడు. కొత్తలో తల్లికి తెలిసి.. తీసుకోవద్దని చెప్పింది. కానీ ఎందుకో తండ్రి మొహం చూసి బాధపెట్టడం ఇష్టంలేక తీసుకునేది.

తను కాలిఫోర్నియాలో ఉద్యోగంలో చేరాక తరచూ వచ్చి కలిసేవాడు. తను బోస్టన్ వెళ్లినప్పుడు మాత్రం, తల్లికి తెలీకుండా వెళ్లి కలిసొచ్చేది. తండ్రిని కలవడానికి తల్లిష్టపడదు. కాదని వెళితే ఆ తరువాత పెద్ద రాద్ధాంతం. అందుకే తను గోప్యంగా వుంచేది. అసలు వాళ్లిద్దరూ విడాకులు తీసుకోడానిక్కూడా తన తల్లే కారణమని సరూ అనుకుంటూ ఉండేది. తండ్రి స్వతహాగా సౌమ్యుడే. కానీ తల్లే ప్రతీ చిన్న విషయాన్నీ సాగదీసేది. ఏదైనా తండ్రి గట్టిగా వాదిస్తే.. స్త్రీగా తనకి స్వేచ్ఛ లేదనీ, మగాడికి బానిసలా తన బతుకు తయారయ్యిందని.. గొడవపడేది. తల్లికి మొండితనమెక్కువనీ.. చిన్నతనంలో తెలీకపోయినా..వయసు పెరిగేకొద్దీ సరూకి అర్థమయ్యింది. మల్లిక ఏ చిన్న విషయానికీ తన అభిప్రాయం మార్చుకోదు. అందువల్ల తండ్రితో గొడవలొచ్చేవి. తన ఎదుటే ఇద్దరూ గొడవపడేవారు. తనది సర్ది చెప్పడానికి ప్రయత్నించే వయసుకాదు. అప్పట్లో తనకి తెలిసేది కాదు. పైగా తండ్రిపై నేరాలు చెప్పేది. అతనికి ప్రేమలేదనీ, ఎంతసేపూ ఆయన ఉద్యోగమూ, స్నేహి

తులూ తప్ప కుటుంబమన్న భావనే లేదని అప్పట్లో చెప్పేది. మెల్లమెల్లగా తనకి నిజని జాలు బేరీజు వేయడమొచ్చాక, అసలు విషయం బోధపడింది.

ఎందుకో తనూ.. ఆ ఇద్దర్నీ కలపడానికి ఏనాడూ ప్రయత్నించలేదు. ఒక్కోసారి తండ్రి ఒక్కడూ ఒంటరిగా జీవిస్తుంటే జాలేసేది. తల్లిని చూసినా అదే పరిస్థితి. కానీ ఇద్దరికీ సర్ది చెప్పే ధైర్యం చేయలేకపోయింది. తండ్రి తను చెబితే వింటాడని నమ్మకమున్నా, తల్లి మాత్రం ఏ కోశానా వినదని చెప్పలేదు. పైకి నవ్వుతూ కనిపించినా, జీవితంలో మాత్రం ఆయన సుఖపడలేదని తనకి తెలుసు. తన పెళ్లి విషయం చెప్పినప్పుడు కూడా ఎంతో సంతోషించాడు. పెళ్లికొస్తానని మరీ మరీ చెప్పాడు. ఇంతలోనే ఇలా అయిపోయింది.

తండ్రి స్నేహితుడు రాజన్, భార్యా ఉదయం నుంచీ అక్కడే ఉండి అన్నీ చూస్తున్నారు.

“మీ సహాయానికి థాంక్స్ ఆంటీ!”

“అదేమిటమ్మా? మూర్తిగారు నాకు అన్న లాంటి వారు..”

“మీ సహాయం ఎప్పటికీ గుర్తుంచుకుంటాను. నాన్నకి హార్ట్ఎటాక్ వచ్చినప్పటి నుండీ.. మీరూ, అంకుల్.. హాస్పటల్‌లో జాయిన్ చేయడం, ఆయన్ని కనిపెట్టుకుండడం..! మేం ఉండీ లేనట్లున్నాం”

సరూ చేతికి కాఫీ అందిచ్చింది రాజన్ భార్య.

“మీవాళ్లు ఇంకెవరైనా రావాల్సుందా” ఆవిడే మళ్లీ అంది. ‘మీ వాళ్లు’ అనడంలో అర్థం సరూకి తెలుసు. తన తల్లి ఆవిడకీ పాతికేళ్లుగా పరిచయం. తన తల్లి రాలేదని సూటిగా అడగలేక ఇలా అందా?

“నాకు తెలిసి మాకంటూ బంధువులెవరూ లేరు ఆంటీ. ఉన్న కొద్దిమందీ ఇండియాలోనే ఉన్నారు, వాళ్లెలాగూ రాలేరు. వీలు చూసుకొని నేనే చెప్తాను”

సరూ సమాధానం విని రాజన్ భార్య మళ్లీ పొడిగించింది.

“మీ అమ్మకీ.. హార్ట్ఎటాక్ రాగానే కాల్ చేసి చెప్పాం..”

సరూ ఏం మాట్లాడలేదు. ఆవిడ ఏం సమాధానం కోసం ఎదురు చూస్తోందో సరూకి తెలుసు. దీన్నక్కడే తుంచేయాలి.

“అలాగా! ఈ ఉదయం నేనూ కొన్ని మిస్‌డ్ కాల్స్ చూశాను.. ఆవిడొస్తుందని నేను ఎక్స్పెక్ట్ చేయనాంటీ. అతుక్కోలేనంతగా తెగిపోయాయి మా రిలేషన్స్.. స్వేచ్ఛే ముఖ్యం అనుకునేవాళ్లకి ఎదుటివారితో పనుండదు.. ఆవిడ రాలేదన్న ఆలోచన కూడా నాకు లేదు..” ఆగి ఆగి చెప్పింది సరూ. చెబుతూంటే ఆమె గొంతు మారింది.

సరూ జవాబు విని ఆవిడేం మాట్లాడలేదు. సరూ కూడా మౌనంగానే కాఫీ తాగుతూ ఆలోచిస్తోంది. మనుష్యులు విచిత్రంగా ఉంటారు. తన తల్లీ తండ్రీ విడాకులిచ్చుకొని పదిహేనేళ్లు దాటిందన్న విషయం ఆమెకు తెలుసు. అయినా వాళ్లిద్దర్నీ భార్యాభర్తలుగానే చూస్తున్నారు. అందుకే తండ్రికి హార్ట్ఎటాక్ రాగానే, తన తల్లికి ఫోన్‌చేసి చెప్పారు. ఇద్దరి ప్రవర్తనల్లోనూ ఎన్నో ఎక్స్‌పెక్టేషన్స్ ఒకప్పుడు తనకీ ఉండేవి. కానీ ఇప్పుడు కాదు-చిన్నతనంలో! పైకి చెప్పుకోలేదంతే!

కాఫీ తాగుతుండగా జేమ్స్ వచ్చాడు. అతనివెనుకే తల్లి మల్లిక వచ్చింది. వస్తూనే సరూ భుజంమీద చెయ్యేసి “సరూ” అని అంది.

తలెత్తి తల్లికేసి చూసింది. కళ్లల్లో కన్నీటి చుక్కల్లేవు. ఏ భావమూ లేదు.

“ఎందుకొచ్చావమ్మా? ..” అప్రయత్నంగా ఆ ఒక్కమాటంది సరూ.

హఠాత్తుగా ఎదురుచూడని ప్రశ్నొచ్చేసరికి ఆవిడ విస్తుపోయింది. తల దించుకుందావిడ.



“నీ కోసం వచ్చాను సరూ..” మెల్లగా అందామె.

“నా కోసమే అయితే.. మన ముగ్గురికీ ఇలాంటి పరిస్థితొచ్చేది కాదమ్మా..? ప్లీజ్.. ఇక్కడ నుండి వెళ్లిపో!”

రాజన్ భార్య, జేమ్స్ ఆశ్చర్యంగా చూస్తున్నారు. అంతవరకూ ఆపుకున్న దుఃఖం ఒక్కసారి ఉప్పెనలా వచ్చేసింది. ఏడుస్తూ జేమ్స్ భుజంపైన వాలిపోయింది సరూ.

మాటలు అర్థం కాకపోయినా, వారి ముఖాల్లో భావాల్నిబట్టి విషయం గ్రహించాడు జేమ్స్.

“బాధ పడవద్దు”అంటూ సరూని దగ్గరగా తీసుకున్నాడు.

మల్లిక తలదించుకొని వెళ్లిపోయింది.

★ ★ ★

తండ్రి లేని ఆ యింట్లో ఒక్కక్షణం కూడా ఉండలేకపోయింది. ఆస్తుల లావాదేవీలన్నీ రాజన్ చూస్తానని చెప్పాడు. వీలయితే జేమ్స్ సహాయం తీసుకుంటానని చెప్పాడు. తండ్రికంటూ మిగిలింది ఆ ఇల్లొక్కటే! అక్కడే తన బాల్యం గడిచింది. సరూ.. తల్లిని మళ్లీ కలవలేదు. రెండు మూడుసార్లు మిస్డ్ కాల్స్ చూసినా, తిరిగి కాల్ చేయాలనిపించలేదు. తిరుగు ప్రయాణంలో ఉండగా ఫ్లయిట్లో జేమ్స్ ఓ ప్రశ్నడిగాడు.

“సరూ, నువ్వేమీ అనుకోనంటే ఓ విషయం చెప్పొచ్చా? ”

“ఊ” అంది సరూ.

“మీ నాన్న పోయినప్పుడు మీ అమ్మ వస్తే నువ్వు అలా అనుండాల్సుంది కాదేమో? ”

సరూ ఏం మాట్లాడలేదు.

“ఎంతయినా వాళ్లిద్దరూ కొంతకాలం కలిసి జీవించారు కదా? ఎంత కాదనుకున్నా నీ తల్లితండ్రులు వాళ్లు. నువ్వు కూడా వాళ్ల ప్రైవసీని గౌరవించాలి.



అంతెందుకు? మా అమ్మా నాన్నా విడిపోయి చాలా రోజులయ్యింది. మా నాన్నయితే మరో పెళ్లి చేసుకున్నాడు కూడా. అయినా సరే వాళ్లిద్దరూ నా పెళ్లికోసం కలిసి వస్తానన్నారు. ఎందుకంటే ఇద్దరికీ ఉన్న బంధం నేనొక్కణ్ణే. నీకు అప్పుడే చెబుదామనుకున్నాను. నువ్వు బాధలో ఉన్నావని చెప్పలేదు”

సరూ చేతిని తన చేతిలోకి తీసుకున్నాడతను. ఆమెకు అతని పాయింటూ వెంటనే అర్థమయ్యింది.

“జేమ్స్! నేనేదో కోపంగా అనాలని అనలేదు. మా నాన్న పరిస్థితి చూస్తే ఒకపక్క జాలేసింది. నా పరిస్థితీ అంతే. ఇద్దరూ ఒకే ఊళ్లో ఉన్నా ఒకర్నొకరు కలుసుకొని ఎన్నో ఏళ్లయింది. అలాంటిది మా అమ్మ పదిమంది కోసమూ అక్కడికొచ్చిందనిపించింది. మనిషి పోయిన తరువాత కూడా రాలేదు. ‘కనీసం కూతురుకోసమైనా రావచ్చు కదా’ అని మాకు తెలుసున్న కుటుంబాలు మా అమ్మ గురించి చెడ్డగా అనుకుంటారని .. వచ్చింది. అంతేతప్ప నా మీద ప్రేమ కాదు. ఇదంతా పెద్ద హిపోక్రసీ. నా గురించి అంతగా ఆలోచించేదే అయ్యుంటే.. మా నాన్నతో తెగతెంపులు చేసుకునేదే కాదు. తనకెలా స్వేచ్ఛ కావాలనుకుందో, నాకూ ఇద్దరి ప్రేమా కావాలని ..ఆవిడెప్పుడూ అనుకోలేదు. ఎంతసేపూ ఆడదానిగా తనకేదో అన్యాయం జరిగిపోయిందన్న బాధే తప్ప ఇంకేం లేదు. ఎంతసేపూ ఆవిడా, ఆవిడ ఆశయాలూ, స్వేచ్ఛా తప్ప నా ఫీలింగ్స్ గురించి ఏనాడూ ఆలోచించలేదు. నా మానసికావసరాలు ఆవిడకి పట్టలేదు.

చిన్నప్పుడు ఒక్కోసారి ‘నాన్న ఉంటే బాగుండేది కదా ’అనిపించేది. నాన్న గురించి చెడుగా చెప్పి చిన్నతనంలో బ్రెయిన్‌వాష్ చేసేసింది. విడాకులు తీసుకున్న కొత్తలో వీకెండ్సు నన్ను తన దగ్గరకి తీసుకెళ్లడానికొచ్చేవాడు. వచ్చినప్పుడల్లా ఓ పెద్ద రాద్ధాంతం. చివరికి విసుగొచ్చి ఆయనే మానేశాడు. కోర్టుకెళ్లచ్చు. ఎందుకొచ్చిన గొడవని ఆయన బతుకేదో ఆయన బతికాడు. ఆయనా ఈవిడతో తగవులాడేవాడు. కాదనను. ఆయనా మనందరిలా మామూలు మనిషే. ఆయనకీ భావోద్వేగాలున్నాయి. మా నాన్న ఎలాంటివాడో తెలియడానికి నాకు చాలా కాలమే పట్టింది. ఆయనతో ఆవిడకి విబేధాలున్నాయి. కాస్తయినా సర్దుకోవచ్చు కదా. ఎప్పుడూ తన మాటే చెల్లాలనే మనస్తత్వంతోటే ఉండేది. రాజీ అన్న పదం ఆవిడకి తెలీదు. మా నాన్ననీ ఇదే విషయం చాలాసార్లు అడిగాను. ఆయన రాజీ పడ్డానికి సిద్ధంగా ఉన్నా ఈవిడ ఒప్పుకోలేదు. వాళ్లిద్దరూ విడిపోడంతో నాకు జీవితంలో అందాల్సినవి కొన్ని అందలేదు. ఇద్దరు మనుషులు కలిసి జీవించడానికి కాస్తయినా రాజీ పడకపోతే ఎలా? మా అమ్మకి దేవిమీదయినా స్థిరమైన అభిప్రాయమొచ్చాక మార్చుకోదు. అంతెందుకు, నిన్ను నేను పెళ్లి చేసుకోవడం ఆవిడకంతగా ఇష్టం లేదని నాకు తెలుసు. నాతో తేల్చి చెప్పకపోయినా, గ్రహించాను.

నువ్వు నచ్చకపోడానికి కారణం తెలిస్తే ..ఆశ్చర్యపోతావు. నాకు నచ్చినవాణ్ణే చేసుకోమంది కానీ.. ‘ఇండియన్ని చేసుకోవచ్చు కదా’ అంటూ నసిగింది. ‘ఏం నువ్వూ అమెరికన్‌వే కదా’ అని చెబితే, అప్పుడు నీ జాతి అడ్డొచ్చింది. నువ్వు నల్లజాతి వాడివవ్వడం వల్ల ఆవిడకి మన పెళ్లి అంతగా నచ్చలేదు. అలా అని పైకి అనలేదు.

ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే మా అమ్మ వల్లే నేను చాలా కోల్పోయాను. ఇటుపైన ఆ అవకాశం రానివ్వదల్చుకోలేదు. నా జీవితం నాది. అందుకే ముందు వ్యక్తిగా నిన్ను చూసుకున్నాను, నీ జాతీ, రంగూ నాకు పట్టలేదు. ఆవిడ నన్ను కని పెంచిందని మాత్రమే గౌరవిస్తానంతే.

ఒక వ్యక్తిగా ఆవిడ నా గౌరవాన్ని కోల్పోయింది. ఇంకా పెద్ద ఐరనీ ఏమిటంటే, స్త్రీ స్వాతంత్ర్యమూ, పిల్లల పెంపకమూ, కుటుంబ విలువలూ అంటూ కథలు రాస్తుంది. ఆవిడ బ్లాగునిండా ఇవే ఉంటాయి. ఓ వ్యక్తిగా ఆవిణ్ణి ఎంతో దగ్గరగా చూసినందుకు.. ఇవన్నీ చదివేక, ఒంటరిగా ఉంటోందన్న సింపతీ కూడా నాకు లేదు..” సరూ ఎంతో ఉద్వేగంగా చెప్పింది.

సరూ ఇంత ఉద్వేగంగా మాట్లాడ్డం జేమ్స్ ఎప్పుడూ చూళ్లేదు. అనునయంగా ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

మళ్లీ తనే అంది.

“జేమ్స్! నాకో మాటిస్తావా? నాకొచ్చిన పరిస్థితి మనకి పుట్టబోయే పిల్లలకి రానీయనని మాటిస్తావా? ”

ఒక్క క్షణం అతను తటపటాయించాడు. అతను ఆలోచిస్తున్నాడు. అదే అడిగింది.

“ఫ్యూచర్ ఎలావుంటుందో చెప్పలేం కదా సరూ? ఇష్టమున్నప్పుడు మాట్లాడినట్లుగా..విభేదాలొస్తే ఉండదు. ఇప్పుడలాగే అని, పదేళ్లుదాటాక ఆ మాట తప్పితే” ..అతను మెల్లగా అన్నాడు.

“పోనీలే! ఎక్కువగా ఆలోచిస్తున్నానేమో? ”

“అలా అని కాదు. పెళ్లికాకుండానే ఇలా నన్ను రాజీపడమని కోరుతున్నావా? ”

“లేదు. నా సర్దుబాటుతనాన్ని గుర్తించమని అడుగుతున్నాను”

ఇద్దరూ గట్టిగా నవ్వుకున్నారు. V

తెలుగు కథ

-డాక్టర్ చెంగల్వ రామలక్ష్మి



# కర్తవ్య

"కుసుమా! ప్లీజ్ ట్రై టు అండర్ స్టాండ్ మి. ఇట్స్ మై ఫిలేయల్ డ్యూటీ" అన్నాడు శ్రీరామ్ అభ్యర్థిస్తూ.

"నో, నాటెటాల్, దిసీజ్ డిఫరెంట్ ఫ్రమ్ ఫిలేయల్ డ్యూటీ. ఐ వోన్ట్ ఎలవ్ యూ టు" అంది కుసుమ తీవ్రంగా. ఆమె ముఖం జేవురించి వుంది. కళ్లు చింతనిప్పులకు ప్రతీకలుగా ఉన్నాయి. రేగిన జుట్టు, కళ్లుబ్బరించిన ఆమె రూపం.. ఆమె చాలా సేపు ఏడ్చిందన్న విషయం చెప్పకనే చెపుతున్నాయి. ఆమె మాటలు అగ్ని పర్వతపు విస్ఫోటనా తునకలుగా ఉన్నాయి.

"రాత్రికి ప్రశాంతంగా మాట్లాడుకుందాం. ఓ. కె.. గెట్స్ రెడీ. ఇట్స్ గెటింగ్ లేట్"

"ఈ విషయంమీద ఎప్పుడు మాట్లాడినా, ఎంతసేపు మాట్లాడినా నా ఉద్దేశం, సమాధానం మారదు" అంది కుసుమ, ఫైనల్ జడ్జిమెంట్ తనదే అన్నట్లు. 'మిమ్మల్ని ఆ పని చెయ్యనివ్వను' ఖచ్చితంగా చెప్పి, విసురుగా వంటింటివైపు వెళ్లింది.

ఒక అరగంటలో ఇద్దరూ తయారై తమ ఉద్యోగాలకు బయలుదేరారు. వాళ్ల మధ్యన కూర్చుంది వాళ్లమ్మాయి. ఏడేళ్ల ముగ్ధ. రోజూ తనను కాన్వెంటు దగ్గర దించి వెళ్లటం వారి అలవాటు. ఎప్పుడూ నవ్వుతూ, తుళ్లుతూ వుండే తల్లిదండ్రులు ఎందుకంత కోపంగా ఉన్నారో, అరుస్తూ ఎందుకలా గట్టిగా మాట్లాడుకుంటున్నారో ఆ మనసుకు తెలిసే వయసు లేదు, జ్ఞానమూ లేదు. గత కొద్దిరోజులుగా నవ్వు ఆ ఇంట్లో మాయమైంది.

'నాన్న నాతో నవ్వుతూ, సరదాగా వుంటారు. నేను చెప్పే కబుర్లు వింటారు. నాతో బోలెడు ఆటలు ఆడతారు. హోంవర్క్ చేయిస్తారు. రాత్రి పడుకునే ముందు రోజూ కథ చెపుతారు. ఇప్పుడలా ఎందుకు చేయటం లేదు?'.. ఆ పసి మనసులో ఆలోచనా ప్రవాహమది. అలవాటు ప్రకారం ఒకరోజు రాత్రి భోజనం చేసిన తరవాత నాన్న పక్కన చేరి "కథ చెప్పు నాన్నా" అంది ముగ్ధ.

శ్రీరామ్ మాట్లాడలేదు.

"చెప్పు నాన్నా" అంది మరింత గట్టిగా.

ఉలుకూ-పలుకూ లేదు శ్రీరామ్ నోటి నుండి.

"చెప్పవేమిటి నాన్నా" అంటూ అతని గుండెమీదకు చేరింది. ఒక్కసారి విసురుగా ముగ్ధను తోసేశాడు శ్రీరామ్. బిత్తరపోయింది. గట్టిగా ఏడుస్తూ అమ్మ దగ్గరకు వెళ్లి "అమ్మా చూడు! నాన్న కథ చెప్పటం లేదు. నన్ను తోసేశారు" అంది ఫిర్యాదుగా.

"ఏం.. కథ వినకపోతే చచ్చిపోతావా? నోరు మూసుకుని పడుకో" అంది కుసుమ అనవసరమైన కోపాన్ని ప్రదర్శిస్తూ...

వెక్కి వెక్కి ఏడుస్తున్న ముగ్ధను మౌనంగా దగ్గరకు తీసుకుని, పడుకోబెట్టాడు శ్రీరామ్.

"దిగు, ఆలోచిస్తున్నావేమిటి" అన్న నాన్న మాటలకు ఈ లోకంలోకి వచ్చి, బ్యాగ్

తీసుకుని కాన్వెంటు లోపలికి నడిచింది ముగ్ధ.

★ ★ ★

శ్రీరామ్ తండ్రి చాలాకాలంగా కాలేయపు కాన్సర్‌తో బాధపడుతున్నాడు. అది నయం కాదని డాక్టర్లు నిర్ధారించారు.

ఒకరోజు శ్రీరామ్.. తండ్రిని డాక్టర్ దగ్గరకు తీసుకువెళ్లాడు. పేషెంట్లు చాలామంది ఉన్నారు. శ్రీరామ్‌కి చాలా ఆశ్చర్యంగా ఉంది. మెడికల్ సైన్స్ దినదినాభివృద్ధి చెందుతోంది. అంతకుముందు నయంకాని మొండి వ్యాధులను కూడా వైద్యులు నయం చేయగలుగుతున్నారు. అయినా, వ్యాధులు తగ్గటం లేదు. కొత్తకొత్తవి పుట్టుకొస్తున్నాయి. డాక్టర్లకు సవాళ్లుగా మిగులుతున్నాయి. జీవనాయుర్దాయం పెరుగుతోంది. అయినా రోగాలతో జీవనం సాగిస్తున్నారా.. అనిపిస్తోంది.

టోకెన్ నంబరు 20 అన్న నర్స్ కేకతో తన తండ్రిని తీసుకుని శ్రీరామ్.. డాక్టరు గదిలోకి వెళ్లాడు.

తన టేబుల్ పక్కనే వున్న స్టూల్ మీద కూర్చోమని సైగచేసి "ఎలా ఉన్నారు? పరంధామయ్యగారూ!" అన్నారు డాక్టర్ పార్థసారథి చిరునవ్వుతో..

"నొప్పి తగ్గట్లేదు. మంటగా ఉంటోంది"

"వాడదగ్గ మంచి మందులే వాడుతున్నాను. ఒక డాక్టరుగా నేను చేయగలిగింది చేస్తున్నాను. పూర్తిగా నయంకాదు. ఉపశమనం కోసమే ఏ మందులు వాడినా" అన్నారు డాక్టరు.

పరంధామయ్యగారు ఒక నిర్వేద స్థితికి చేరుకున్నారు. 'తన జబ్బు నయం కాదని, ముఖ్యమైన మందులకు తప్ప తన వైద్యం కోసం ఎక్కువ ఖర్చు చేయవద్ద'ని కొడుక్కు చెప్పారు. కానీ అతను స్పెషలిస్టుల దగ్గరకు తీసుకువెళుతున్నాడు. డబ్బు మంచినీళ్లప్రాయంగా ఖర్చు చేస్తున్నాడు.

"డాక్టర్, ఐడోన్ట్ డౌట్ యువర్ కాంపిటెన్సీ. బట్.. బట్.. కాన్ట్ యూ డూ సమ్ థింగ్? ఈజ్ దేర్ ఎనీ వే టు క్యూర్ హిజ్ డిసీజ్?" అన్నాడు శ్రీరామ్.

"నీ బాధ, మీ నాన్నగారంటే నీకున్న ప్రేమ నాకు తెలుసు. నా ట్రీట్‌మెంట్‌లో లోపమని నీ అనుమానం కాదుకదా!"

"నో..నో.. ఆయన బాధను చూడలేకపోతున్నాను. మా అభివృద్ధికి అహరహం కష్టపడ్డారాయన. ఈ రోజున నా ఉచ్ఛస్థితికి ఆయనే కారణం. ఏమిచేస్తే ఆయన రుణం తీరుతుంది?" చెమర్చిన కళ్లతో గాద్గదికంగా అన్నాడు శ్రీరామ్.

డాక్టర్ సాలోచనగా "చూడు శ్రీరామ్! లివర్ ట్రాన్స్‌ప్లాంటేషన్ ఒక్కటే శరణ్యం. లివర్.. చనిపోయిన వ్యక్తుల నుంచి తీసుకోవచ్చు. ట్రాన్స్‌ప్లాంటేషన్ తరవాత ఇబ్బందులు ఎన్నో ఉండవచ్చు. ముఖ్యంగా ఫారిన్ బాడీ కాబట్టి రిజెక్ట్ చేయవచ్చు. బతికున్నవాళ్ల లివర్ తీసుకోవటం కుదరదనను.. కానీ.. దాని ఇబ్బందులు దానికున్నాయి. అయినా ప్రయత్నించవచ్చు. డోనర్‌గా ఎవరు ముందుకొస్తారు?"

డాక్టరు చెప్పిన మాటలు విన్న శ్రీరామ్ మనసులో ఒక ఆలోచన మెదిలింది. ఆ ఆలోచన ఆయనతో పంచుకోవటానికి, చర్చించటానికి ఏకాంతంగా కలవాలనుకున్నాడు. సెలవు తీసుకుని నిష్క్రమించాడు.

★ ★ ★

'నాన్నగారి బాధను చూడలేకపోతున్నాను. ఏదో ఒకటి చేయాలన్న నా తపనకు డాక్టరు పార్థసారథి మాటలు ఊతమిచ్చాయి. నేనేమి చేస్తే ఆయన ఆరోగ్యం బాగుపడుతుందో నాకర్థమైంది. అలా జరిగిననాడు అమ్మకు ఎంత ఆనందం! ఈ వయసులో వారు ఆనందంగా వుంటే నాకు ఎంత సంతృప్తి! వెళ్లాలి. డాక్టరును కలిసి తన ఆ ఉద్దేశం తెలిపి కార్యరూపంలో పెట్టాలి. జాప్యం చేయకూడదు. అవునూ! తన భార్యతో చెప్పనవసరం లేదా?

ముందుగా తెలియజేయటం తన ధర్మం కాదా? ఇప్పటివరకూ తమ ఇద్దరి మధ్యా ఏ రహస్యాలూ లేవు. అటువంటప్పుడు తనకు చెప్పకుండా నేనీపని చేయవచ్చా? అలా చేస్తే దాంపత్య బంధానికి ద్రోహం చేసినట్లు కాదా? ఏం చేయాలి నేను? చెప్పటమా? మానటమా?'

"శ్రీవారూ! కాఫీ యిదుగో! ఏ లోకంలో వున్నారు? కాస్త ఈ లోకంలోకి వచ్చి మా మొర ఆలకించండ"న్న కుసుమ మాటలు శ్రీరామ్‌ను ఉలిక్కిపడేటట్లు చేశాయి.

కాఫీ కప్పు అందుకున్నాడు. సిప్ చేస్తూ, "కుసుమా డియర్! నేను చెప్పిన మాటలు శ్రద్ధగా విను. నాన్నగారి బాధను చూడలేకపోతున్నాను. దానికి డాక్టరు ఒక మార్గం సూచించారు. అలాచేస్తే ఆయన ఆరోగ్యవంతులవుతారు" అన్నాడు శ్రీరామ్.

"అవును, మామగారి అవస్థను, అత్తగారి మనోవ్యథను చూడలేకపోతున్నాను. వారినాస్థితి నుండి బయటపడవేసే మార్గముంటే తప్పకుండా ప్రయత్నిద్దాం. ఇంతకీ ఏమిటది? "

శ్రీరామ్ గుండెలనిండా గాలి పీల్చుకున్నాడు. "లివర్ ట్రాన్స్‌ప్లాంటేషన్. బతికున్నవాళ్ల శరీరం నుండి.."

పూర్తికాకుండానే కుసుమ ఒక్కసారిగా ఉలిక్కిపడింది. "బతికున్నవాళ్లనుండా? సాధ్యమేనా? ఎవరిస్తారు? "

"సాధ్యమే. నేనిద్దామనుకుంటున్నాను. నా కాలేయం నుండి కొంతభాగాన్ని.." అన్నాడు శ్రీరామ్.. ఆమె ముఖంలోకి పరిశీలనగా చూస్తూ.

"ఏమిటి! ఏం మాట్లాడుతున్నారో తెలుస్తోందా మీకు! మీ బాధను నేను అర్థం చేసుకోగలను. జీవితానికి అంచున ఆయనున్నారు. మొదట్లో మనమున్నాం" అంది కుసుమ. తెల్లని ఆమె ముఖం కెంజాయ రంగులోకి మారింది.

"కాదనను. కానీ వారి రుణాన్ని తీర్చుకునే అవకాశమొచ్చింది. అలా చేయటం సమంజసం కాదా!"

"సమంజసమో, అసమంజసమో నాకు తెలియదు. ఎంత డబ్బైనా ఖర్చు చేద్దాం. మన డిపాజిట్స్ అన్నీ కేన్సిల్ చేద్దాం. ఇంకా చాలకపోతే లోన్ తీసుకుందాం. వాట్స్ పాజిబుల్ ఆన్ ఎర్త్ వి విల్ డు ఇట్. బట్ ఇట్ మస్ట్ బి ప్రాక్టికల్"

"బీ హ్యూమన్. ఒక్కసారి ఆలోచించు. కాంప్లికేషన్స్ వస్తే రావచ్చు, రాకపోవచ్చు"

"అదే నన్ను భయపెట్టేది. ఒకవేళ వస్తే, మీకేమన్నా జరిగితే? ఓహ్! ఆ ఊహే నన్ను కలవరపెడుతోంది. మీరు లేకుండా నేనుండగలనా? మీకు.. నేనే కాదు, పాప కూడా వుంది. అది కూడా దృష్టిలో పెట్టుకుంటే ఇలా మాట్లాడరు"

"మన మధ్య వున్న అవగాహనను, దాంపత్యధర్మాన్ని దృష్టిలో పెట్టుకునే.. ఇదంతా నీకు చెప్పటం. ధర్మమే కాదు, బాధ్యతగా కూడా భావించి చెపుతున్నాను"

"ఐ అప్రిషియేటిట్. ఐ అడ్మైర్ దట్ ట్రెయిట్ ఆఫ్ యువర్స్, బట్, దిస్.. ఐ కాన్ట్ అండ్ వోన్ట్ బేర్"

శ్రీరామ్‌కు ఏం మాట్లాడాలో తెలియలేదు. ఎంత నచ్చచెప్పినా ఆమె వినట్లేదు. రెండు నిముషాల మౌనం తరవాత..

"నీకు చెప్పకుండా నేను అలా చేసి వుంటే..."

"చేసి వుంటే ఏమయ్యేదో, ఎటువంటి పర్యవసానాలు వచ్చేవో నాకు తెలియదు. ఊహించటమూ నాకిష్టముండదు. ముందుగా నాతో ఆ విషయం గురించి మాట్లాడటం మీ సంస్కారానికి చిహ్నం. అంతే. ఇక ఆ విషయం గురించి మరిచిపొండి. నా బాధ అర్థం చేసుకోండి" ..సుడులుగా తిరిగిన నీళ్ల రెప్పల ఆనకట్టలు దాటి, ఆమె చెక్కిళ్ల మీదుగా ధారాపాతంగా ప్రవహిస్తున్నాయి.

★ ★ ★





ఉద్యోగాలకు అన్యమనస్కంగా వెళుతున్నారు, వస్తున్నారు.. ఇద్దరూ. దాంపత్య నందనవనంలో నవ్వుల పువ్వులే పూయటం లేదు. ఎవరి ఆలోచనలలో వారు. ఇద్దరూ తమ ఆలోచనే సమంజసమనుకుంటున్నారు. తమ అంతరాత్మను సమాధానపరచుకుంటున్నారు.

★ ★ ★

ఆరోజు రాత్రి భోజనాల తరవాత "కుసుమా! ఈనెల 20వ తారీఖు ఆపరేషన్‌కు సిద్ధమవుతున్నాను. పెద్దమనసుతో ఆలోచించు" అన్నాడు శ్రీరామ్.

"మీ యిష్టం" అంటూ నిద్రలోకి జారుకుంది కుసుమ. ఆమె ప్రవర్తన, ప్రశాంతమైన స్పందన చాలా ఆశ్చర్యమనిపించింది శ్రీరామ్‌కు.

★ ★ ★

అది కోర్టు హాలు. పత్రికారంగానికి చెందినవారు కూడా చాలామంది ఉన్నారు. ఆ రోజు జస్టిస్ దివాకరరెడ్డి ఒక పిటీషన్ మీద తీర్పునివ్వబోతున్నారు. ఆ పిటీషన్ ఒక సంచలనాన్ని సృష్టించింది. 'ఇటువంటి విషయాలమీద ఇంతకుముందు ఎవరైనా కోర్టుకు వెళ్లారా! ఏమో! అయినా వెళ్లుండరు. జడ్జి ఎటువంటి తీర్పునిస్తారో'.. ఇటువంటి గుసగుసలు అక్కడ జోరుగా సాగుతున్నాయి.

జడ్జి రాకతో అంతా నిశ్శబ్దమైంది. కోర్టు యావత్తూ, న్యాయాధిపతి గౌరవానికి చిహ్నంగా లేచి నిలబడ్డారు. జడ్జి తన ఆసనంలో కూర్చున్నారు. కుడివైపున డఫేదారు నించున్నాడు.

జస్టిస్ దివాకరరెడ్డి యాభై అయిదు సంవత్సరాల వ్యక్తి. గుండ్రటి ముఖం. విశాలమైన ఫాలభాగం. ప్రశాంతతకు, చిరునవ్వుకు ఆయన ముఖం పుట్టిల్లులా ఉంది. ఆయన కోర్టు హాలంతా కలయజూశారు. కిక్కిరిసిన జనం. అందరిలో ఒక విధమైన ఉద్విగ్నత. లాయర్లు కూడ ఉత్సుకతతో ఎదురుచూస్తున్నారు. విలేఖర్లు తమ పెన్ గన్‌లతో సిద్ధంగా ఉన్నారు.

"న్యాయాధిపతులకు ఒక్కొక్కసారి challengingగా వుండే కేసులు వస్తాయి. అటువంటి అంశాలమీద అంతకు ముందు ఎవరూ కోర్టును ఆశ్రయించి ఉండరు. చట్ట పరిధులను దాటి ఆలోచించాల్సిన అంశాల మీద పిటీషన్లు వస్తూ వుంటాయి. చట్టంలో చెప్పిన సెక్షన్లను దాటి యోచించాల్సి వుంటుంది. అటువంటప్పుడు మానవీయ విలువలకు, సామాజిక విలువలకు పట్టం కట్టాల్సి వుంటుంది. శ్రీమతి కుసుమ వేసిన పిటీషన్ నన్ను ఆశ్చర్యపరచటమేకాదు.. ఆలోచింపజేసింది. ఎన్నో కేసులలో అవలీలగా తీర్పు చెప్పిన నేను.. ఈ కేసు విషయంలో చాలా ఇబ్బందిపడ్డాను. భర్త అతని తండ్రికి తన కాలేయంలో కొంత భాగం దానం చేయటాన్ని ప్రతిఘటిస్తూ ..పిటీషన్ వేశారావిడ. ఎంత సున్నితమైన అంశం! కుసుమ బాధను అర్థం చేసుకున్నాను. ఆవిడ ఆలోచనాతీరును గమనించాను. భర్తమీద భార్యకు పూర్తి అధికారముండటమన్నది సహజం. భర్తతో ఆనందంగా జీవితం గడపాలన్న కోరిక చాలా సామాన్యమైంది. దానిని ప్రశ్నించే హక్కు ఎవరికీలేదు. రాజ్యాంగంలోని 21వ సెక్షన్‌లో.. ఆనందంగా బతకటానికి వున్న హక్కును.. ఉటంకిస్తూ పిటీషన్ వేశారావిడ. అయితే మానసిక వ్యధ.. ఆవిడ ఆలోచనా విధానాన్ని కుంటుపరిచింది. ఆమె భర్తకు కూడ ఆనందంగా జీవించే హక్కు వుందికదా! సమస్య ఉత్పన్నమైంది.. అతను దానమీయటానికి సిద్ధమవ్వటం మీద. దానం ఎవరికిస్తున్నాడతను? తండ్రికి. ఆ కాలేయం దెబ్బతింది. డాక్టర్లు నయం కాదని చెప్పారు. తనకు జన్మనిచ్చి, తన ఉన్నతికి అహరహం పాటుపడ్డ తల్లిదండ్రుల బాధను కొంతవరకైనా తగ్గించటానికి అతడు సంసిద్ధుడయ్యాడు. దానివల్ల వచ్చే ఇబ్బందులు అతనికి తెలుసు. అయినా ఎందుకు ముందుకొచ్చాడు? ..తండ్రి కనుక. తల్లిదండ్రులకు ఎంతజేసినా వారి రుణాన్ని మనం తీర్చుకోలేం.. ఆ పని చేయటంవల్ల అతనికి ఆనందం కలుగుతుంది. ఆనందానికి పరిమితులు, స్థాయిలు కూడా వుంటాయి. తన భర్త తన ఆనందానికి దానం ద్వారా విఘాతం కలిగిస్తున్నాడని కుసుమ అంది.. తన తల్లిపడే మానసిక క్షోభను, తండ్రి బాధను చూడలేక కొడుకుగా తానీ పని చేస్తున్నానని శ్రీరామ్ చెపుతున్నాడు. ఎవరి వ్యక్తిగతానందాన్ని వారు కాపాడుకోవటానికి పోరాడుతున్నారు. దానం ఎంత గొప్ప గుణం! కర్ణుడు, శిబి, దధీచులను మనం ఎందుకు ఆదర్శంగా తీసుకుంటున్నాం! ఇతరులకు సహాయం చేయటంలోనే వారంత ఆనందాన్ని పొందారు కనుక. తల్లిదండ్రుల రుణాన్ని తీర్చుకునే అవకాశం వచ్చినపుడు అంతకన్నా కావల్సినదేముంది? అది నిజంగా బ్రహ్మానందమే.

శ్రీమతి కుసుమ పిటీషన్లోని అంశం పైకి ఎంతో సహజంగా కనిపిస్తున్నదైనా.. సామాజిక దృష్టితో, మానవీయకోణంతో చూసినపుడు అది ఎంతో లోతైంది. ఆవిడ పేర్కొన్న అంశంతో మరెన్నో సున్నితమైన అంశాలు పెనవేసుకున్నాయి. ఆ పెనవేతను జాగ్రత్తగా విడదీసి చూస్తే గానీ ధర్మానికి, ధర్మసూక్ష్మతకు ఉన్న భేదం తోచదు, స్ఫురించదు. తన భర్త కాలేయం దానమీయటానికి ఆవిడ మనసంగీకరించట్లేదు.

ఈనాడు మెడికల్ సైన్సు ఎంతో అభివృద్ధి చెందటంతో, అవయవాలను దానం చేయటానికి సౌలభ్యమేర్పడింది. నేత్రదానం, రక్తదానం, కిడ్నీ దానం ఇలా ఎన్నో రకాల అవయవాల దానం జరుగుతోంది. దానివల్ల ఎంతోమంది పునర్జీవితులవుతున్నారు. ఆనందంగా జీవితాన్ని గడుపుతున్నారు. తల్లిపాలను నిలువచేసి అనాథలైన బాలురకు అందించే బ్యాంకులున్నాయి. స్పెర్మ్ బ్యాంకులున్నాయి. అంతెందుకు? పిల్లలు పుట్టే అవకాశంలేని వారికి.. వారి భర్తల స్పెర్మ్‌ను స్వీకరించి, గర్భదానం చేసే స్త్రీమూర్తులున్నారు. ఇలా ఎన్నో అంశాలు శ్రీమతి కుసుమ లేవనెత్తిన అంశంతో కలిసి ఉన్నాయి.

నా ఈ తీర్పులోని ఉద్దేశం.. వ్యక్తిగత ఆనందానికే కాక, సామాజికానందానికి, భద్రతకు కూడా ఏదీ విఘాతం కలిగించకూడదని. వీటిని పరిగణనలోకి తీసుకుని ఈ పిటీషన్‌ను కొట్టివేస్తున్నాను" అని జడ్జి గంభీరంగా పలికి తన ఛాంబర్ వైపు అడుగులు వేశారు. V

తమిళ కథ

-ఎస్.రామసుబ్రమణియన్

# అంతరం

అనువాదం : కాలిపు వీరభద్రుడు

సుందరేశన్ ఇవాళ స్కూలుకు వెళ్లడమేంటి, గోడకి కొట్టిన బంతిలా తిరిగి వెనక్కి రావడమేంటి.. వెంటనే జరిగిపోయాయ్. "నేనింక స్కూలుకి వెళ్లనప్పా!" అని ఆ పిల్లవాడు ప్రకటన చేయడంతో నేను ఆశ్చర్యపోయేను.

"ఏం జరిగిందిరా"

"అందరి ఎదుటా ప్రేయర్‌లో చీవాట్లు తినాల్సివచ్చింది. 'ఫీజు కట్టకుండా స్కూలుకి ఎందుకొస్తావ్, మా ప్రాణాలు తీయడానికా? " అని కసురుకున్నారు. అంతే కాదప్పా. నన్ను బయటికి పొమ్మన్నారు. 'మొదట ఫీజుకట్టి తర్వాత క్లాసులో కూర్చో, లేదంటే నువ్వింక రావాల్సిన పనిలేదు' అని కూడా ఆవిడ అన్నారు"

నేను విలవిల్లాడిపోయేను. ఇలాంటి పరిస్థితికి విచారించడం తప్ప, నేనేం చేయగలను గనక?

"కసురుకుందెవరు? క్లాసు మిస్సా, లేక హెచ్చెమ్మా? "

"హెచ్చెమ్మే నప్పా.. అందరి ఎదుటా అవమానించేడు. 'క్షమించండి మేడమ్! ఆర్నెల్లనుంచి నాన్నగారికి పనిలేదు. ఆయన పనిచేస్తున్న కంపెనీలో సమ్మె చేస్తున్నారు. అంచేతనే మేడమ్.. ఫీజు కట్టలేకపోయాను. కంపెనీ తెరిచిన వెంటనే ఫీజు చెల్లిస్తాను' అంటూ ఎంతగానో బతిమాలానప్పా"

పన్నెండేళ్ల నా కొడుకు చెప్పిన ఈ సమాధానంలో.. వాడి వయస్సుకి మించిన వివేకం వ్యక్తమయింది.

"ఊ.. అయితే ఆమె ఏమన్నారు" నేనడిగేను.

" ఏమన్నారంటే.. 'మీ నాన్న.. కంపెనీ నుంచి డబ్బులు తీసుకువచ్చేదాకా నువ్వు ఇంట్లోనే కూర్చొని చదువుకో. మేమేం ఇక్కడ ధర్మసత్రం నడుపుతున్నామా.. ఫ్రీగా చెప్పడానికి..? 'అన్నారు. ఆ తర్వాత నన్ను బయటికి పంపించేశారు. అందరి ఎదుటా నన్ను ఇన్సల్టు చేశారు"

ఏ విషయమై యూనియన్ సమ్మె చేస్తోందో.. దాన్ని పెంచే ప్రశ్నే లేదు. మేనేజిమెంట్ ఇకనైనా అంగీకరిస్తుందా? అటు మేనేజిమెంట్, ఇటు యూనియన్.. ఇరుపక్షాలూ తమ సిద్ధాంతాల మీద దృఢంగా నిలబడ్డాయి. మధ్యలో చిక్కి నలిగిపోయినవాళ్లు పనివాళ్లు మాత్రమే. పాపం, నానా అగచాట్లూ పడుతున్నారు. ఇవాళ రేపు అంటూనే.. ఆరు నెలలు గడిచిపోయేయి. సమస్య మాత్రం అలాగే ఉండిపోయింది, సెటిలయ్యే లక్షణాలు కనిపించలేదు. అంతే, సమ్మె అలా కొనసాగుతూనే ఉంది.

మొదటి రెండు నెలలూ పొదుపుచేసి దాచుకున్నది.. ఉపయోగపడింది. తర్వాతి



రెండు నెలలూ మైథిలి నగలతో గడిచాయి. అనంతరం రెండు నెలలూ టెలివిజన్, ఫ్రిజ్, వాషింగ్ మెషీన్, మంచం, బీరువా, సోఫా.. ఇలా ఒక్కొక్కటే అమ్మేస్తుంటేనే.. బండి నడిచింది. కానీ ఇప్పుడేమీ మిగల్లేదు.. అమ్మడానికి కానీ, తాకట్టుపెట్టడానికి కానీ.

ఆరు నెలలు ఎలాగో గడిపేను. కానీ, నాకంటే హీనమైన పరిస్థితిలో ఉన్నారు చాలామంది. ఏ విధమైన రాబడి, ఆధారం లేని నలుగురు శ్రామికులు కుటుంబసభ్యులతో సహా ఆత్మహత్యలు చేసుకున్నారు. ఇంత జరుగుతున్నా యూనియన్ కానీ, మేనేజిమెంటు కానీ ఏ మాత్రం చలించలేదు... ఇంకెంతమంది బలవుతారో.. ఊహించడానికే భయంగా ఉంది.

నా క్లిష్ట పరిస్థితిని తెలపాలనే ఉద్దేశంతో సుందరేశన్‌ని తీసుకొని స్కూలుకి బయలుదేరేను అన్యమనస్కంగా. కాళ్లు ముందుకి వెళ్తుంటే, జ్ఞాపకాలు వెనక్కి వెళ్లేయి.

★ ★ ★

"గోపాలకృష్ణన్ ఇల్లు ఇదేనాండీ? ఏవండీ, ఇంట్లో ఎవరండీ? "

ఖాకీ చొక్కా, ప్యాంటుతో ద్వారం దగ్గర నిల్చొని ఉన్న వ్యక్తి పిలిచాడు.

ఒకే ఎత్తు కలిగిన డాబాలతో, ఒక్కొక్క గదితో ఉన్న.. ఎనిమిదిళ్ల కాలనీ అది.

"పిన్నీ, మీ అబ్బాయికోసం ఎవరో వచ్చేరు చూడు"

మొదటి పోర్షన్‌లో ఉండే శివరామయ్యర్ మాటలు విని, అమ్మ బైటికి వచ్చింది. నేను కూడా దూడలాగా అమ్మ వెనకనే నడిచాను.

"ఏమిటి బాబూ, మీరెవరు? ఎక్కడ్నుంచి వచ్చారు? " అమ్మ అడిగింది.

"హిందూ హైస్కూలు నుంచి వస్తున్నాను. గోపాలకృష్ణన్ ఇల్లు..? "

"అవును, మా అబ్బాయే"

"గోపాలకృష్ణన్‌ని హెడ్మాష్టరుగారు ఉన్నపళంగా తీసుకురమ్మన్నారు. అందుకే నన్ను పంపారమ్మగారూ"

"ఏం, ఎందుకు? "

"తెలీదు. మీరొచ్చి కలవండి"

"కుదరదు. వీళ్ల నాన్నగారు ఊళ్లోలేరు"

"కంగారుపడవలసిందేమీలేదు, మీరు రండి"

అమ్మ సంకోచిస్తోంది

"ఆలోచించాల్సిన అవసరం లేదమ్మా! స్కూళ్లు తెరిచి మూడ్రోజులయింది. జాయిన్ అయిన తర్వాత గోపాలకృష్ణన్ స్కూలుకెందుకు రాలేదో..? ఈ విషయం అడగడానికే మిమ్మల్ని.. రండి"

అమ్మ, నేను.. స్కూలునుంచి వచ్చిన ఆ వ్యక్తితో కలిసి బయలుదేరాం.

స్కూలు భవనం పెద్దవీధిలో ఉంది. మేం గేట్ దగ్గరికి వెళ్తుండగానే, మధ్యాహ్నభోజనానికి బెల్ కొట్టారు. పిల్లలంతా సీతాకోకచిలుకల్లా ఎగురుతూ, గెంతుతూ, తరగతులనుంచి బైటికి వస్తున్నారు.

స్కూలు అసిస్టెంట్, హెడ్మాష్టర్ స్వామినాథన్ సార్ మమ్మల్ని ఆహ్వానించారు.

"మీరేనా అబ్బాయి తల్లిగారు? "

"అవునండీ"

"ఏమీ పట్టనట్టుగా ఊరుకున్నారేమమ్మా? గోపాలకృష్ణన్ ఎడ్మిషన్ టెస్ట్ పాసయ్యాడు, జాయినయ్యాడు కూడా. స్కూలు తెరిచి మూడురోజులయినా ఇంతవరకూ మీరు అబ్బాయిని స్కూలుకు పంపలేదు. ఇంతకీ కారణమేమిటి? "

"అదేనండీ. వీళ్ల నాన్నగారు ఊళ్లోలేరు"

"అయితే ఏమయిందమ్మా? మీరున్నారు గదా. ఎడ్మిషన్ ఫీజు, స్పెషల్ ఫీజు అంతా కలిపి పావలా తక్కువ పధ్నాలుగు రూపాయలవుతుంది. అదుగో అక్కడ కేషియర్ కూర్చొన్నారు. ఫీజు కట్టేసి రండి"

"అదేకదండీ ఇబ్బంది. అందుకే మూడు రోజులూ రాలేకపోయేడు. వీళ్ల నాన్నగారొస్తే అప్పుడు.."

"అయ్యో, ఇరుగూ పొరుగూ ఎక్కడన్నా ఎరేంజ్ చేయలేదా? "

"మేం ఇక్కడికి కొత్తగా వచ్చేం. ఇక్కడింకా మాకు పరిచయాలంటూ లేవు"

"సరే, గోపాలకృష్ణన్ నాన్నగారు ఎక్కడికి వెళ్లేరు? ఎప్పుడు వస్తారు? "

"కాంగ్రెస్ సమావేశంలో పాల్గొడానికి భువనేశ్వర్ వెళ్లేరు, పూర్తయ్యాక వస్తారు"

"అంతవరకయితే పిల్లాడి చదువుకి భంగం కలుగుతుందే. ఇవాళ్టినుంచి పాఠాలు మొదలయ్యేయి. అమ్మగారూ! మరి వీళ్ల నాన్నగారు స్వాతంత్ర్య సమర యోధులా? "

అమ్మ తల ఆడించింది, ఔనన్నట్టుగా.

"మంచిది. మీరు గోపాలకృష్ణన్‌ని స్కూల్లో ఉంచేసి వెళ్ళండి. వీళ్ళ నాన్నగారు వచ్చేక ఫీజు చెల్లించండి. మీరు నిశ్చింతగా ఉండండి. అంతవరకూ పిల్లాడి చదువును ఆటంకపరచం"

కృతజ్ఞతలు తెలుపుతూ అమ్మ నమస్కారం చేసింది.

"మీరు నిశ్చింతగా ఇంటికి వెళ్లండమ్మా, మిగతా విషయం మేం చూసుకుంటాం"

అమ్మని సాగనంపి స్వామినాథన్ సార్ నా దగ్గరికి వచ్చి అడిగారు.. "ఏరా, ఏమన్నా తిన్నావా లేదా? "

"ఆ.. తిన్నానండీ" నేనన్నాను.

"ఎప్పుడూ? "

"ఉదయం"

"ఏం తిన్నావు? "

"మజ్జిగన్నం"

"పొన్నుసామీ, పొన్నుసామీ.." ఆయన పిలిచారు.

"సర్" అంటూ వచ్చాడు ప్యూన్ పొన్నుసామి. మా ఇంటికి ఇతనే వచ్చాడు.

"ఈ అబ్బాయిని తీసుకువెళ్లు. మధ్యాహ్న భోజనం పెట్టించి ఆ తర్వాత ఆరో తరగతిలో కూర్చోబెట్టు. రిజిష్టర్‌లో వీడి పేరు రాయమని సంతానంతో చెప్పు. రసీదు నెంబరు అడిగితే తర్వాత రాసుకోవచ్చని చెప్పు. "

పొన్నుసామి సంకోచిస్తున్నాడు. మాస్టారు గ్రహించేశారు.

"ఏమిటాలోచిస్తున్నావు పొన్నుసామీ! భోజనం ఉంటుందా, ఉండదా అనేనా? సరే, నా భోజనం ఉంటుంది కదా. అది ఈ అబ్బాయికి పెట్టమను. నేనో పూట ఉపవాసం ఉన్నంత మాత్రాన ఏమీ నష్టం లేదు.. అర్థమయిందా? " అంటూ ఆయన పొన్నుసామి సందేహాన్ని నివృత్తిచేశారు.

"గోపాలకృష్ణన్"

"సర్"

"మిడ్ డే మీల్స్ స్కీమ్‌లో నీ పేరు రాసేస్తున్నాను. ఇక నుంచి నువ్వు ఇంటి నుంచి భోజనం తేనవసరం లేదు. మధ్యాహ్నం ఇక్కడే భోజనం చేస్తూ ఉండు"

"అలాగే సర్"

నేను అక్కడ్నుంచి వెళ్తుండగానే, స్వామి నాథన్‌గారు తన టేబిల్ సొరుగులోంచి నోట్ బుక్, పెన్సిలు తీసి నాకిచ్చారు. "చూడు నాయనా, మనస్సు లగ్నం చేసి శ్రద్ధగా చదువుకో"

ఆయన ఆశీర్వాదం తీసుకొని, నేను పొన్నుసామితో వెళ్లాను.

★ ★ ★

"అప్పా, అప్పా! స్కూల్ కొచ్చేశాం"

సుందరేశన్ మాటలు నా చెవుల్లో పడ గానే, వాస్తవ ప్రపంచంలోకి వచ్చిపడ్డాను.

స్కూలు గేటు దగ్గరే హెచ్చెమ్ మమ్మల్ని ఆపారు. నన్ను కిందనుంచి పైదాకా చూశారు.

"ఫీజ్ తెచ్చేరా? " ఆమె స్వరం కటువుగా ఉంది.

"ఆ విషయమే మాట్లాడదామని వచ్చేను"

"ఇందులో మాట్లాడ్డానికేముంది? మన మిక్కడ ఆస్తులు పంచుకుంటామా .. విష యాలు మాట్లాడుకోవడానికి. ఫీజ్ తెస్తే కట్టేసి, పిల్లాడ్ని ఇక్కడ ఉంచేసి వెళ్లండి. లేదా వచ్చినట్టుగానే తిరిగి వెళ్లండి, పిల్లాడిని తీసుకుపోండి".. హెచ్చెమ్ కంఠం కర్కశంగా వినిపించింది.

"మేడమ్! కంపెనీలో ఆరునెలలనుంచి సమ్మె జరుగుతోంది, జీతాల్లేవు. ఎలాగో కుటుంబం గడుపుకొస్తున్నాం. రెండు మూడు రోజుల్లో ఏదో ఏర్పాటు చేసి ఫీజ్ కట్టేస్తాను"

"చూడండి మిస్టర్! ఇక్కడ మేం ఊరికే ఈ సంస్థని నడపటంలేదు. మాకూ బోలెడన్ని ప్రాబ్లమ్స్ ఉన్నాయి. మీ దగ్గర డబ్బున్ననాడే ఫీజు కట్టి అబ్బాయిని పంపండి. అంతవరకూ ఇంట్లో ఉండడమే బెటరనుకుంటాను? "

ఆయువుపట్టులో దెబ్బ తగిలినట్టుగా నా శరీరమంతా అయిపోయింది. ఒక స్కూలు ప్రధాన ఉపాధ్యాయిని ఇంత నిర్ద యగా, కఠినంగా ఉంటుందని నేను ఊహించలేదు.

'తమ ఆస్తినంతా వెచ్చించి స్కూళ్లు, కాలే జీలు స్థాపించి విద్యను అభివృద్ధిచేసిన సేవాభావం ఆనాటి వారిది. ఆ మానవతా వాదులకు, విద్యను వ్యాపార వస్తువుగా మార్చిన నేటి కఠినాత్ములకీ పోలికుందా!' ..నా రక్తం మరిగిపోయింది, సహనం నశించింది.

"ఓకే మేడమ్! టీసీ ఇచ్చేయండి. ఇంకె క్కడన్నా చదివించుకుంటాను"

"రెండువేలు కట్టి టీసీ తీసుకుపో"

నేను ఆశ్చర్యపోయాను. స్కూల్లో చదవ డానికి ఫీజు మూడొందలు! స్కూలు మానేసి టీసీ తీసుకోవడానికి రెండు వేలు!! నేనయితే ఫీజ్ కట్టే పరిస్థితిలోనే లేను!

"అప్పా" సుందరేశన్ అన్నాడు.

"ఏమిటి బాబూ? "

"టీసీ, గీసీ మనకొద్దు.. ఇంటికి పోదాం పదప్పా"

"మరి నీ చదువు? "

"బాధపడకండి. పద్దెనిమిదేళ్ల వయసొ చ్చేక ఓపెన్ యూనివర్సిటీలో చదివి డిగ్రీ తీసుకుంటాను. అంతరాత్మ చనిపోయిన వాళ్లతో మాట్లాడి మీ ఆత్మగౌరవాన్ని తగ్గించుకోకండి. పదండి పోదాం"

సుందరేశన్ మాటల్లో ఎంతో బాధ్యత, తెలివితేటలు ఉన్నాయి. "పద" అంటూ వాడి చేతిని నా చేతితో అందుకున్నాను. మా మనస్సులెంతో తేలికపడ్డాయి. మేం ఇంటివైపు బయలుదేరాం. Ⓥ

తెలుగు కథ

-కె.తాయారమ్మ



# జాబిల్లి నవ్వింది మళ్లీ!

సాయంత్రం ఐదున్నరగంటలు దాటింది. వీధిగేటుకి చేతులు ఆన్చి, రోడ్డు వైపు చూస్తోంది అంజన.

ఆమె చూపులలో ఆత్రుత కనిపిస్తోంది. ఓసారి వీధిలోకి, ఇంకోసారి లోపలికి కాలు గాలిన పిల్లిలా తిరుగుతోంది.

ఏమైంది? హృదయం గతి తప్పుతోంది. ఏ రిక్షా గణగణలు వినిపించినా అటు వైపు చూపులు సారిస్తోంది. కానీ అంత లోనే నీరసించిపోతోంది. నిరాశా నిస్పృ

హలు ఆవహిస్తున్నాయి ఆమె గుండెని.

'స్కూల్ వదిలి చాలాసేపయ్యుంటుంది! కానీ.. కానీ.. ఇంకా జాబిల్లి రాలేదు! ఏమయ్యుంటుంది? ఐదుగంటలకల్లా రిక్షా రాములు వీధిలో జాబిల్లిని దింపి వెళ్తాడు. రిక్షా దిగుతూనే 'మమ్మీ' అంటూ తనని వాటేసుకుంటుంది. ఈరోజు తన బంగారు కొండ ఇంకా రాలేదేం? '

ఒకళ్లిద్దరు వ్యక్తుల్ని ప్రశ్నించింది, "విశ్వభారతి కాన్వెంట్ స్కూల్ విడిచిపెట్టారా? " అని.

"చాలా సేపైంది, మా పిల్లలు మా ఇంటి కొచ్చి" అన్నారు వాళ్లు..

'జాబిల్లి రాలేదేం? ' మరోసారి అంజన హృదయం ఆందోళనకి గురి అయ్యింది. మెల్లగా లోపలికొచ్చి సోఫాలో కూచుంది.

గడియారం ఆరుగంటలు కొట్టింది.

'అమ్మో! ఈ పిల్ల ఏమయ్యింది? భర్త కూడా ఇంకా ఇంటికి రాలేదు. రెండు బస్సులు మారి అతను ఇంటికొచ్చేసరికి రాత్రి ఏడు గంటలు దాటుతుంది. అందుకే జాబిల్లి బాధ్యత అంతా తనమీదే పడుతోంది. పోనీ తనే వెళ్తే? అమ్మో! జాబిల్లి ఇటు, తను అటు అయిపోతే? '.. ఆ ప్రయత్నాన్ని విరమించుకుంది అంజన. ఆమె కళ్లు అవిరామంగా వర్షిస్తున్నాయి.

'తనకి దేముడిచ్చిన వరం జాబిల్లి. వెన్నెల వెల్లువలాంటి పిల్లకి తనే పేరుపెట్టుకుంది 'జాబిల్లి' అని. ఆ పాపే తన ప్రాణం. జాబిల్లికి ఏం జరిగినా తట్టుకోలేదు తను. ఆ ఎడబాటుని క్షణకాలం కూడా భరించలేదు. స్కూల్నుంచి వచ్చినప్పటినుంచీ తనని అంటిపెట్టుకునే వుంటుంది జాబిల్లి. అలాంటిది తను ఈ రోజు ఇంకా ఇంటికి రాలేదు. ఏం జరిగింది? '

కీడు శంకించే మనసుని అదిమిపట్టింది.

మరో అరగంట గడిచింది.

వీధివైపే చూస్తూ కూచుంది అంజన.

ఇంతలో భుజాన స్కూల్బ్యాగ్ వేసుకుని నెమ్మదిగా వస్తున్న జాబిల్లి కనిపించింది.

ఒక్క ఉదుటున వీధిలోకి పరుగెత్తి "నా బంగారుకొండా.. జాబిల్లీ! ఇవాళ ఇంత లేటైందేమమ్మా? " అంటూ ఎత్తుకుని లోపలికి తీసుకొచ్చింది అంజన.

ఆమె హృదయం తేలికపడింది. 'అమ్మయ్య! తన బిడ్డ తన దగ్గరకొచ్చింది. భగవాన్! నువ్వు దయామయుడివి' అనుకుంటూ భగవంతుడికి నమస్కరించింది.

ఎందుకో జాబిల్లి నీరసంగా కనుపించింది అంజనకి. వెంటనే బోర్నవిటా కలిపి తెచ్చి పట్టించింది. "ఒక్క క్షణం పడుకో కన్నా!" అంటూ ఒళ్లో పడుకోపెట్టుకుని జోకొట్టసాగింది అంజన. "ఏమైందిరా బుజ్జీ? " ఆ పిల్ల తల నిమురుతూ ప్రశ్నించింది.

"మరేమో మమ్మీ! మా స్కూల్ మధ్యాహ్నం విడిచిపెట్టారు! కానీ.. నేను నిద్రపోయాను! రిక్షా రాలేదు. నన్ను నిద్ర లేపి బైటికి పంపించేడు ప్యూన్. పొద్దుపోయింది. నేను మెల్లిగా నడుచుకుంటూ వచ్చేను!" చిలకలా ఒక్కొక్క పలుకే పలికింది జాబిల్లి.

"చిన్నీ ఒక్కర్తివీ వచ్చేవా? నీకేమైనా అయ్యుంటే నేనేమైపోయుండేదాన్ని? " గుండెమీద చెయ్యివేసుకుంది అంజన భయంతో. తరువాత జాబిల్లికి వేడినీటితో స్నానం చేయించి, చకచక వంట వండి తినిపించింది.

ఇంతలో భర్త భార్గవ వచ్చేడు. జరిగిన సంగతంతా పూసగుచ్చినట్లు చెప్పింది. జాబిల్లిమీద ఆమెకున్న ప్రేమంతా వెల్లువలా పొంగింది ఆ మాటలలో.

చిన్నగా నవ్వాడు భార్గవ. "చూడు అంజనా! ప్రేమనేది వుండొచ్చు కానీ అది అతి కాకూడదు. జాబిల్లి మీద నీకుండే వాత్సల్యం అలా అనిపిస్తుంది. కానీ..పిల్ల



లకుండే తెలివితేటలు వాళ్లకుంటాయి. స్కూల్ నుంచి ఒంటరిగా జాబిల్లి ఎలా వచ్చిందీ? "

"నా బాధ మీకు తెలియదు!" ఏడుపు గొంతుతో అంది.

"నా పిచ్చి అంజనా! నీ మమకారం నాకు తెలుసు. జాబిల్లి నీకు పంచప్రాణాలనీ తెలుసు. కానీ అన్నిటికీ ఆందోళన పడకూడదు" అన్నాడు భార్గవ బుజ్జగింపుగా.

ఇంతలో జాబిల్లి వచ్చింది "డాడీ!" అంటూ.

"ఏరా కన్నా! మీ మమ్మీకి ఎందుకింత టెన్షన్ కలిగించావు? " అంటూ ఆ పిల్లని ఎత్తుకుని ముద్దులతో ముంచెత్తేడు భార్గవ. జాబిల్లి వాళ్లిద్దరి కంటిపాప.

భార్గవ, అంజనలు భోజనంచేసి వచ్చేసరికి కుర్చీలో కూచుని టి.వి. చూస్తోంది జాబిల్లి.

"ఇవాళ హోంవర్కు చెయ్యవా కన్నా!" అంటూ దగ్గరకొచ్చాడు భార్గవ.

ఒక్క ఉదుటున అతని ఒళ్లోకి దూకి "ఈరోజు హోంవర్క్ లేదు డాడీ! మధ్యాహ్నం స్కూల్కి ఎందుకో సెలవిచ్చారు కదా!" అంది ముద్దుముద్దుగా.

"నా బుజ్జివి కదూ నువ్వు!" అంటూ ముద్దులతో ముంచెత్తాడు భార్గవ.. జాబిల్లిని.

"అయితే ఇవాళ నువ్వు డాడీతో ఎన్నో కబుర్లు చెప్పొచ్చు!" అంది అప్పుడే అక్కడికొచ్చిన అంజన.

తన స్కూల్ విషయాలు, ఫ్రెండ్స్ సంగతులూ అన్నీ చిలకలా చెప్పింది జాబిల్లి.

ఇద్దరూ పొంగిపోయారు, నవ్వుకున్నారు, దొంగాటలాడుకున్నారు, దాగుడుమూతలాడుకున్నారు.

భార్గవ, అంజన ఆనందానికి అవధులు లేవు. జాబిల్లి చిలకలా పలుకుతుంది. వెన్నెలసోనలా నవ్వుతుంది. కోకిలలా పాడుతుంది. 'ఈ పాప ఏనాటి పుణ్యమో? ' అని ఇద్దరూ అనుక్షణం అనుకుంటూ వుంటారు.

జాబిల్లికి నాలుగేళ్లు. కాన్వెంట్లో ఎల్.కె.జి. చదువుతోంది.

"రేపు స్కూల్కెళ్లాలి, వేగం నిద్రపో" అంటూ జాబిల్లిని ఎత్తుకుని తన పక్కవైపు తీసుకెళ్లింది అంజన.

ఇటువైపు అంజన, అటువైపు భార్గవ ..మధ్యన జాబిల్లి. మాట్లాడుతూనే నిద్రలోకి జారుకుంది జాబిల్లి.

ఆ పిల్ల ముఖంలోకి అపురూపంగా చూస్తున్నారు భార్గవ, అంజనలు.

పాప ముఖం చంద్రబింబంలా వెలిగిపోతోంది. పెదాలమీద దరహాస చంద్రికలు తారట్లాడుతున్నాయి.

'ఈ పాప తమ కలల పంట. దైవమిచ్చిన వరం' ..భార్గవ ఆలోచిస్తూ నిద్రలోకి జారుకున్నాడు.

అంజనకి కన్నుపొడుచుకున్నా నిద్ర రావడం లేదు. ఓసారి జాబిల్లి వైపు చూసింది. అమాయకంగా నిద్రపోతోంది జాబిల్లి.

ఈ పిల్లకి "వెన్నెల" అని పేరుపెట్టాలనుకుంది అంజన. కానీ అంతలోనే 'జాబిల్లి' అంటే బావుంటుందనిపించింది. 'జాబిల్లి తన ప్రాణం' మరోసారి అనుకుంది. ఎట్టి పరిస్థితిలోనైనా జాబిల్లి తనకి దూరం అయితే తను భరించగలదా? ఆ ఊహే భరించలేకపోతోంది. 'భగవాన్! నన్ను దయచూడు. ఏదీ తట్టుకోలేను! అసలు జాబిల్లి ఎవరు? తానెవరు? ఎందుకీ బంధం? ఏమిటీ విచిత్రం? ఇదెలా జరిగింది?

★ ★ ★

"ఈసారన్నా చంద్రమ్మ తల్లి జాతర కెళ్దాం. పెళ్లయి పదేళ్లు దాటినా పిల్లాలేదు, పీచూలేదు! అందరూ నన్ను గొడ్రాలని గేలి చేస్తున్నారు. చంద్రమ్మ తల్లి సత్యమైన

తల్లట. ఏ కోరికలు కోరినా తీరుస్తుందట. ఓసారి వెళ్దామండీ!" అంది అంజన, భర్త భార్గవతో.

"మంత్రాలకి చింతకాయలు రాల్తాయా అంజనా? "అన్నాడతను అతిసాధారణంగా.

"ఈ ఒక్కసారికి నా మాట వినండి. ఏ పుట్టలో ఏ పాముందో? ఏ దేవతలో ఏ మహత్యం వుందో? " కన్నులలో నీటితడి మెరుస్తుండగా అంది అంజన. భార్గవ హృదయం ద్రవించింది. "సరే వెళ్దాం" అన్నాడు.

ఇద్దరూ బయలుదేరారు, చంద్రమ్మ తల్లి తిరునాళ్లకి.

ఉత్సవం చాలా బాగా జరుగుతోంది. భక్తులు తండోపతండాలుగా వస్తున్నారు. బస్సులు, ఆటోలు, జీపులు కిటకిటలాడుతు న్నాయి. కొందరు ఎడ్లబళ్ల మీదకూడా వస్తున్నారు! 'ఇంకా ఎడ్లబళ్లున్నాయా? నా చిన్నప్పుడు ఎడ్లబళ్ల మీద ప్రయాణాలు చేసేవాడిని. అప్పుడు బామ్మ ఒడిలో.. ఆవిడ చీరకొంగు కప్పుకుని కూచునేవాడ్ని!" అనుకున్నాడు భార్గవ.

అతని పెదాలమీద ఆనాటి జ్ఞాపకం తాలూకు హాసరేఖ మెరిసింది.

"నవ్వుతున్నారు.. నేను తిరునాళ్లు చూద్దామన్నాననే కదూ? " చిరుకోపం ధ్వని స్తుండగా ప్రశ్నించింది అంజన.

"కాదు! ఇది ఆనాటి జ్ఞాపకం!" అన్నా డు.. భుజం మీద ఆప్యాయంగా చెయ్యి వేస్తూ.

చంద్రమ్మ తల్లి గుడి దగ్గర డప్పులమోత హోరున వినిపిస్తోంది. అక్కడక్కడ దేవత మీద పాటలు పాడుతున్నారు. మరోచోట మొక్కులు మొక్కుతున్నారు. ఇంకోచోట మొక్కులు తీర్చుకుంటున్నారు.

అంతా సందడే సందడి. రకరకాల దుకా ణాలు, చిన్ని చిన్ని సర్కస్‌లు, రంగుల రాట్నాలు, తినుబండారాల అంగళ్లు,





బొమ్మల దుకాణాలు. అందమైన ఓ మట్టి బొమ్మను కొంది అంజన. అది ఓ పాప బొమ్మ. 'ఎంత బావుందీ బొమ్మ! ఇలాంటి పాప వుంటే బావుణ్ణు'..కనురెప్పల చాటున అదిమిపెట్టింది, ఉబికివస్తున్న కన్నీటిని.

ఇద్దరూ గుడిని సమీపించారు. చంద్రమ్మ తల్లికి నమస్కరించారు వినమ్రంగా. ఆ తల్లి చల్లని చూపులు వారిద్దరి మీద ప్రసరి స్తున్నట్లనిపిస్తోంది.

"అమ్మా చంద్రమ్మ తల్లీ! మాకో బిడ్డను ప్రసాదించు".. భక్తిపూర్వకంగా వేడుకు న్నారు. ఎన్నో మొక్కులు మొక్కారు.

జాతర పూర్తయ్యేసరికి అర్ధరాత్రయ్యింది. బస్సులన్నీ కిటకిటలాడుతున్నాయి. అలా నడుచుకుంటూ వచ్చారు. అప్పటికే చాలా మంది వెళ్లిపోయారు. మరికొంతమంది చుట్టాలిళ్లల్లో వుండిపోయారు.

ఆ ఊళ్లో తమకెవరూలేరు. ఒకరిద్దరు



తెలిసినవాళ్లు పలకరించి ఊరుకున్నారు. ఆ రాత్రి ఎక్కడుంటారు? మరికొంతదూరం నడిచి ఓ చోట కూచున్నారు. ఆ కానా కిందనుంచి చిన్నగడ్డ పారుతుంది వర్షాకా లంలో. కానీ అప్పుడు ఎండాకాలం కావ డంతో అది ఎండిపోయి ఉంది.

ఊరికి చాలా దూరంలో వున్నారు వాళ్లు. చల్లని గాలులు వీస్తున్నాయి. ఒకటీ ఆరా వాహనాలు సాగిపోతున్నాయి. చెయ్యిపెట్టి ఆపినా, అవి ఆగడంలేదు.

"ఈ రాత్రికి జాగారంలాగే ఉంది!" అన్నాడు భార్గవ.

"ఉపవాసం కూడా చేశాంగా! అంటే మనకి ఫలితం దక్కినట్టే! చంద్రమ్మ తల్లి మనని కరుణించినట్లే" అంది అంజన ఏదో ఊహలో తేలిపోతూ.

ఇంతలో ఏదో ఏడుపు.. దగ్గరలోనే విని పిస్తోంది. ఎక్కడనుంచి...? అటూ ఇటూ చూశారు. కానీ.. ఎక్కడ? ఎవరు? నిదా నించి విన్నారు భార్గవ, అంజనలు.

ఏదో గ్రహించినదానిలా "ఏమండీ! ఈ కానా కిందనించి వినవస్తోంది!" అంది అంజన.

ఒక్క ఉదుటున కిందికి దిగాడు భార్గవ. అక్కడంతా చీకటిగా వుంది. గడ్డ ఎండి, పెళుసులు ఊడి, గోతులు గోతులుగా వుంది. చుట్టూ ముళ్లపొదలు. కానా లోప లికి వంగి చూశాడు. అక్కడ ఓ చిన్న పిల్ల ఆకారం! వెక్కి వెక్కి ఏడుస్తున్న వైనం!! మెల్లగా అందులో దూరి ఆ బిడ్డని బైటికి లాగి ఎత్తుకుని.. మీదికి తీసుకొచ్చాడు అతి ప్రయాసమీద.

ఆశ్చర్యంగా చూస్తోంది అంజన.

"అంజూ! బిడ్డ..ఇంద! అందుకో" అంటూ

అంజన చేతికి బిడ్డని అందించి ఒంటికి అంటిన దుమ్ముని దులుపుకున్నాడు భార్గవ.

"ఏమిటి? ఏమిటండీ ఇదంతా? "

"ఎవరో ఏమో! ఈ పాప తప్పిపోయినట్లుంది. ఎవరిదని వెతుకుతాం? " అన్నాడు భార్గవ.

"పాపా! మీదేవూరు? "

పాప మాట్లాడలేదు! తను చందమామలా వుంది. మూడు నాలుగేళ్ల వయస్సుంటుంది.

"ఇప్పుడేం చేద్దాం? " భార్గవ ఆందోళనగా ప్రశ్నించాడు.

"ఏమండీ ఒక్కమాట! పాపని మనతో తీసుకెళ్దాం. ఎవరైనా వెతుక్కుంటూ వచ్చి అడిగితే ఇచ్చేద్దాం. లేకపోతే చంద్రమ్మ తల్లే మనకి ఈ బిడ్డనిచ్చిందని పెంచుకుందాం" అంది అంజన.

ఈ మాట సబబుగా తోచింది భార్గవకి. పాపకి రెండు బిస్కెట్లు తినిపించి, మంచి నీళ్లు పట్టించారు. ఏ తెల్లవారుఝాముకో ..ఓ ఆటో మాట్లాడుకుని ఇంటికొచ్చారు భార్గవ, అంజనలు. మరునాడు ఉదయం పాపకు పాలుపడుతూ "మీదే వూరు? మీ అమ్మ నాన్నా ఎక్కడుంటారు? నువ్వు తిరునాళ్లలో తప్పిపోయావా? " ఇత్యాది ప్రశ్నలు వేశారు.

పాప పిచ్చిచూపులు చూస్తోంది. ఏమీ మాట్లాడడం లేదు. "మాటలు రావా? " అడిగారు ఇద్దరూ..

"వచ్చు!" అన్నట్లు తలఊపింది.

రెండురోజులు గడిచాయి. పాప డల్‌గా, మూడీగా ఉంటోంది. పెడ్తే తింటోంది! తాగిస్తే తాగుతోంది, పాలో నీళ్లో! ఏదైనా ప్రశ్నిస్తే "ఔను, కాదు' అని మాత్రమే సమాధానం చెప్తోంది.

'ఏమిటిదంతా? ఈ పాప ఎవరు? తామెవరు? పాపని ఎత్తుకొచ్చామని ఏ పోలీసులైనా ప్రశ్నించరు కదా, దాడిచెయ్యరు కదా!'.. గుండె దడదడలాడింది ఆ భార్యాభర్తలకి.

రోజులు దొర్లుతున్నాయి. పాపకి సకల సంరక్షణలూ చేస్తున్నారు అంజన, భార్గవలు. ఇప్పుడిప్పుడే పాప మనుష్యులలో పడుతోంది.

ఈ పాప ఎక్కడనించి వచ్చింది? మరో సందేహం!

"పాపా! మాతో ఇక్కడే ఉంటావా? "ఆశ మెరుస్తుండగా ప్రశ్నించారు.

వెన్నెల ఒలకపోసినట్లు నవ్వింది పాప.

"ఏమైతే అయ్యింది, పాపని దత్తత చేసుకుందామండీ!" అంది అంజన. ఆమెలో మొండి ధైర్యం చోటుచేసుకుంది.

ఓ మంచి ముహూర్తంలో బంధువులు, స్నేహితుల మధ్య పాపని దత్తత చేసుకున్నారు భార్గవ దంపతులు.

'తిరునాళ్లలో భార్గవ దంపతులకి పాప దొరికింది. ఆ పిల్లని దత్తత తీసుకున్నారు' అనుకున్నారు చాలామంది. కొందరేమో "కులం, గోత్రం తెలీకుండా బిడ్డని దత్తత చేసుకోవడమేంటి!" అని బుగ్గలు నొక్కుకున్నారు!

ఏది ఏమైనా, దేవుడిచ్చిన బిడ్డ పాప.

పాపకి 'జాబిల్లి' అని పేరుపెట్టారు.

ఆ ఇద్దరి ముద్దుల పట్టి జాబిల్లి. కాన్వెంట్ స్కూల్లో చదువుతోంది. ఒక విధమైన నిశ్చింత చోటుచేసుకుంది పాప హృదయంలో, 'తనకీ అమ్మా నాన్నా ఉన్నారు'. అంజన ఒళ్లోకి చేరింది పాప. ఒక విధమైన భద్రత లభించినట్లయింది.

★ ★ ★

పాప దగ్గరకు రాగానే తుళ్లిపడి ఆలోచనల నుండి తేరుకుంది అంజన. "పాపా! నా జాబిల్లీ! నువ్వే నా ప్రాణం!" అంటూ పొదువుకుంది ఇంకా దగ్గరగా.

"ఇంత పిచ్చి పనికిరాదోయ్!" అంటూ ఉంటాడు భార్గవ అప్పుడప్పుడు. 'ఇది పిచ్చి కాదు.. ప్రేమ' అనుకుంటూ ఉంటుంది అంజన. ఒకొక్కసారి ఆమె అంతరంగం అంతులేని భయానికి లోనవుతూ ఉంటుంది. ఏ క్షణంలోనైనా, ఎవరైనా వచ్చి 'ఈ పాప మా పాప' అని జాబిల్లిని తీసుకుపోతే? తను భరించగలదా? జాబిల్లి దూరమైతే తను ఈ లోకంలోనే ఉండదు.

రోజులు దొర్లుతున్నాయి. జాబిల్లి ముద్దులతో కాలమే తెలియడం లేదు అంజన, భార్గవలకి.

జాబిల్లి స్కూల్‌కెళ్తోంది, వస్తోంది. అప్పుడప్పుడు తన ఈడు పిల్లల్ని వెంటపెట్టుకు వస్తోంది. సెలవురోజులలో ఇరుగు పొరుగు పిల్లలతో ఆటలాడుతుంది, పాటలు పాడుతుంది.

ఆరోజు ఊహించని రోజు. అన్నపూర్ణేశ్వరం బాబాయి ఊడిపడ్డాడు పల్లెటూరినుంచి. వస్తూనే "అమ్మాయ్ అంజనా! బిడ్డని పెంచుతున్నావట! తిరునాళ్లలో దొరికిందటగా బిడ్డ? ఏ బంధువుల బిడ్డనో పెంచుకోక ఊరు, పేరు, కులం, గోత్రం లేని ఈ దిక్కుమాలిన పిల్లని పెంచుకుంటారేం? "

"బాబాయ్! మరొక్క మాట మాట్లాడకు, భరించలేను. పాప నా ప్రాణం. భగవంతుడిచ్చిన బిడ్డ.. పాప!" అంది అంజన గట్టిగా.

"సరేలే! బిడ్డ ఎక్కడ? "

"స్కూల్‌కెళ్లింది, వస్తుంది" అంది అంజన ముక్తసరిగా..

సాయంత్రం అయ్యింది. పాప వచ్చింది. కాఫీ టిఫిన్లు అయ్యాక మంచంమీద పడుకున్న అన్నపూర్ణేశ్వరం లేచి కూచున్నాడు. "ఈ బిడ్డనా పెంచుకున్నారు? " అంటూ "ఇట్రా రా పాపా!" అని పిలిచాడు.

పాప భయంభయంగా వచ్చింది అతని దగ్గరగా.

పాప ముఖంలోకి పరిశీలనగా చూసి, "ఈ బిడ్డ.. ఈ బిడ్డ...మా ఊరు బిడ్డే! కాంతమ్మ మనవరాలు!" అన్నాడు గట్టిగా.

హతాశురాలయ్యింది అంజన.

'ఇతగాడు వెళ్లి.. వాళ్ల తల్లిదండ్రులతో చెప్తే, వాళ్లు జాబిల్లిని తీసుకుపోతారా? భగవాన్! నాకెందుకీ పరీక్ష? '.. కన్నీరు స్రవిస్తుండగా అంది "బాబాయ్! ఏమిటి నువ్వంటున్నది? "

"అవును అంజనా! ఈ పిల్ల తల్లిదండ్రులిద్దరూ నెలరోజుల తేడాలో చచ్చారు! దీన్ని నాన్నమ్మ పెంచుతూండేది. కానీ ఎందుకో ఈ పిల్లంటే ఆవిడకి ఇష్టం వుండేది కాదు. అస్తమానం చావకొడుతూ ఉండేది. అదే దీన్ని తిరునాళ్లలో వదిలిపెట్టి ఉంటుంది. బిడ్డ ఏ అంటురోగమో వచ్చి చచ్చిందని చెప్పింది. ఇంతకుమించి నేను చెప్పలేను అంజనా! ఆ దేవుడే మిమ్మల్ని రక్షించాలి! నే పోతున్నా!" అంటూ పై కండువా వేసుకుని వెళ్లిపోయేడు అన్నపూర్ణేశ్వరం బాబాయ్.

"ఏమిటిదంతా.. జాబిల్లిని నాన్నమ్మ వదిలిపెట్టడం ఏమిటి? పోనీ.. తనకేమిటి? జాబిల్లిని ఇక ఎవ్వరూ తీసుకుపోలేరు'

రోజులు దొర్లుతున్నాయి. మరో ఘోరమైన రోజు! ఆ రోజు ఆదివారం. పాప పక్క ఇంటి దగ్గర ఆడుకుంటోంది.

ఇంతలో పక్క ఇంటి పాప పప్పీ వచ్చి "ఆంటీ! జాబిల్లి పడిపోయింది!" అంటూ చెప్పింది. ఒక్క ఉదుటున వీధిలోకి పరుగెత్తింది అంజన. పాప..కిందపడి వుంది తెలివితప్పి. తీసి ఎత్తుకుంది. ఒళ్లు వేడిగా ఉంది. భర్తకి ఫోన్ చేసి హాస్పటల్‌కి తీసుకెళ్లింది అంజన.. జాబిల్లిని.

డాక్టర్ చెప్పిన మాట విని నిలువునా కుంగిపోయారు అంజన, భార్గవలు. వారికి లోకమంతా చీకటిగా కనిపించసాగింది. 'ఏమిటిదంతా? '

నాలుగు రోజులు ఆసుపత్రిలో వుంచి, ఇంటికి తీసుకువచ్చారు జాబిల్లిని. అంతు

లేని నైరాశ్యం కమ్ముకుంది ఆ దంపతుల్ని. మళ్లీ తమవి ఒంటరి బతుకులు కాబోతు న్నాయా?

నీరసంగా, నిస్ప్రాణంగా గడుస్తున్నాయి రోజులు.

జాబిల్లి స్కూల్‌కి వెళ్లివస్తోంది. ఆ పిల్ల వేపు జాలి చూపులు చూడడం తప్పించి, మరేమీ చెయ్యలేకపోతున్నారు భార్గవ దంపతులు.

ఒకరోజు అర్ధాంతరంగా స్కూల్‌నుంచి వచ్చింది జాబిల్లి. ఆశ్చర్యంగా చూశారు అంజన, భార్గవ్‌లు.

"నన్ను స్కూల్‌నుంచి పంపేశారు మమ్మీ! రేపటినుంచి రావద్దన్నారు!" అంది జాబిల్లి బిక్కమొహం వేసుకుని.

కనిపించని దైవాన్ని నిందించారు ఆ ఇద్దరూ.. "మేం నీకేం ద్రోహం చేశాం? " అంటూ.

"నా బంగారు జాబిల్లీ! నువ్వెక్కడికీ వెళ్లొద్దు! నా దగ్గరే వుండు!" అంటూ అక్కున చేర్చుకుంది అంజన.

రోజులు గడుస్తున్నాయి.

ఆ రోజు భార్గవ, అంజనలకు దుఃఖం పెరిగిన రోజు. బతుకుమీద ఆశ మరింత సన్నగిల్లిన రోజు.

పాప ఎవ్వరికీ అందనంత దూరం వెళ్లిపోయింది! కాదు... కాదు.. ఆకాశంలో జాబిల్లిలో కలిసిపోయింది.

శూన్యం ఆవరించిన ఆ ఇంట్లో నిర్జీవ ప్రతిమల్లా మిగిలిపోయారా భార్యభర్తలు. కాలం ఆగదు."ఎన్నాళ్లిలా తిండీ నీళ్లూ లేకుండా శుష్కించిపోతావు అంజనా? కాస్త ఎంగిలిపడు!" అంటూ రెండు మెతుకులు తినిపిస్తున్నాడు భార్గవ.. భార్య చేత.

"జాబిల్లి.. జాబిల్లి!" అంటూ శూన్యంలోకి చూస్తూ రోజులు వెళ్లదీస్తోంది అంజన.

ఉన్నట్టుండి ఓ రోజున కళ్లుతిరిగి పడిపోయింది అంజన.. ఇంట్లోనే. గాభరాపడి డాక్టర్ని తీసుకొచ్చాడు భార్గవ.

డాక్టర్ పరీక్షించి, ఆ వెంటనే ఓ ఆశ్చర్యకరమైన విషయం చెప్పాడు.. అంజన తల్లి కాబోతుందని!

భార్గవ కళ్లలోకి వెలుగొచ్చింది. అంజన ఏ భావమూ వ్యక్తంచేయలేదు. డాక్టర్ చెప్పిన సలహాలు పాటిస్తున్నారు. 'మంచి ఆహారం, సరియైన నిద్ర, అందమైన ప్రదేశాలు చూడడం, మనసుని ప్రశాంతంగా వుంచుకోవడం లాంటివి చేస్తే చక్కని బిడ్డకి జన్మనివ్వగలుగుతుంది అంజన. లేకపోతే ఈ వయసులో చాలా కష్టం!'.. ఇదీ డాక్టరే చెప్పాడు.

కాలం కదులుతోంది. అంజన ఇప్పుడిప్పుడే మనుషుల్లో పడుతోంది. తొమ్మిది నెలలు తిరిగేసరికి పండంటి పాపాయికి జన్మనిచ్చింది. భార్గవ ఆనందానికి అవధులు లేవు. అంజన కళ్లు మెరిశాయి.

పొత్తిళ్లలోని పాప.. నిద్రలో నవ్వుతోంది. 'పసిపాపలు దేవుడితో మాట్లాడతారట! ఏం మాట్లాడుతోందో? అమ్మానాన్నల మనసు గాయం చెయ్యననా? '

బారసాల పీటలమీద కూచున్నారు అంజన, భార్గవలు. అంజన ఒడిలో పాప పడుకుని వుంది. పిడికిళ్లు గట్టిగా మూసుకుంది. ఏం దాచిందో?

"పాప పేరు చెప్పండి? " పురోహితుడు అడిగాడు.

"జాబిల్లి" దృఢంగా వచ్చింది ఆ మాట అంజన నోటినుండి. భార్గవతో పాటు అందరూ ఆశ్చర్యపోయారు.

అంజన హృదయం ఎటో పయనిస్తోంది. ఆమె అంతరంగంలో ఒక అగ్నిజ్వాలరేగి అంతలోనే మాయమయ్యింది.

"భగవాన్! పెద్దలు చేసిన తప్పుకి పిల్లలను బలి చెయ్యకు. అభం శుభం తెలియని పసిపిల్లల్ని ఎయిడ్స్ బారిన పడెయ్యకు'.. అని మనసా, వాచా, కర్మణా భగవంతుణ్ణి ప్రార్థించింది.

జాబిల్లి నవ్వింది మళ్లీ. V

తమిళ కథ

-శ్రీని

అనువాదం : జి.సి.జీవి




# వెలుతురు

"చీకటి పడుతోంది.."

"ఊ.."

"సముద్రమంతా నలుపుతిరుగుతూ వుంది"

"భయమేస్తోందా? "

"ఊ..హూ.."

"ఇంటికి పోదామా? "

"ఊ.. హూ.."

"భయమా? "

"ఊ.. ఆ మీసాలోడు అరుగుమీదే కాళ్లు చాపుకుని కూర్చుని వుంటాడు. మనల్ని లోపలికి రానీడు"

"ఇప్పుడే కాదులే. ఇంకొంచెం చీకటి పడాలి. వెంటనే వెళితే అమ్మని

చూడొచ్చు"

"ఊహూ.. వీలు కాదు. దీపాలు పెట్టేశారు. పౌడరు రాసుకుని, పూలు పెట్టుకుని, తలుపు మూసి వుంటుంది అమ్మ. బుర్రమీసాలోడు కుక్క మాదిరి అరుగుమీద కాపలా వుంటాడు. అమ్మ దగ్గరికి పోలేం మనం"

"ఎవరైనా వచ్చివుంటారా? "

"ఊ..నల్లగా, మొరటుగా, అసహ్యంగా"

"భయంగా వుంటుంది.. వాళ్ళని చూస్తేనే.."

"కానీ అమ్మకి భయంలేదే.. వాళ్ళతో నవ్వుతూ, చతుర్లాడుతూ ఉంటుందిగా"

"అమ్మకి బాగా డబ్బులిస్తారేమో? "

"లేదు. ఆ మీసాలోడే డబ్బంతా లాగేసుకుంటాడు"

"అమ్మకీ యిస్తాడ్లే"

"అవునేమో! మొన్న పండక్కి నీకు చొక్కా, నిక్కరు.. నాకు గౌను, రిబ్బను, పావడా, గాజులు.. అన్నీ కొనిచ్చాడులే"

"మతాబాలు కూడా కొనిచ్చాడుగా"

"ఏమైనా మిఠాయి కొనుక్కోండని డబ్బులు కూడా యిచ్చాడు మనకి"

"అయితే వాడు మంచోడేనంటావా? "

"ఛీ.. దొంగముండా కొడుకు, ఎదవ.."

"ఏం.. ఎందుకని? "

"దీపావళికి..అమ్మతో కలిసి బజారుకెళ్లి డ్రస్సు కొనుక్కోవాలని నువ్వు ఎంత ఏడ్చావు. ఆ సచ్చినోడు ఏమన్నాడు? "

"ఏమన్నాడు? "

"మీ అమ్మకి మంచి గిరాకీలు తగిలేది ఈ సమయంలోనే. అది రావటానికి వీల్లేదు ఫోండి.. అని కసురుకోలేదూ ఆ ముదనష్టపోడు.."

"వానొచ్చేట్టుంది కదూ.లే, వెళదాం"

"నీ పావడా అంతా ఇసక. బాగా విదుల్చుకో"

"నీ నిక్కరు జారిపోతూ వుంది. బిగించి కట్టుకో"

"చినుకులు మొదలయ్యాయి, పద తొందరగా"

"అబ్బ.. ఎంత పెద్ద అలలో చూడు! ఎంత అందంగా వుందో కదా"

"అందమా? థూ..అమ్మా అందంగానే వుంది చూట్టానికి..కానీ..ఛీ ఛీ "

"సరేలే. త్వరగా నడువ్, పోదాం"

"ఎక్కడికి? "

"ఇంటికే. వెళ్ళి 'అమ్మా' అని పిలుద్దాం. తలుపు తెరుస్తుందేమో.. "

"లాభంలేదు. లోపల్నుంచి నవ్వులు వినపడతయ్. ఆ మీసాల ముండాకొడుకు మన మొహాన డబ్బులు విసిరేసి 'ఏదయినా తినేసి వచ్చి ఈ అరుగుమీదే నోర్మూసుకుని తొంగోండి' అని కసుర్తాడు. నేను రాను ఆ ఇంటికి"

"త్వరగా నడువ్, పెద్ద వాన వస్తోంది"

"అదిగో.. దూరాన ఎంతో పెద్ద లైటు తిరుగుతూ వుంది. భలే వుంది కదూ!"

"ఆ లైటుకేసి చూడొద్దు.నీ కళ్ళు దెబ్బ తింటాయ్"

"చొక్కా వేసుకోలేదేం? చలి వెయ్యట్లే.? "

"లేదు, మండుతూ వుంది"

"మండుతోందా? ఏం? "

"నాతో పాటు పరిగెత్తు, వాన జోరెక్కువైంది"

"ఇటెక్కడికి? "

"కుట్టి గాడింటికాడికి పోదాం"

"కుట్టి.. మంచోడేనా? "

"వాళ్ళమ్మ మంచిది"

"ఎందుకని? "

"ఆమె ఎప్పుడూ వాడి పక్కనే ఉంటుంది"

"రాత్రిళ్ళు కూడానా? "

"ఊ.."

"వాళ్ళింటికి రాత్రిళ్ళు ఎవరూ రారా? "

"ఊహు.. తలుపు తెరిచే వుంటుంది"

"కానీ వాళ్ళమ్మ రోజూ స్నానం చెయ్యదు, పౌడరు రాసుకోదు, ఒళ్ళంతా చెమటకంపు.. ఛీ.."

"నిజంగా? "

"అవును. ఎంత చెమట వాసనో!"

"అయితే ఏంలే.. కుట్టిగాడు ఎంచక్కా ఆమె వొళ్ళో పడుకుంటాడు హాయిగా"

"మన అమ్మ పౌడరు రాసుకుంటుంది. తలనిండా పూలు పెట్టుకుంటుంది. ఘుమఘుమలాడుతుంది.. ఏం లాభం? మనం అమ్మ వొళ్లో కూచోలేం కదా? "

"కుట్టిగాడే మనకన్నా అదృష్టంచేసుకున్నాడు. చెమట వాసన వేసినా, అమ్మ వొళ్ళో పడుకుంటాడు వాడు"

"వాళ్లమ్మ.. అగ్గిపెట్టెల కంపెనీకి పనికిపోతుంది,డబ్బులు సంపాయిస్తుంది"

"కుట్టిగాడిని స్కూల్లోకూడా చేర్చిందిగా"

"కానీ.. ఆమె నవ్వదు"

"మన అమ్మ వూరికే నవ్వుతుంది"

"ఇప్పుడెందుకేడుస్తావు? రోజూ ఏడుస్తూనే వున్నాం కదా"

"వర్షం ఇంకా ఎక్కువైంది. పరిగెత్తు"

"నువ్వు కూడా అమ్మ మాదిరిగా పౌడరు వేసుకుంటావా పెద్దయితే? "

"ఛీ.. ఛీ.. పోరా. నువ్వు మీసాలు పెట్టుకుంటావా? "

"ఊహు.."

"నేను అగ్గిపెట్టెలకంపెనీ పనికిపోతాను. అగ్గిపుల్లలు సర్ది పెట్టెల్లో నింపుతా"

"అబ్బ.. చలి చంపుతోంది"

"పాపం.. చొక్కా కూడా లేదు నీకు. ఇంటికి తిరిగి వెళ్ళిపోదామా? కుట్టి యిల్లు చాలా దూరం కదా"

"మనింటికా? ఛీ.."

"ఇంకెప్పుడూ వద్దా? "

"వద్దే వద్దు"

"మరి..? "

"ఇంకెక్కడికైనా వెళ్ళిపోదాం. అగ్గిపెట్టెల ఫ్యాక్టరీ.. టీ గ్లాసులు కడగడానికి.. వాల్ పోస్టర్లు అతికించడానికి..! ఎక్కడికైనా"

"చీకటిగా వుంది. నాకు భయమేస్తోందిరా"

"వెలుతురొస్తుందిలే" V

మయన్మార్ కథ

-కోఖే

# స్వర్ణమచ్చ

**అనువాదం : రోహిత్**

ఆ ఎద్దుకి 'స్వర్ణమచ్చ' అనే పేరు ఎందుకు వచ్చిందో నాకే తెలీదు. నాన్న దాన్ని తన పెద్దకొడుకుగా భావిస్తాడు, బంగారు రంగు శరీరం అని కాదు! దాని తోటి ఎద్దుని 'పాగల్' అని పిలుస్తారంతా, దేహం కాస్త బంగారురంగులోనే ఉంటుంది. అయినా నాన్న తప్పుల తడక పేర్లు తగిలించాడెందుకో!

పట్టణం నుంచి అలసిసొలసి వచ్చి దుమ్ముకొట్టుకుపోయిన వాటి ఒళ్లంతా దులుపుతూ అన్నాడు నాన్న "ఏడుమైళ్ళ దూరం.. మట్టికి, దుమ్ముకి ఇవెంత మురికిగా అయ్యాయో!.."

నీళ్లు తాగిన తర్వాత ..పాగల్ తోక ఎత్తి పేరుకి తగ్గట్లే వేగంగా పరుగు తీయసాగింది.

'స్వర్ణమచ్చ'ది గంభీర స్వభావం. నెమ్మదిగా, నిండుకుండలా అది ఉంటుంది. పాగల్ పరుగులు పెడితే, దానితో కలవటం కోసం త్వరగా అడుగులేస్తుంది. ఇవి రెండూ పరస్పర విరుద్ధ స్వభావాలున్నవి. పచ్చగడ్డి కన్పిస్తే పాగల్ బండిని అటువైపు లాగాలని ప్రయత్నిస్తుంది. దానికన్నా బలమైన స్వర్ణమచ్చ.. ఆ ఆటలు కొనసాగనివ్వదు.

నాన్నకి స్వర్ణమచ్చ అంటేనే ఇష్టం. 'పాగల్ బేటా' అని ప్రేమగా పిలిచి, ఆ వీపుపైనే మరిన్ని సామాన్లు వేసేవాడు. పాగల్ అందరి పొలాల్లోకీ దూరేది. ఎద్దుల మందలోకి చొరబడి నానా అల్లరీ చేసేది. ఆవుల వెంటపడే దీన్ని చూస్తే నాన్నకి కోపం ముంచుకొచ్చేది. మంచి, చెడ్డలున్న కొడుకుల్ని ప్రేమించే తండ్రిలా నాన్న వాటిని లాలించేవాడు. బాల్యంలో సెలవుల్లో ఆ రెంటినీ మేతకు తోలుకెళ్లేవాడిని. స్వర్ణమచ్చకి.. ఎంచక్కా కొమ్ముల మధ్య, గిట్టల మధ్య బాగా చేత్తో తోమి స్నానం చేయించేవాడ్ని. పాగల్ అస్సలు చెయ్యి వెయ్యనిచ్చేది కాదు. భిన్న స్వభావాలున్నా, అవి ఒకే చోట పెరగటంతో ప్రేమగానే కలిసి మెలిసి ఉండేవి. ఒకటి కన్పడకపోతే ఇంకోటి అల్లాడిపోయేది. వేరే ఎద్దులు పోట్లాడుకుంటుంటే, స్వర్ణమచ్చ మధ్యలో శాంతిదూతగా నిలబడి పోరాటం ఆపేది. వేరే ఎద్దులు కొమ్ముల్తో పోట్లాటకొస్తే, కాసేపే పోరాడేది పాగల్. అలసి భయంతో పరుగెత్తుకొచ్చి స్వర్ణమచ్చ దగ్గర నిలబడేది.

నేను టెన్త్ పరీక్షలు రాసేప్పటికి, ఆ ఎద్దుల్లో బలం కాస్తా తగ్గి ఎముకలు బైటికి వెళ్లుకొచ్చాయి. ఎక్కువ పనిచేయలేకపోతున్నాయి. నాన్న కూడా బలహీనుడై ఈ మధ్య తెగ దగ్గుతున్నాడు. ఊరి దగ్గరున్న ఆడవిలోనే కట్టెలు కొట్టుకు రాసాగాడు. ఈసారి నేను కనిపెట్టిన కొత్త విషయం ఏమంటే, పశువుల మందలో కాక దూరంగా ఈ రెండు ఎద్దులూ ఒంటరిగా మేస్తున్నాయి. పాగల్ కూడా దౌడు



తీయటం, ఆవుల వెంటపడటం, దూకుడు.. తగ్గించింది. ఇదంతా వృద్ధాప్య ప్రభావమే మరి!

"ఒరే బాబూ! సెలవులే గదా? నా శ్రమ కష్టాన్ని చూద్దువుగాని! కొత్త వెదురు తడికెలు పెట్టించాలి ఇంటికి. తోటకి కంచె వేయాలి. ఇప్పుడిప్పుడే అరటి మొక్కలొస్తున్నాయి. కాస్త నాకు సాయం చేయాలిరా. నిన్ను చదివించాలంటే నాకెంత కష్టంగా ఉందో తెల్సా? " అన్నాడు నాన్న.

యోమా కొండని ఇప్పటికీ ఈ రెండు ఎద్దులూ బానే ఎక్కగలవు. పాగల్ సన్నగా చలాకీగా ఉంటే, స్వర్ణమచ్చ కాస్త భారీ కాయంతో శ్రమపడేది. గడ్డి కోసే టైంలో, నాన్న వాటిని బాగా మేపుతాడు. వాటికి మేత, కడుపునిండా నీళ్లు పట్టించిన తర్వాత.. గడ్డి కోయటంలో నాన్నకి తోడ్పడ్డాను. అంతా బండిలో వేశాక, దాన్ని అతుకుల గతుకుల మార్గంలో ఈడ్చుకెళ్లడం ఎద్దులకి మహా కష్టంగా ఉంది. నాన్న దయాదాక్షిణ్యం లేకుండా వాటిని చావబాదుతుంటే, వాటి పృష్ఠభాగాలు గజగజా వణుకుతున్నాయి. అలా నాన్న వాటిని చావగొట్టడం.. అదీ నేను చూస్తుండగా.. అదే ప్రథమం!

"చూడ్రా బాబూ! వీటికి రోషం, కసి తెప్పించి మెరక మీదికి పోయేలా చూడాలి. లేకుంటే వీటి కాళ్లు సర్రున జారి ఎముకలు విరిగిపోతాయి పాపం. ఎద్దుల్ని సమయం, సందర్భాన్నిబట్టి బుజ్జగించాలి, చావగొడ్తుండాలి.."అన్నాడు నాన్న.

అంతేకాదు- "ఒరేయ్! ఇవి పరాయివి కాదు. మన గోశాలలోనే పుట్టాయి. వీటిని అమ్మను. కానీ కొత్తవి కొనే శక్తి నాకు లేదు. నువ్వు టెన్త్ పాసవగానే కొత్తవి కొంటా..." అంటూ నాన్న చెప్తుంటే నా గొంతు పూడుకుపోయింది.

ఆ ఏడాది వర్షాలకి ముందే రెండుసార్లు కొండప్రాంతాలకి గడ్డి కోయడానికి వెళ్లాం. ఆ రెండు ఎద్దులూ శారీరకంగా అలసి చివరికి ఎముకల పోగులయ్యాయి. నేలను దున్నేప్పుడు కూడా త్వరగా అలసి.. మధ్యమధ్య ఆగిపోతున్నాయి. బాగా చావగొడ్తే పది అడుగులేస్తాయి. వాటిని కొడుతుంటే, నిస్సహాయంగా ఉన్నాయి. కళ్లల్లో నీళ్లు నింపుకొని చూస్తున్నాయి.

పాగల్ కూడా తన జోరు తగ్గించింది. సానుభూతి అన్నట్లుగా.. చిన్నగా, స్వర్ణమచ్చకి అనుగుణంగా, అడుగులేస్తోంది.

ఓ ఎద్దుని అద్దెకి తేవాలనే నిర్ణయానికొచ్చాం. స్వర్ణమచ్చకి ఇప్పుడు పనేంలేదు. హాయిగా తింటూ ఫ్రీగా తిరగటమే. నేను టెన్త్ పాసయ్యాను. నాన్న ఖుషీగా ఉన్నాడు. కన్పించిన వారందరికీ "మావాడు పాసయ్యాడు" అని చెప్పసాగాడు. కానీ ఇంట్లో ఆర్థిక పరిస్థితి చూశాక, 'పట్నంలోని కాలేజీలో చేర్పించమ'ని అడిగే ధైర్యం రావటం లేదు నాకు.

"ఒరే! నిన్ను కాలేజీలో చేర్పిస్తారా! మన చుట్టుపక్కల ఉన్న ఏ పల్లెలోంచీ ఏ ఒక్కరూ ఇంతవరకూ కాలేజీలో చేరలేదు. నువ్వు కష్టపడి మనస్సుపెట్టి మరీ చదువు. డిగ్రీ చేద్దువు".. నాన్న మాటల్తో నాలో ఉత్సాహం పొర్లింది. కానీ కాలేజీ ఖర్చు ఎలా? అసలు అక్కడికి వెళ్లటం ఎలా? అవును మరి. వర్షాకాలంలో రైతులకి సంపాదన కష్టమే.

కొత్తగా అద్దెకు తీసుకున్న ఎద్దుతో పాగల్ బానే ఉంటోంది. నాన్నకది చాలా సంతోషంగా ఉంది. స్వర్ణమచ్చ మాత్రం.. నాన్న పొలంలో పనిచేస్తుంటే.. చూస్తూ కూచుంటోంది. తాడు కట్టకపోయినా అలాగే ఉంటుంది కానీ, పొలంలోకి చొరబడి గడ్డితినదు.

ఎప్పుడూ ఆ రెండు ఎద్దుల గురించే ఆలోచించేవాడిని. మా ఇంట్లో పుట్టిపెరిగిన అవి ఇక్కడే చనిపోవాలని కోరుకున్నాయి కాబోలు!

"ఎంత వీలైతే అంత తక్కువ ఖర్చుతో గడుపుకోరా! నీకు కావాల్సిన వస్తువులన్నీ మేమే కొనిస్తాం. మీ అక్క కూడా కొంత ఇస్తానంది. నువ్వు ఐదొందల రూపాయల్తో జాగ్రత్తగా సర్దుకుపోవాలి, కొత్త ధాన్యం మన చేతికందేదాకా. సరే. బామ్మ, తాత, బాబాయి, పిన్ని దగ్గర, బౌద్ధ భిక్షువుల దగ్గరా ఆశీర్వాదాలు తీసుకో" అని నాన్న అనగానే.. ఆ మాటలు నాకెంతో ఆనందం కలిగించాయి.

అసలు నాన్న ఐదువందలు ఎలా కూడబెట్టాడో అంతుపట్టలేదు. అప్పు తీసుకున్నాడా?

అందర్నీ కలిసి వాళ్ల ఆశీస్సులు పొందాను. తర్వాత పశువుల కొట్టంలోకెళ్లా.. మా ఎద్దుల ఆశీస్సులు తీసుకోవాలని! పాగల్ తన తలతో నా ఒళ్లంతా నిమిరింది.

స్వర్ణమచ్చ ఉన్న చోటికెళ్లాను. అది తన నాలుకతో నన్ను తాకింది. ఇంటికెళ్లేప్పటికి, అందరూ ఇచ్చిన డబ్బుతో నా జేబు నిండుగా ఉంది. "బాగా చదువుకుని పల్లెకు తిరిగి రా బాబూ!" అని అంతా ఆశీర్వదించారు.

నేను ఇల్లు చేరేప్పటికి, ఇంటి ముందంతా కోలాహలంగా ఉంది. ఎవరో వ్యక్తి స్వర్ణమచ్చని లాక్కుపోటానికి యత్నిస్తుంటే, ఇంకోడు కర్రతో చావబాదుతున్నాడు. దెబ్బలుతింటూనే.. అది మొండికేసి.. నేలపై కుప్పకూలింది.

నా ఫీజు, ఇతర ఖర్చులకోసం నాన్న దాన్ని అమ్మేశాడని అప్పుడు అర్థమైంది నాకు.

"ప్లీజ్! దాన్ని కొట్టకండి, చంపకండి. మా నాన్నతో నేను మాట్లాడ్తా" అన్నాను. ఆ దెబ్బల బాధ చూడలేక పెద్దగా అరిచాను. దాని కళ్లలోంచి నీళ్లు కారుతూనే ఉన్నాయి. బలవంతంగా శరీరాన్ని పైకి లేపి నిల్చొంది. ఇంటివైపు తిరిగి శోకంగా 'అంబా' అని అరిచింది.

ఇంటి వైపునించి కూడా అంబారావం విన్పడింది. పశుల కొట్టంలోంచి పాగల్ కూడా తెంచుకునే ప్రయత్నం చేస్తోంది. "మేం స్వర్ణమచ్చని అమ్మం... నాన్నా! డబ్బులు వాళ్లకి వాపసు ఇచ్చేయ్. నేను కాలేజీలో చేరను" ఏడుస్తూనే అరవసాగాను. నాన్న దుఃఖం, కోపం కలగలిసిన స్థితిలో నాకు ఒక్కటి వడ్డించాడు!

"ఒరేయ్! నువ్వు ఎద్దుగా మారకూడదనే దీన్ని అమ్మేశానురా! కాలేజీలో అందుకే చేర్పిస్తున్నారా.." అన్నాడు.

నేను నేలపైన కూలబడ్డాను. స్వర్ణమచ్చ ఏడుస్తూనే నాన్నవంక చూస్తోంది. "తీసుకెళ్ళండి బాబూ! దీన్ని లాక్కువెళ్లండి, త్వరగా కదలండి.. ఊ.. నడు.." అంటూ నాన్న కరుణ, క్రోధం కలిసిన గొంతుతో అరిచాడు.

స్వర్ణమచ్చ నాన్నవైపునించి తల తిప్పేసుకుంది. మొండికెయ్యకుండా ఉంది. ఆ కొత్తవ్యక్తులతో దెబ్బలు తినకుండా ముందుకు అడుగేయసాగింది. పాగల్ పిచ్చిదానిలా అరుస్తోంది. కానీ స్వర్ణమచ్చ అసలు వెనుతిరిగి చూడనేలేదు! V

ఐర్లండ్ జానపద కథ

-ఆస్కార్ వైల్డ్

# రాక్షసుడి తోట

అనువాదం : ఎం.ఎ.గఫూర్

రెండు ఎత్తయిన కొండల మధ్య ఒక పల్లెటూరు. ఆ ఊరిబయట ఒక అందమైన తోట. అందులో రంగురంగుల పూలమొక్కలు, రకరకాల పండ్లచెట్లు. పచ్చని గడ్డితో కళకళలాడుతోంది. చెట్లల్లో రకరకాల పక్షులు చేసే కిలకిలారావాలు వినసొంపుగా ఉన్నాయి.

ప్రతిరోజు బడి విడిచిపెట్టింతర్వాత పిల్లలు ఆ తోటలో ఆడుకుంటూ ఆనందంతో కేరింతలు కొడుతుంటారు. కొద్దిసేపు తమ ఆటపాటలు ఆపి.. గుబురు చెట్లల్లో నుంచి వినిపించే కోకిల రాగాలు, మొక్కల్లో నుంచి వచ్చే ఝుంకార నాదాలు వింటూ పరవశించేవారు.

★ ★ ★

ఆ తోట యజమాని ఒక రాక్షసుడు. స్వార్థపరుడు, కఠినాత్ముడు, దయాదాక్షిణ్యాలు లేనివాడు. తోటలోని విశాల భవనం అతని నివాసం. తన మిత్రుణ్ణి కలవడానికి వెళ్ళిన రాక్షసుడు ఏడేళ్ళ తర్వాత తిరిగి ఇంటికొచ్చాడు.

రావడంతోనే తోటలో ఆడుకుంటున్న బడిపిల్లలపై విరుచుకుపడ్డాడు.

"ఎవర్రా మీరు? ఏంటీ వెధవగోల? " అంటూ కర్ర తీసుకొని బెదిరించాడు. పిల్లలు భయంతో పారిపోయారు.

"ఇది నా తోట, వేరెవ్వరూ తోటలోకి రావడానికి ఒప్పుకోను" గొణుక్కుంటూ భవనం లోనికెళ్ళాడు.

వారం తిరక్కుండానే తోటచుట్టూ ఎత్తైన ప్రహరీ గోడ కట్టించుకొన్నాడు. ఆ గోడకు ఒక బోర్డు వేలాడదీశాడు. దానిపై ఇలా రాసి వుంది.

"తోటలోకి ప్రవేశించినవారు శిక్షార్హులు".

పాపం ఆ బడిపిల్లలు ఆడుకోడానికి అనువైన ప్రదేశం ఆ ఊళ్ళో ఎక్కడా లేదు. గోడచుట్టూ రోడ్డుమీద దుమ్మూ, ధూళీ, కంకర రాళ్ళున్నాయి.

పిల్లలు "తోటలో ఎంత చక్కగా ఉండేది" అనుకొంటూ, ఆ ప్రహరీ గోడ చుట్టూ తిరుగుతున్నారు.

ఇలా ఉండగా, వసంత ఋతువు వచ్చేసింది. కొండలమీదున్న మొక్కలు పుష్పించి అందాలు వెదజల్లుతున్నాయి. రకరకాల పక్షులు చెట్లల్లో తిరుగుతూ కమ్మని సంగీతాన్ని విన్పిస్తున్నాయి.

కానీ ఆ రాక్షసుడి తోటలో మాత్రం ఇంకా శీతాకాలమే. చలి, పొగమంచు అక్కడి వాతావరణాన్ని కప్పేశాయి. వసంత ఋతువు ముఖం చాటేసింది. తోటలో విని ఆనందించే పిల్లలు లేరుగా. అందుకే పక్షులు తమ సంగీతాన్ని వినిపించడం మానేశాయి. చిన్నారి మొక్కలు తమ తలలు పైకెత్తి గోడమీద కట్టిన బోర్డు చూసి ముఖాలు గడ్డిలో దాచుకున్నాయి. పొగమంచు తన మిత్రులైన చలిగాలిని, వడగండ్ల వానను ఆహ్వానించింది. వెంటనే అవి వచ్చేసి తోటను, ఆ భవ



నాన్ని చుట్టుముట్టాయి.

దేశంలో కాలానుగుణంగా రుతువులు మారుతున్నా.. రాక్షసుడి తోటలో మాత్రం శీతాకాలం, పొగమంచు, చలిగాలులు, వడ గండ్ల వానలు విలయతాండవం చేస్తూనే ఉన్నాయి.

★ ★ ★

ఓ ప్రాతఃకాలం. ఆ రాక్షసుడు తన మంచంలోనే మగత నిద్రలో ఉన్నాడు. ఒక వింత పిట్ట చెట్టుకొమ్మ మీద కూర్చొని మధురంగా కూస్తోంది. ఆ మధురమైన సంగీతానికి అతడు మేల్కొన్నాడు. మంచంపై కూర్చోని, 'ఆహా ఇంత మధురమైన సంగీతం మున్నెన్నడూ వినలేదు' అనుకొంటూ కిటికీలోంచి తోటలోకి చూశాడు.

చలిగాలి, వడగండ్ల వాన, పొగమంచు కనిపించడంలేదు. వసంత రుతువు రానే వచ్చిందనిపించింది. అత్తరు సువాసనలు తోటలో, భవనం నిండా వ్యాపించాయి. అతడు కిటికీ దగ్గరగా వచ్చి తోటలోకి చూశాడు. ఒక సుందర దృశ్యం కనిపించింది. ఇప్పుడది తోటగాదు. అందమైన బృందావనం అనిపించిందతనికి.

గోడకున్న చిన్న రంధ్రం ద్వారా పిల్లలు బిలబిలా ప్రవేశించి చెట్లకొమ్మల్లో ఆడుకొంటున్నారు. రకరకాల పక్షులు, రంగురంగుల పిట్టలు చెట్లపై ఎగురుతూ ఆసాధారణ రీతిలో కూస్తున్నాయి. పచ్చని గడ్డిలో నుంచి అందమైన పువ్వులు తలలు పైకెత్తి పిల్లల్ని చూసి ఆనందంగా నాట్యం చేస్తున్నాయి. చెట్ల కొమ్మలు నడుములు వంచి, తమ బాహువులు చాచి, పిల్లల్ని ఆహ్వానించి కౌగిలించుకొంటున్నాయి.

★ ★ ★

ఆ తోటలో దూరాన ఒక మూలలో మరొక వింత దృశ్యం కనిపించిందతనికి. మరీ పసివాడొకడు ఒక చెట్టుకింద నిలబడి ఏడుస్తున్నాడు. ఆ చెట్టునిండా పొగ మంచు, వాన కురుస్తూనే ఉన్నాయి. దాని చుట్టూ విపరీతమైన చలిగాలులు వీస్తూనే ఉన్నాయి. ఆ చెట్టు తన కొమ్మల్ని కిందకు వంచి ఎక్కమని ఆ పసివాడ్ని ఆహ్వానిస్తోంది. వాడు చెట్టెక్కలేక బాధపడుతున్నాడు.

భవనం పైఅంతస్తు నుంచి ఆ దృశ్యాన్ని తిలకించిన రాక్షసుడి గుండె కరిగిపోయింది. ఆ పసివాడి మీద జాలికలిగి కళ్ళు చెమ్మగిల్లాయి. వాడ్ని చెట్టు కొమ్మల్లో కూర్చోబెట్టడానికి కిందకు దిగాడు. మెల్లగా తలుపుతీసి తోటలోకొచ్చాడు. పిల్లలంతా భయంతో పారిపోయారు.

తోటలో చలిగాలులు మొదలైనాయి. పొగ మంచు, వడగండ్ల వాన కురవసాగింది. ఆ పసివాడి కళ్లలో నీళ్ళుండటంతో, ఆ రాక్షసుని రాకను గమనించలేకపోయాడు.

రాక్షసుడు మెల్లగా దగ్గరికి వచ్చి పసివాడ్ని సుతారంగా ఎత్తుకొని చెట్టుకొమ్మ మీద కూర్చోబెట్టాడు. ఆ పసివాడు తన చేతులతో రాక్షసుడ్ని వాటేసుకొని ఎంతో ముద్దాడాడు.

వెంటనే అక్కడ ఒక వింత జరిగింది. ఆ చెట్టుకు పూలు పూశాయి.. పక్షులు, పిట్టలు సంతోషంగా గానాలు చేస్తూ ఆ చెట్టుమీద ఎగురుతున్నాయి.

గోడచాటు నుండి ఆ దృశ్యాన్ని చూస్తున్న బడి పిల్లలకు రాక్షసుని మీద నమ్మకం కుదిరింది. వాడు చెడ్డవాడేమీ కాదనుకొని తోటలోనికి ప్రవేశించారు. వారితోపాటు వసంత రుతువు కూడా ప్రవేశించింది.

రాక్షసుడు.. పిల్లల్ని ఉద్దేశించి ఒక ప్రకటన చేశాడు.

"పిల్లలూ! చూడండ్రా! ఈ తోట ఇక నుంచి నాది కాదు, మీది. ఇది మీ ఆటస్థలం. రోజూ మీరిక్కడే ఆడుకోవచ్చు" అంటూ ఆహ్వానించాడు.



మరుసటి సాయంత్రానికల్లా ప్రహరీగోడ కూల్చివేత జరిగిపోయింది.

ఆ రోజునుంచి, పిల్లలతో కలిసి ఆటలాడుకొంటున్న రాక్షసుణ్ని చూసిన ఆ పల్లె జనం.. ఆశ్చర్యపోయారు.

ఒక ఆదివారం పిల్లలు పగలంతా ఆటలాడి, సాయంత్రం వీడ్కోలు తీసుకోడానికి రాక్షసుని వద్దకు వచ్చారు.

అతడు పిల్లలతో ఇలా అన్నాడు.

" పిల్లలూ! నేను మొన్న చెట్టుకొమ్మ మీద కూర్చోబెట్టిన ఆ చిన్నవాడేడీ! కనబడడేం? "

"మాకు తెలీదు. వెళ్ళిపోయివుంటాడు" అన్నారు.

"రేపు మీరొచ్చేటప్పుడు ఆ బాబును కూడా తీసుకురండి", అన్నాడు.

"ఆ అబ్బాయిది మనూరుగాదు. ఇదివరకెప్పుడూ మేం చూడలేదు, ఎక్కడుంటాడో తెలీదు" అన్నారు.

ప్రతిరోజూ రాక్షసుడు బడిపిల్లల్తో ఆడుకొనేవాడు. అందరితో ఆప్యాయంగా ఉండేవాడు. అప్పుడప్పుడు ఆ పసివాడ్ని గురించి మాట్లాడేవాడు. "వాడు నన్నెంతో ప్రేమతో ముద్దుపెట్టుకొన్నాడు. వాడ్ని చూడాలి" అంటుండేవాడు.

★ ★ ★

కొంతకాలానికి రాక్షసుడు ముసలివాడైపోయాడు. ఆటలాడే ఓపికలేక, కుర్చీలో కూర్చొని పిల్లల ఆటపాటల్ని చూస్తూ మురిసిపోతూ ఇలా అనుకొనేవాడు. 'నా తోట ఎంత అదృష్టం చేసుకుంది. అందమైన పూలు, పక్షుల కిలకిలారావాలతో కళకళ్లాడుతోంది. ఈ ప్రపంచంలో ఈ చిన్నారులే అసలు పువ్వులు'

ఒకరోజు తెలతెలవారే సమయాన రాక్షసుడు కిటికీలోంచి బయటకు చూశాడు. ఒక విచిత్రమైన దృశ్యం కంటబడింది. తన కళ్లను తానే నమ్మలేకపోయాడు. రెండు కళ్లూ తుడుచుకొని మరీ జాగ్రత్తగా గమనించాడు.

తోటలో మూలనున్న ఆ చెట్టు..నిండా పూలతో అందంగా కనబడింది. బంగారు కొమ్మలు, వెండి పండ్లతో నిండి ఉంది. చూడటానికి రెండు కళ్లూ చాలటం లేదు. తానిన్నాళ్లూ కళ్లు కాయలు కాచేలా ఎదురు చూసిన ఆ పసివాడు.. ఆ చెట్టుకింద నిలబడి ఉన్నాడు.

రాక్షసుని ప్రాణం లేచొచ్చింది. గబగబా కిందికి దిగి వచ్చాడు. పరుగెత్తుకుంటూ వెళ్ళి వాడ్ని దగ్గరికి తీసుకోబోయి ఆగిపోయాడు. ముఖం కోపంతో ఎర్రబడింది.

ఆ చిన్నారి శరీరాకృతిని ఒక్కసారి తేరిపార చూశాడు. ముద్దులొలికించే ఆ ముఖంపై, పాదాలపై గోళ్ళతో రక్కినట్లున్న గాయాల్ని చూసి మండిపడుతూ అన్నాడు "నిన్ను గాయపర్చినవాడెవడో చెప్పు. వాడ్ని నా ఖడ్గంతో నరికి పోగులు పెడ్తాను"

కోపంతో ఊగిపోతున్నాడు.

"ఇవి గాయాలు కాదు. నామీద నువ్వు కుమ్మరించిన ప్రేమ చిహ్నాలు" అన్నాడు ఆ చిన్నారి.

రాక్షసుడు.. భయం, భక్తి భావాలతో "ఎవరు నువ్వు" అంటూ పసివాడి కాళ్ళ మీద పడిపోయాడు.

ఆ పసివాడు ప్రశాంతంగా చిరునవ్వు నవ్వుతూ రాక్షసుణ్ణి లేపి, "ఈరోజు నన్ను నీ తోటలో ఆడుకోనివ్వు. నా ఆటలైన తర్వాత మనిద్దరం కలిసి నా తోటకు వెళ్దాం. దాన్నే స్వర్గలోకం అని కూడా అంటారు" అన్నాడు.

ఆ రోజు సాయంత్రమూ బడిపిల్లలు తోటలో ప్రవేశించారు. పూలతో కళకళలాడుతున్న చెట్టుకింద పడివున్న రాక్షసుడి శవాన్ని చూసి నిర్ఘాంతపోయారు.

ఇప్పుడా భవనం.. పిల్లల ప్రాథమిక పాఠశాల, ఆ తోట.. వారి ఆటస్థలం అయ్యాయి. Ⓥ

తెలుగు కథ

-కె.కె.భాగ్యశ్రీ



# క్షమించి చూడు

కంప్యూటర్ ముందు కూర్చుని, ఆ రోజు వచ్చిన మెయిల్స్ చెక్ చేసుకుంటూ ..స్వరూప పంపిన మెయిల్ చూశాను.

ఆశ్చర్యం కలిగింది. ఎప్పుడైనా తనకు ఫోన్ చేసినప్పుడు పొడిపొడిగా, ముక్తసరిగా మాట్లాడి, సంభాషణను త్వరగా ముగించేది స్వరూప. ఇప్పుడిలా మెయిల్ చెయ్యడం వింత కలిగించింది.

బహుశా, ముఖతః చెప్పలేని విషయాలేమైనా ఉన్నాయా ఇందులో! దాన్ని ఆసాంతం చదివిన నేను నివ్వెరపోయాను. మనసంతా మబ్బుపట్టిన ఆకాశంలా గుబులుగా తయారైంది.

తన బిడ్డను తన దగ్గరకు చేర్చమని అడగడంలో ఆమె తన మాతృత్వాన్ని సార్థకం చేసుకోవాలనుకుంటోందని నాకు అర్థమైంది.

ఆ మాటకొస్తే.. ఏ కన్నతల్లి కూడా తన బిడ్డ తనకు దూరం కావాలని కోరుకోదు. అది ఆడజాతి ఔన్నత్యాన్ని పెంచే అంశం.

కానీ.. స్వరూప! అందుకు పూర్తిగా వ్యతిరేకం.

ముక్కుపచ్చలారని విశాల్‌ని నిర్దాక్షిణ్యంగా వదిలేసి, స్వార్థంతో తన సుఖం తాను చూసుకుంది.

కడుపుతీపిని సమాధి చేసేసి, పేగుబంధాన్ని తెంచుకుని తానాశించిన స్వర్గాన్ని వెతుక్కుంటూ తరలిపోయింది.

అలాంటి స్వరూప.. ఇన్నేళ్ల తరువాత ..తన బిడ్డను కావాలనుకుంటోందంటే ..విచిత్రమే మరి!

లక్కవంటి తల్లి- రాయివంటి బిడ్డ అంటారు.

కానీ.. స్వరూప హృదయం కఠిన పాషాణం. ఇన్నిరోజుల తరువాత ఆ బండ రాయి కరిగిందంటే ఆశ్చర్యం కలగదూ...

మనసు కలతచెందడంతో, కంప్యూటర్ షట్‌డౌన్ చేసి మౌనంగా బెడ్‌పై వాలాను.

విశాల్.. నా ఆశల దీపం. పడమటికి వాలిపోతున్న నా జీవనసంధ్యకు ఆలంబన. రేపటి ఉషోదయం కోసం ఆశగా నిరీక్షింపజేసే వెలుతురు కిరణం.

నేను కాస్త తుమ్మినా, కంగారుపడిపోయి "ఏమైంది తాతయ్యా" అని ఎంతో ఆదుర్దాగా నన్ను పరామర్శించే.. నా ముద్దుల మనవడు.

అవును.. స్వరూప నా కన్నకూతురు.

ఏడాదిన్నర పసివాడిని వదిలి, మోడువారిన తన జీవితంలో నవ వసంతం నింపుకొనేందుకు వెళ్లిపోయింది.

పెళ్లయిన ఆరునెలలకే, మూడునెలల గర్భవతయిన నా తనయ.. సౌభాగ్యాన్ని కోల్పోయి దీనంగా పుట్టింట చేరింది. 'గారాలపట్టి బతుకు మొగ్గగానే వసివాడిపోయిందేమిటా!' అని తల్లడిల్లాం నేను, నా భార్య.

నెలలు నిండిన తరువాత పండంటి మగబిడ్డను ప్రసవించింది స్వరూప. ముద్దులు మూటగట్టే మురిపాల మొలకను చూసి ఎంతగానో మురిసిపోయాం. కానీ.. స్వరూప! వాడి ముఖం చూడడానికి కూడా ఇష్టపడేది కాదు. వాడు కడుపులో పడి, తన మాంగల్యాన్ని తెంపేశాడంటూ బాధపడుతూ, ఆ పసికందుని గుండెలకు హత్తుకునేందుకు సైతం నిరాకరించింది. వాడిని మమకారంతో చేరదీయలేదు. మాతృధర్మాన్ని పాటించలేదు.

కనీసం.. పసిపాపల ఆకలి తీర్చే అమృతతుల్యమైన స్తన్యాన్ని కూడా అందించేందుకు అంగీకరించలేదు.

'భర్తపోయిన షాక్‌లో ఉంది... ఆ ఒత్తిడి తగ్గాక తనే చేరదీస్తుంది' అని సర్దిపెట్టుకుని, విశాల్ పోషణ భారాన్ని మేమే స్వీకరించాం.

తల్లిపాలు తాగకుండానే, అమ్మ పొత్తిళ్లలోని వెచ్చదనం చవి చూడకుండానే, ఏడాదిన్నర వాడయ్యాడు విశాల్.

అప్పుడు పేల్చింది స్వరూప అణుబాంబులాంటి ఓ వార్తను. తన స్నేహితురాలి అన్నయ్యను తాను పునర్వివాహం చేసుకోవాలనుకుంటున్నానని స్వరూప చెప్పగానే ..మొదట మేం దిగ్భ్రాంతి చెందాం.

ఆ తరువాత సర్దుకొని ఆలోచిస్తే, ఆనందం కలిగింది మాకు.

మోడువారిన ఆమె జీవితం తిరిగి చిగురిస్తూంటే, ఏ కన్నవారికి మాత్రం సంతోషం కాదు!?

కానీ.. కొత్తగా ఏర్పడబోయే ఆ బంధం కోసం, తన కన్నబిడ్డను త్యజించాలన్న స్వరూప నిర్ణయాన్ని మాత్రం మేం హర్షించలేకపోయాం.

తండ్రి ఎలాగూ లేడు.. తల్లి ప్రేమను కూడా వాడికి లేకుండా చేయవద్దని ఎంతగానో మొత్తుకున్నాం.

మా ఆక్రోశం ఆమెని ఏమాత్రం కదిలించలేకపోయింది.

'పుడుతూనే తండ్రిని మింగినవాడిని నా గుండెలకు హత్తుకోలేను. శుభమా అంటూ కొత్త జీవితంలోకి అడుగుపెడుతూ ఈ తద్దినాన్ని తలకెత్తుకుపోలేను..ఈ నష్టజాతకుడిని మీ దగ్గరే ఉంచుకోండి. మీకు పెంచడం కష్టం అయితే ఏ అనాథ శరణాలయంలోనో పారేయండి.." కర్కశంగా తన నిర్ణయాన్ని వినిపించింది స్వరూప.

ఈ మాటలు ఆమెను కట్టుకోబోయేవాడు అనుంటే మాకంత బాధ కలిగి ఉండేది కాదు.

కానీ.. మాతృత్వపు మధురిమల్ని కురిపించవలసిన తల్లే అలా అందంటే.. ఇక

అమ్మతనానికి అర్థం ఏముంది?

ఆమె నిర్ణయానికి తలొగ్గడం తప్ప మరేమీ చేయలేకపోయాం. పెళ్లి చేసుకుని అమెరికా వెళ్లిపోయిన స్వరూప.. మరి మావైపు తొంగిచూడలేదు. ఎప్పుడన్నా ఫోన్‌లో పలకరించేది. అప్పుడు కూడా విశాల్ ప్రస్తావన ఉండేదికాదు. ఎంత సేపూ తను, తన భర్త, వారి సంతానమైన కౌశిక్.. ఇవే కబుర్లు దొర్లేవి ఆ మాటల మధ్య.

కౌశిక్ కూడా మా మనవడే.. అయినా ఎందుకో వాడిమీద అంత అపేక్షకానీ పిచ్చి ప్రేమకానీ ఉండేవి కాదు.. వాడు వాళ్లమ్మ-నాన్నల ప్రేమను సంపూర్తిగా అనుభవిస్తూ ఎదుగుతున్నందుకు కాబోలు.

స్వరూప.. విశాల్ గురించి తలపోయక పోవడం మాకెంతో బాధాకరంగా పరిణమించేది. అన్నిటికీ మించి 'అమ్మా' అంటూ తపించిపోయే విశాల్‌ని సముదాయించటం మాకెంతో యాతనైపోయేది.

తన రక్తమాంసాలు పంచుకు పుట్టిన బిడ్డను విస్మరించి, ఆమె తన మనసుని ఎలా రాయిచేసుకుందో నాకిప్పటికీ అంతు పట్టదు.

'స్వరూపను నేను పెంచిన విధానంలో ఏదన్నా లోపం ఉందా? '

ఎన్నిసార్లో ఈ ప్రశ్న నన్ను నేనే వేసుకున్నా, సమాధానం శూన్యం.

ఆమె మా కన్నబిడ్డే కావచ్చు.. కానీ తను.. కన్నబిడ్డను కాలదన్నుకోవడం మూలాన మాకు శత్రుసమానమైంది.

నా భార్య ఈ మధ్యనే చనిపోయింది. ఇప్పుడు నాకు విశాల్.. వాడికి నేను తప్ప ..ఆత్మీయులన్న వారెవరూ లేరు.

ఆనాడు కర్కశంగా పేగుబంధాన్ని తెంచుకొని పారిపోయిన నా కూతురు ఇవాళ.. విశాల్‌ని కావాలనుకోవడం వెనుక కారణం చెప్పింది. దానికి నేను కదిలిపోయాను.

'అసలు.. విశాల్ ఈ విషయంలో ఎలా స్పందిస్తాడు? అంతెందుకు! విశాల్ తన తల్లిని చేరాలని ఆరాటపడినా, వాడిని వదిలి నేనెలా ఉండగలను? ' ..జవాబు తోచని ప్రశ్నలు ఎన్నో..నా మదిని అల్లకల్లోలం చేసిపారేస్తుంటే.. అలా... వెనక్కి వాలాను.

★ ★ ★

"తాతయ్యా!. నీకో గుడ్ న్యూస్.." గాలి దుమారంలా వచ్చి నన్ను వాటేసుకున్నాడు విశాల్.

"ఏంటి నాన్నా!.." ఆప్యాయంగా అడిగాను.

"నాకు వీసా వచ్చిందోచ్.." అన్నాడు నా మెడచుట్టూ చేతులువేసి గుమ్మాడి ఊగుతూ.

గుండెకేదో అడ్డుపడిన భావన కలిగింది హఠాత్తుగా.

విశాల్ పైచదువుల కోసం అమెరికా వెళ్ల డానికి వీసా కోసం అప్లై చేశాడు. చిలుకూరు బాలాజీని దర్శించుకొచ్చాడు కూడా.

నాకైతే వాడిని అమెరికా పంపడం ఇష్టం లేదు. చాలామంది యువతలాగే వాడూ డాలర్ల ఉచ్చులో బిగుసుకుపోవడాన్ని నేను భరించలేను.

"ఎంత తాతయ్యా! రెండేళ్లు ఇట్టే గడిచిపోవూ.." అన్నాడు విశాల్, మొదట నేను అభ్యంతరపెట్టినప్పుడు.

"ఆ.. మొదట అందరూ ఇలానే అంటారు. కానీ అక్కడి లైఫ్‌కి అలవాటుపడిపోతే మరి ఇండియా ముఖం చూడరు. అయినా..ముసలి కంపు కొడుతున్న ఈ తాతయ్యంటే నీకు బోర్ కొట్టినట్లుంది. అందుకే వదిలించుకుపోదామని ప్లాన్ వేశావు" అలిగినట్లుగా బుంగమూతి పెట్టాను.

వాడు కలవరపడినట్లుగా చూశాడు. నొచ్చుకున్నట్లుగా గిలగిలలాడాడు. కళ్లల్లో పలుచని నీటితెరలు అలముకున్నాయి.



"హాస్యానికి కూడా అలా అనద్దు తాతయ్యా! నీకంత ఇష్టం లేకపోతే వెళ్లనులే." అన్నాడు విశాల్, చిన్నబోయిన వదనంతో.

కదిలిపోయాను. వాడి తడికళ్లను చూసి కలత చెందాను.

"ఏదో.. తమాషాకి అన్నాను. నిజంగా నన్ను మరచిపోవు కదూ.." దీనంగా అన్నాను వాడి తలనిమురుతూ.

మొక్క ఏపుగా ఎదిగి కొమ్మలు, రెమ్మలు తొడుగుతానంటే.. అభ్యంతరం చెప్పే తల్లి వేరెక్కడన్నా ఉంటుందా! నా వృద్ధాప్యంలో నాకు ఆసరాగా నిలిచే ఊత కర్రలాంటి విశాల్ నాకెక్కడ దూరమవుతాడోనన్న భయం మనసుని పట్టి పీడించినా, వాడి బంగారుభవితకు అవరోధంగా నిలిచే హక్కు నాకు లేదనిపించింది.

నా ఆమోదాన్ని తెలియజేయగానే "నిన్ను మరచిపోవడమా! నెవర్.. రోజూ ఫోన్ చేస్తానుగా.. థాంక్యూ తాతయ్యా... ఒప్పుకున్నందుకు.." ఆనందంగా నన్ను ముద్దాడాడు విశాల్.

వికసించిన వాడి కళ్లల్లో ఎన్నో సుందర స్వప్నాలు చూశానాక్షణం.

కానీ.. స్వరూప మనసులోని మాట వెల్లడించగానే నేను పునరాలోచనలో పడ్డాను.

నేటి యువతకు భూతలస్వర్గం లాంటి అమెరికా అంటే క్రేజ్. విశాల్ కూడా అందుకు అతీతుడు కాదని నా నమ్మకం. అందులో.. ఇన్నేళ్ల తరువాత తల్లి దగ్గర నుండి ప్రేమపూరిత ఆహ్వానం అందితే అతడు కాదంటాడనుకోను.

మొన్నమొన్నటివరకు తల్లికోసం అతడు పడిన ఆరాటం, తపన నాకు తెలియనివి కాదు. విశాల్ నాకు శాశ్వతంగా దూరం అవుతాడన్న దిగులుతో. నాకు రెండు రోజులుగా నిద్రాహారాలు లేవు.

ఇప్పుడు వీసా కూడా మంజూరైంది. 'ఇంకేముంది? విశాల్.. నా విశాల్.. నన్ను విడిచి..' మరి ఆలోచించలేకపోయాను.

"ఏంటి తాతయ్యా! ఇంతటి శుభవార్త చెప్తే అంత డల్‌గా ఉండిపోయావు... నేను వెళ్లడం నీకిష్టం లేనట్లుంది... పోనీ మానేయనా? " ముభావంగా ఉండిపోయిన నన్ను చూసి మృదువుగా అడిగాడు విశాల్.

నేను ఉలిక్కిపడి చూసి "నో.. నో.. అదేం కాదు.. నీతో కొంచెం మాట్లాడాలి" అన్నాను గంభీరంగా.

ఆ క్షణం వరకు.. స్వరూప ఈ-మెయిల్ చేసిన సంగతి వాడికి చెప్పలేదు. వాడి నిర్ణయం ఏదైనా సరే.. విని తట్టుకొనే శక్తి పొందడానికి, నన్ను నేను మానసికంగా సన్నద్ధం చేసుకోవడానికి గత రెండు రోజులుగా ప్రయత్నిస్తున్నాను.

కానీ.. ఏదైతే అవనీ.. తల్లి దగ్గరకు వెళ్లడానికి విశాల్ ఇష్టపడితే కాదనడానికి నాకేం హక్కుంది?

నాదేముంది? చివరి రోజులను ఏ వృద్ధాశ్రమంలోనన్నా గడిపేయగలను. ఈ స్థితప్రజ్ఞ కలిగిందనుకున్నాకే పెదవి విప్పడం మంచిదనిపించి నేను మౌనం వహించాను.

ఇప్పుడు వాడికి వీసా వచ్చింది. వాడి అభిమతం ఏంటో తెలుసుకోవడానికి తగిన సమయం వచ్చిందనిపించింది.

నేను చెప్పిన విషయాన్ని ఏ భావమూ వ్యక్తపరచకుండా విన్నాడు విశాల్. వాడిలో ఆనందమూ లేదు, ఉద్వేగమూ లేదు. కాస్సేపు మౌనం తరువాత అన్నాడు "నేను ఆమెతో మాట్లాడాలి"

వాడు 'అమ్మ' అనకపోవడం నేను గమనించాను.

వెంటనే స్వరూపకు ఫోన్ చేశాను.

"నాన్నా! ఎలా ఉన్నారు? విశాల్ ఏమంటున్నాడు? నా దగ్గరకు వచ్చేస్తానంటున్నాడా? అయినా వాడికి ఎప్పుడూ నాకు చేరువవ్వాలన్న తాపత్రయమే.. పిచ్చి ముఖందాన్ని..నేనే..! అయినా అమెరికా రానని ఎలా అనగలడు! వాడి రాక కోసం ఆయన ఎదురు చూస్తున్నారు".. గలగల చెప్పుకుపోతున్న స్వరూప స్వరంలో ఇంకా ఆనాటి అతిశయమే నిండి ఉంది.

"ఏమోనమ్మా! విశాల్ నాతో ఏమీ చెప్పలేదు. నువ్వే అడుగు.." ఫోన్ విశాల్ చేతికిచ్చి నేను బయటకొచ్చేశాను.

నేను పక్కనుంటే విశాల్ తల్లితో స్వేచ్ఛగా మాట్లాడలేడేమోననిపించింది.. ఎందుకో ఆ క్షణం.

నిమిషాలు యుగాల్లా గడుస్తున్నాయి అతి భారంగా.

'విశాల్ వెళ్లడానికే నిశ్చయించుకున్నాడా! మంచిదేగా.. తల్లీ బిడ్డలు చేరువవుతామంటే..' మనసు పరిపరివిధాల పోయింది. అయినా ఇది తల్లీకొడుకుల సమస్య.. వాళ్లే తేల్చుకోవాలి.

అరగంట తరువాత విశాల్ నన్ను పిలిచాడు.. స్వరూప రమ్మంటోందంటూ.

"ఏమ్మా!" ఫోన్ అందుకుంటూ అడిగాను నేను.

"విశాల్ చాలా నిర్లిప్తంగా మాట్లాడుతున్నాడు నాన్నా! వాడి మనసులో ఏముందో నాకు అంతుపట్టడం లేదు.. ఆలోచించి తరువాత చెప్తానంటున్నాడు. నువ్వయినా వాడికి నచ్చచెప్పు. నీ మాట వాడు కాదనడు".. స్వరూప గొంతులో ఇందాకటి స్వాతిశయం స్థానంలో బేలతనం చోటు చేసుకుంది.

"నా కూతురికే నచ్చచెప్పలేకపోయాను.. విశాల్ మాత్రం నా మాట వింటాడన్న నమ్మకం ఏముంది? అయినా ప్రయత్నిస్తాను" నిర్లిప్తంగా చెప్పి ఫోన్ పెట్టేశాను.

విశాల్ సోఫాలో కూలబడి శూన్యంలోకి చూస్తున్నాడు. వాడి మనసులో ఏ సంఘర్షణ జరుగుతోందో తెలియడంలేదు.

"మీ అమ్మ కోరిక విన్నావుగా.. ఏం నిర్ణయించుకున్నావు? " నెమ్మదిగా వాడి తల

నిమురుతూ అడిగాను.

"ఇన్నేళ్ల తరువాత...ఆవిడకు నేనంటూ ఒకడినున్నానన్న విషయం ఎందుకు గుర్తొచ్చిందా? అని ఆలోచిస్తున్నా తాతయ్యా!" అన్నాడు విశాల్.

గతుక్కుమన్నాను నేను. ఆ కారణం నాకు తెలుసు. కావాలనే వాడికి చెప్పలేదు.

"అదేం ప్రశ్న విశాల్? తల్లి.. పిల్లలను కావాలని కోరుకోవడం వెనుక కారణాలుండాలా!" తడబడ్డాను కాస్త.

"అదే తల్లి.. ఇరవై రెండేళ్ల క్రితం నన్ను వదిలిపోవడం వెనుక ఏ కారణముందో, ఇప్పుడూ అలాంటిదే ఉండచ్చుగా.." సూటిగా ప్రశ్నించాడు విశాల్.

వాడి కళ్లల్లోని పదును నా గాంభీర్యాన్ని సడలించింది. ఇక చెప్పక తప్పేట్లు లేదు.

"నీ తమ్ముడు.. అదే.. కౌశిక్.. ఈ మధ్యనే.. రోడ్ యాక్సిడెంట్లో.." ఇక చెప్పలేకపోయాను. ఎంతయినా కౌశిక్ నా మనవడే..

విశాల్ శరాఘాతం తగిలిన పక్షిలా చూశాడు. తలలోకి వేళ్లు పోనిచ్చి అసహనంగా జుట్టు పీక్కున్నాడు.

"సో.. పోయిన ఆవిడ కొడుకు స్థానాన్ని భర్తీచేయడానికి నేను కావాలన్న మాట.." కాస్సేపటి తరువాత అన్నాడు విశాల్.

ఆ మాటల్లో ఏదో వేదన తొంగి చూసింది.

నేనేం మాట్లాడలేదు.. విశాల్ స్పందన ఏమిటో తెలిశాక, నేను నా వాదన వినిపించదలుచుకున్నాను.

"ఒకవేళ కౌశిక్ బతికుంటే, ఆమెకు నా మీద ధ్యాసే కలగకపోనేమో!" తల ఊపుతూ అన్నాడు విశాల్.

"అలా ఎందుకనుకోవాలి విశాల్! ఇన్నాళ్లకు ఆమెకు తను చేసిన తప్పు తెలిసొచ్చి ఉంటుంది. పొరపాట్లు చేయడం మానవ సహజం.. దిద్దుకోవడం మంచి మనిషి లక్షణం.." అన్నాను అనునయంగా.

"నువ్వెన్ని చెప్పు తాతయ్యా! ఈ విషయంలో ఆమె వైఖరిని నేను సమర్థించలేకపోతున్నాను. ముద్దుల కొడుకు అనుకోకుండా.. పోయాడు కాబట్టి ..నేను గుర్తు వచ్చాను. నాకు చేసిన ద్రోహం గుర్తొచ్చింది. చేసిన తప్పుకు ప్రాయశ్చిత్తం చేసుకోవాలన్న తలపు కలిగింది.." విశాల్ మాటలు చురకత్తుల్లా దూసుకొచ్చి నా గుండెను నాటుకున్నాయి.

వాడన్నది నిజమే..'స్వార్థపరురాలైన స్వరూప ఇందులోనూ తన సుఖమే వెతుక్కుంటోందా'

"తల్లి ప్రేమ అవసరమైన వయసులో నన్ను మీ దగ్గర పారేసి.. తన దారి తను చూసుకున్న ఆవిడ అభ్యర్థన.. నా గుండెలని కదిలించడం లేదు తాతయ్యా! అమ్మ గుండెల్లో వెచ్చగా ముడుచుకు పడుకునే అదృష్టం కోసం ఎన్నిరాత్రులు ఎదురు చూశానో ఆవిడకేం తెలుసు.." విశాల్ గొంతు వణికింది బాధతో.

ఏం అనలేకపోయాను... ఇన్నాళ్ల వాడి ఆవేదన బయటకు పెల్లుబుకుతోంది.. దానికి అడ్డుకట్ట వేయడం నా వల్ల కాదు.

మళ్లీ మౌనం. కాలం మా మధ్య దొర్లిపోతోంది.."అయితే ఏమాలోచించావు? " నా స్వరం నాకే పీలగా వినిపించింది.

విశాల్ చురుగ్గా చూశాడు.' అంతా తెలిసిన వాడివి.. మళ్లీ ఈ ప్రశ్న దేనిక'న్న భావం కనిపించిందా చూపుల్లో. వాడి నరకయాతన నాకు తెలియనిది కాదు. ఇప్పుడు వాడి నిర్ణయం ఏమిటో కూడా నేనూహించగలను.

"నాకిష్టం లేదు తాతయ్యా! కడుపులో లేనిది కావలించుకుంటే వస్తుందా" విశాల్ పెదవి విప్పాడు కాస్సేపటికి.

విశాల్ అనుభవించిన మానసిక క్షోభ అంతా ఆ సమాధానంతో తేటతెల్లమైంది. కానీ.. ఆ జవాబుతో నేను సంతృప్తి చెందలేకపోయాను.



'స్వరూప నా కూతురని కాదు.. పుత్రశోకంతో అలమటిస్తూ ఓదార్పు కోసం తపిస్తున్న ఓ మాతృమూర్తిగా తలచాను నేను. క్షమించడం దైవత్వమని వాడికి చిన్నప్పటి నుండీ నూరిపోశాను. కానీ.. వాడి మనసులో కన్నతల్లి పట్ల రగులుతున్న ద్వేషాగ్ని ఆ క్షమను కబళించబోతోంది. క్షమ మనసుకి శాంతినిచ్చే ఒక దివ్యౌషధం. దాన్ని దూరం చేసుకుని విశాల్ మానవత్వానికి దూరమవడం సహించలేను.. వాడు నాకు దూరమైనా సరే'

"ఆలోచించు విశాల్! స్వరూప నీ కన్నతల్లనో, లేక నా కూతురనో ఆమె తరఫున మాట్లాడ్డం లేదు. కన్నబిడ్డను పోగొట్టుకొని గర్భకోశంతో అల్లాడిపోతున్న ఓ మాతృమూర్తి. ఆ తల్లికి ఉపశాంతినివ్వడం ఒక మనసున్న మనిషిగా నీ ధర్మం. నీ క్షమ.. ఆవిడ తన తప్పుకు ప్రాయశ్చిత్తం చేసుకొనేలా చేయగలదు.. ఆలోచించు.." మెత్తగా చెప్పాను వాడి వీపు నిమురుతూ.

'లోకంలో ఎందరో.. బిడ్డలను పోగొట్టుకున్న అమ్మలున్నారు.. వారందరికీ నేను శాంతినందించగలనా!' అని విశాల్ అంటాడేమోనని భయపడ్డానొక్కక్షణం.

కానీ.. వాడలా అనలేదు. నా పెంపకంలో పెరిగిన వాడలా అనడనీ నాకు తెలుసు.. కానీ... ప్రస్తుతం వాడున్న పరిస్థితిలో అలా అంటాడేమోనని నేను భావించాను.

వాడి వ్యక్తిత్వాన్ని శంకించినందుకు సిగ్గుపడ్డాను ఒక్కక్షణం.

"నేను ఆలోచించుకోవాలి.. ఏ విషయం రేపొద్దున్న చెప్తాను.." మరొక మాటకు ఆస్కారం ఇవ్వకుండా లోపలికి వెళ్లి తలుపు మూసుకున్నాడు విశాల్.

తనని తాను సమీక్షించుకునేందుకు ఆపాటి సమయం అవసరమనిపించింది. అందుకే నేను వాడి వెనక వెళ్లలేదు.

ఆ రాత్రంతా నాకు నిద్రలేదు.. పక్కగదిలో విశాల్ కూడా అదే స్థితిలో ఉంటాడని తెలుసు నాకు.

విశాల్ సమాధానం కోసం నిరీక్షిస్తూ.. నిరీక్షిస్తూ ఏ తెల్లవారు ఝామునో కునుకు తీశాను.

★ ★ ★

పక్షుల కిలకిలారావాలు చెవులపడుతుంటే మెలకువ వచ్చింది. సమయం ఆరున్నరయ్యింది. గబగబ లేచి స్నానాది కాలు, పూజ ముగించుకున్నాను.

విశాల్ గది తలుపింకా తెరుచుకోలేదు. పాపం! మానసికంగా ఎంత నలిగిపోయాడో బిడ్డ! జాలి ముంచుకొచ్చింది.

ఇంతలో విశాల్ తలుపు తెరుచుకుని, బయటకొచ్చాడు. అతడి ముఖం ప్రశాంతంగా ఉంది. నిన్న అనుభవించిన కల్లోలం ఏదీ ముఖంలో కానరావడంలేదు. తాజాగా.. ఉత్సాహంగా కనిపిస్తున్నాడు.

ఇద్దరం మౌనంగా టిఫిన్ చేశాం. నేనేమీ ప్రశ్నించలేదు. "రాత్రల్లా ఆలోచించాను తాతయ్యా! మీరన్న మాటలే నిజమనిపించాయి. ఆవిడ నాకు తల్లి ప్రేమను అందివ్వలేదని, నేనూ అలా ప్రవర్తించడం సబబు కాదనిపించింది. ఆవిడ తాను చేసిన తప్పుకు ప్రాయశ్చిత్తం చేసుకొని పునీతురాలవ్వాలని భావిస్తుంటే, నేను తప్పు చేసి దోషిగా నిలబడటం ధర్మం కాదు.. అందుకే... ఆవిడ కోరిక తీర్చాలనుకుంటున్నాను.." చెప్పాడు నిబ్బరంగా.

నా అంచనా తప్పనందుకు సంతోషించాను.. కానీ అంతలోనే బాధనిపించింది. వాడు రెండేళ్లపాటు అమెరికా వెళ్తేనే తట్టుకోలేనని భావించిన నేను.. వాడు శాశ్వతంగా అక్కడే ఉండిపోతాడని తెలిశాక ఎలా తట్టుకోగలను!

పెంచిన మమకారంతో వాడి చుట్టూ అల్లుకున్న అనుబంధమిది. తెంచుకొని, వియోగాన్ని ఇక ఎలా భరించగలను'..నా గుండె దుఃఖంతో బరువెక్కింది.

నా ఆలోచనల్ని భగ్నం చేస్తూ విశాల్ గొంతు ఖంగుమంది.

"కానీ ఒక్క షరతు తాతయ్యా! ఆమె కోసం నేను అమెరికా వెళ్లను. నిజంగా ఆమె గనుక నన్ను కావాలని మనస్ఫూర్తిగా కోరుకుంటే ఆమెనే ఇండియా రమ్మనండి" తడి చేతులను నాప్‌కిన్‌తో తుడుచుకుంటూ చెప్పాడు విశాల్.

నివ్వెరపోయాను. ఏమంటున్నాడు విశాల్?

"ఇప్పటికిప్పుడు ఇండియా రావాలంటే వాళ్లకి వీలుకావద్దూ.. అయినా నువ్వేటూ అమెరికా వెళ్దామనుకుంటున్నావు కదా!" అడిగాను అయోమయంగా.

వాడి ఆంతర్యం అర్థం అయ్యీ కానట్లుగా ఉంది.

"లేదు తాతయ్యా! ఆ ఆలోచన విరమించుకుంటున్నాను. ఆవిడకి తీసుకోవడమే గానీ ఇవ్వడం తెలియదు. అందుకే చెప్తున్నాను. ఆవిడ ప్రేమలో నిజాయితీ గనక ఉంటే నా కోసం, వృద్ధాప్యంలో ఉన్న మీ కోసం.. ఇక్కడికి రమ్మనండి. అప్పుడే నా క్షమకి ఒక అర్థం దొరుకుతుంది. ఆవిడ ప్రాయశ్చిత్తం చేసుకున్నట్లు అవుతుంది" నిక్కచ్చిగా, నిర్భయంగా చెప్పాడు విశాల్.

వాడి మాటల్లో మూర్తీభవించిన ఆత్మవిశ్వాసం చూసి ముచ్చటపడ్డాను.

నిజమే.. స్వరూపకి పుచ్చుకోవడమే గాని, ఇవ్వడం తెలీదు.

ఆమె తన ప్రేమను కొడుక్కి పంచాలనుకుంటే ఈ పద్ధతి అయితేనే కరెక్ట్.

అలా అయితేనే ఆమె విశాల్ చూపించిన క్షమకి అర్హురాలని తెలుస్తుంది.

క్షమించడానికి గొప్ప మనసు కావాలి... కాని, క్షమించబడడానికి కూడా అవతల మనిషికి అర్హత కావాలి.

అది నా కూతురికుందో లేదో తెలుసుకోవడానికి ఫోన్ వైపు నడిచాను. Ⓥ




# సంతాపం

## అనువాదం : రామరాజు లక్ష్మీనారాయణ

టెలిఫోన్‌కు అతుక్కుపోయిన సాగర్జీ కాసేపు ఆలోచించాడు. డైరీ పేజీలు తిప్పుతున్న అతనికి ఎక్కడనుంచి మొదలుపెట్టాలో అర్థంకాలేదు. ఒక పద్ధతి అంటూ లేకపోతే కొంతమందిని మర్చిపోవటం జరగొచ్చని, కాబట్టి అక్షర క్రమంలో మొదలెట్టడం మంచిదని గ్రహించాడు. డైరీ మొదటి పేజీలో 'ఎ' కింద అతనికి అమర్‌నాథ్‌జీ పేరు కన్పించింది. అతనో ముఖ్యమైన వ్యక్తి అనిపించింది. రాజకీయాల్లో లేకున్నా సమాజంలో బహు ప్రముఖుడిగా పరిగణన ఉన్న వ్యక్తి, బాగా వున్నవాడు కావటంతో స్కూళ్ళు, ఇతర సంస్థలు అతని ఆదరణ కోసం వెంటపడుతూ ఉంటాయి.

నంబర్ డయల్ చేసి "కుడ్ ఐ స్పీక్

టు అమర్‌నాథ్‌జీ? ” అన్నాడు.

“యస్, స్పీకింగ్” అవతలనుంచి విన్పించింది.

“గుడ్ మార్నింగ్ సర్! నేను సాగర్‌ని మాట్లాడుతున్నాను- పొద్దున్నే ఇలా మిమ్మల్ని ఇబ్బంది పెట్టడం బాధగా ఉంది. సారీ సర్! మా తండ్రిగారు చనిపోయారు.. కొన్నిగంటల క్రితమే.. గుండెపోటుతో. లేదు.. లేదు.. ఇంతకు ముందెప్పుడూ రాలేదు.. వయస్సు డెబ్బయ్ రెండు. సంపూర్ణ ఆరోగ్యంతో ఉండేవారు. రోజూ మార్నింగ్ వాక్‌కి వెళ్లేవారు. ఇవాళ కూడా నాలుగింటికే వాకింగ్‌కని బయటికెళ్ళారు. తిరిగొచ్చాక ఏదో బాధపడుతున్నట్టుగా కనిపించారు. నేను గాఢనిద్రలో వున్నాను. మీకు తెలుసుగా రాత్రి పార్టీ ముగిసేటప్పటికి అర్ధరాత్రి దాటింది. అదే, హోం మినిస్టర్‌గారు ఏర్పాటు చేసిన పార్టీ..! మా అమ్మగారు నన్ను లేపగానే డాక్టర్ని పిలిపించాను. అప్పటికే నాన్న తుదిశ్వాస విడిచారు. నాకు దిశానిర్దేశం చేసిన వ్యక్తి. నేనీ స్థితిలో ఉన్నానంటే అందుకు ఆయనే కారణం. తనకు నేనెంతో రుణపడి ఉన్నాను. నేను అనాథగా మిగిలినట్టు అన్పిస్తోంది. చాలా విచారంగా ఉంది సర్! నిగమ్‌బోధ్ ఘాట్‌కి సాయంత్రం అయిదు గంటలకు మీరొస్తున్నారు. సో కైండ్ ఆఫ్ యు.. మీరెప్పుడూ నాకు అండగా వుంటూనే వున్నారు. ఓకే, ఓకే”

టైం చూసుకున్నాడు సాగర్జీ. ఒక్కరికి ఈ వార్త అందించటానికే అతనికి అయిదు నిమిషాలకు పైగా పట్టింది. తప్పదు మరి. అవసరమైనప్పుడు కొన్ని విషయాలు ప్రస్తావించక తప్పదు. తర్వాతి నంబర్ కోసం వెతికాడు. అమర్‌జిత్‌సింగ్‌జీ. అతనొక పేరున్న ట్రాన్స్‌పోర్టర్. కొన్ని సందర్భాలలో బాగా పనికొస్తాడు. నంబరు డయల్ చేశాడు. అదృష్టవశాత్తూ వెంటనే దొరికాడు. ఇంతకు ముందు చేసిన సంభాషణనే కాసేపు కొనసాగించాడు. ఆ తర్వాత అమర్‌జిత్‌సింగ్ అడిగాడు. “సాగర్‌జీ! బాడీని నిగమ్‌బోధ్ ఘాట్‌కి చేర్చటానికి ఎలాంటి ఏర్పాటు చేశారు? ”

“ఓ వ్యాను ఏర్పాటు చేశాను”

“కుటుంబసభ్యులందరినీ చేర్చటానికి.? ”

“రెండు మూడు వెహికల్స్ వున్నాయి కానీ..”

“ఏం వర్రీ కాకండి. ఇరవై, ముప్ఫయ్ మంది పట్టే మినీ బస్ పంపిస్తాను”

సాగర్జీ మొఖం వెలిగింది. “అలా చేస్తే బావుంటుంది అమర్‌జిత్‌జీ! ఇంత మందిని ఈ సమ్మర్‌లో శ్మశానవాటికకు ఎలా తీసుకెళ్లాలా అని ఆందోళనగా ఉన్నాను”.

అమర్‌జిత్‌సింగ్ నిజంగా అవసరానికి ఆదుకునే వ్యక్తి. తనూ అతనికి ఎంతో సహాయం చేశాడు. తను ట్రాన్స్‌పోర్ట్ మినిస్టర్‌తో మాట్లాడి ఏ విధంగా అతనికి ఆలిండియా టూరిస్టు పర్మిట్ ఇప్పించాడో ఓసారి గుర్తుకు తెచ్చుకున్నాడు.

ఆ తర్వాత.. అనీస్ అహమ్మద్, అనిల్ అంచారా, అనూప్ సింగ్.. ఇలా కొంత మందితో మాట్లాడాడు. ఇలా అక్షర క్రమంలో మాట్లాడుతూపోతే ఎం, ఆర్, ఎస్.. లాంటి అక్షరాలతో మొదలయ్యే అతి ముఖ్యులు కొందరు అసలు దొరక్కుండా పోయే ప్రమాదముందని గ్రహించాడు. అలా అయితే చాలామంది వివిపీలు శ్మశానవాటిక దగ్గర కనిపించరు కూడా!

అతి ముఖ్యమైన వ్యక్తులను గుర్తు చేసుకోగా, అతనికి గుర్తొచ్చిన వ్యక్తి ట్రాన్స్‌పోర్టు మినిస్టర్. నంబరు డయల్ చేయగానే, అవతలినుండి ఓ అపరిచిత స్వరం వినిపించింది “హలో” అని.

“ట్రాన్స్‌పోర్ట్ మినిస్టర్‌గారి ఇల్లేనా? ”



అడిగాడు.

“యస్”

“నేను సాగర్‌ని. ఎస్.పి.సాగర్.. నేను ఎవరితో మాట్లాడుతున్నానో తెలుసుకోవచ్చా? ”

“నేను మంత్రిగారి పీఏ శర్మను”

“శర్మాజీ! మీరు నన్ను గుర్తుపట్టలేదనుకుంటా. నేను ఎస్పీ సాగర్ని. మంత్రిగారితో మీరు నన్ను చాలాసార్లు చూసేవుంటారు. నేను మనపార్టీ ‘యంగ్ ఎంటర్‌ప్రెన్యూర్స్ సెల్’కి కన్వీనర్ని. పోయిన నెలలో జరిగిన అమర్‌జిత్‌సింగ్ అండ్ కంపెనీ షోరూం ఇనాగరేషన్‌లో మీరు నన్ను చూసే ఉంటారు. అవును.. మంత్రిగారు ఆ ఫంక్షన్‌కు వచ్చారు. బహుశా మీరు వచ్చి వుండకపోవచ్చు. మరో పి.ఎ. అయివుండొచ్చు. ఏమైనా మంత్రిగారితో క్లోజ్‌గా వుండటం.. మీరు చాలా సందర్భాలలో చూసే వుంటారు. మంత్రిగారికి కనెక్షనిస్తారా.. ప్లీజ్.. అర్జంటు పనొకటుంది”.

రిసీవర్ చేత్తో పట్టుకుని వెయిట్ చేశాడు సాగర్. అవతలివైపు నుండి ఏ రెస్పాన్సూ లేదు. చికాకుగా వుందతనికి. కనీసం ఇంకా ఇద్దరు ముగ్గురు మంత్రులనైనా శ్మశానవాటికకు వచ్చేట్టు చూసుకోలేకపోతే, తనకు చాలా అవమానకరంగా వుంటుంది. అకస్మాత్తుగా అతని కళ్ళ ముందు సరూప్‌చంద్ రూపం నిలిచింది. సరూప్‌చంద్ తనకు బద్ధశత్రువు. ఈ మధ్య కొద్దినెలల క్రితమే సరూప్‌చంద్ తల్లి చనిపోతే విపరీతంగా జనమొచ్చారు. పెద్దపెద్ద పార్టీ నాయకులు చేరారు. కొద్ది మంది ప్రతిపక్ష నాయకులు కూడా వచ్చారు. పెద్ద సంఖ్యలో రచయితలు, జర్నలిస్టులు కూడా వచ్చారు. ఓ తెల్ల అంబాసిడర్ కారు ఆగడం, అందులోంచి ఇద్దరు వ్యక్తులు ఓ పెద్ద పూల దండతో దిగడం, ప్రధాని తరఫున దాన్ని సరూప్‌చంద్ తల్లిపై వుంచి ఘనంగా నివాళులర్పించటం.. చూసిన సరూప్‌చంద్ కళ్ళలో గర్వం తొణికిసలాడటం..

అవతలవైపు నుండి మంత్రిగారి స్వరం వినిపించటంతో ఆలోచనలనుండి తేరుకు

న్నాడు సాగర్. కొద్ది క్షణాలపాటు నోట మాట రాలేదు. " ఓహ్.. మంత్రిగారూ! బ్రేక్‌ఫాస్ట్‌లో వున్నారా.. సారీ ఫర్ ది ఇన్ కన్వీనియన్స్.." కంఠం వణుకుతుండగా ..తన తండ్రి ఆకస్మిక మరణ వార్తను మంత్రిగారికి చెప్పాడు. ఆయన మాటల్లో వ్యక్తపరచిన సంతాపం సాగర్ ముఖంలో ప్రతిబింబించింది. కళ్లవెంట నీళ్లు కారుతుంటే ఓ చేత్తో రిసీవర్ పట్టుకునే.. మరో చేత్తో కర్చీఫ్ తీసుకుని వాటిని తుడుచుకుంటూ అన్నాడు "మీరు మీ అమూల్యమైన కాలంలో కొద్ది నిమిషాలు మా కోసం వెచ్చించగలిగితే.. అదే నాకు పెద్ద ఓదార్పు సార్.. మీరెప్పుడూ నామీద దయ చూపిస్తూనే వున్నారు"

'కనీసం ఒక మంత్రిగారైనా తప్పకుండా వస్తున్నారు' అనుకున్నాడు సాగర్.. రిసీవర్ కిందవుంచి పెద్దగా నిట్టూరుస్తూ. వేగంగా టెలిఫోన్ డైరీ పేజీలు తిప్పుతూ ఇంకా కొందరి నంబర్లకు డయల్ చేసి మాట్లాడాడు. ఓ పక్క టైం చూస్తూనే వున్నాడు.

"ఈ ఫోన్లు ఇకనైనా ఆపండి. మీ నాన్న గారి అంత్యక్రియలకు ఏర్పాట్లు జరగాలి. చేయాల్సినవి ఇంకా చాలా వున్నాయి. మీరు మాత్రం ఈ టెలిఫోన్ని అంటిపెట్టుకు కూర్చున్నారు" సాగర్ భార్య కోపంతో అరిచింది.

ఆమె వైపు తీక్షణంగా చూశాడు సాగర్. 'ఆమె వట్టి తెలివితక్కువది. తను ఎందుకు ఈ కష్టమంతా పడుతున్నాడో అర్థం చేసుకోదు. ఇలాంటి సందర్భాలనే.. పెద్దవాళ్ళతో మన రిలేషన్స్ పెంచుకోవటానికి ఉపయోగించుకోవాలి. ఇది మనకు భవిష్యత్తులో ఉపకరిస్తుంది. విఐపీలతో కాంటాక్టులను పెంచుకోవటం ఎంత కష్టమో, భార్యతో సరైన అవగాహన పెంచుకోవటమూ అంత కష్టమ'ని అనుకున్నాడు సాగర్.

"షీలా! నువ్వు ఆందోళన పడాల్సిన పనేమీలేదు. అన్నీ చూసుకుంటూనే వున్నాను. నేనిప్పుడు చేస్తున్న పని అత్యంత ముఖ్యం. నువ్వు సరూప్‌చంద్ తల్లి అంత్యక్రియలకు వెళ్లావు కదా! అప్పుడు శ్మశాన వాటికకు స్టేటస్ ఉన్న వ్యక్తులు ఎంత మంది వచ్చారో చూశావు కదా! మనం కూడా అంత స్టేటస్‌గల వాళ్ళమనే విషయం సమాజం గుర్తించే విధంగా వుండాలి".

ఆమె కొద్దిగా మెత్తపడింది. "అది సరే. ఏమైనా ఏర్పాట్లన్నీ మధ్యాహ్నంలోగా జరిగిపోవాలి. మనకు టైం ఎక్కడుంది? "

"చూడూ.. మధ్యాహ్నంలోపు ఏర్పాట్లు పూర్తవటం కష్టం. నాన్న నిన్న సాయంత్రం చనిపోయి వుంటే ఇవాళ మార్నింగ్ పత్రికల్లో ఈ వార్త అందరికీ తెలిపి వుండేవాడిని. దహనకాండకు సంబంధించిన వివరాలు అందరికీ తెలిసేవి. కానీ ఆయన చనిపోయింది ఈ ఉదయం. సాయంత్రం బులిటెన్‌లో వార్త వచ్చింది. కానీ ఉదయంపూట పత్రికలు చూసినంత సీరియస్‌గా, జనం.. ఈవెనింగ్ బులిటెన్లు చూడరు కదా!"

సాగర్ కొడుకులు ముగ్గురూ చిన్నవాళ్ళు కావటంతో, ఏర్పాట్లన్నీ అతని బావమరిది చూసుకుంటున్నాడు.

అటుగా వెళ్తున్న బావమరిది కృపాల్‌ను పిలిచాడు సాగర్.

"ఏంటి బావగారూ!" ఆగి అడిగాడు కృపాల్

"కృపాల్! అంతా సరిగా జరిగేట్టు చూసే బాధ్యత నీదే. ఎక్కడా ఏ లోపమూ జరగకుండా చూడు. ఏదయినా ఆటంకం అయితే నవ్వులపాలు కావలసి వస్తుంది"

"మీకేం భయంలేదు, నిశ్చింతగా వుండండి, ఏ లోపమూ రాదు" అంటూ తన అక్క షీలాతో ఏదో గుసగుసలాడాడు



కృపాల్. ఆమె పర్సుతీసి కొన్ని వందల నోట్లు తీసి కృపాల్‌కిచ్చింది. ఇదంతా గమనిస్తున్న సాగర్.. కృపాల్ దాంట్లో కొంత.. జేబులో వేసుకుంటాడని వెంటనే గ్రహించాడు.

మరో రెండు నంబర్లు డయల్ చేసి లేచాడు సాగర్. ఏదో ఆలోచిస్తూ లోనికెళ్లాడు. మృతదేహంమీద తెల్లటి వస్త్రం కప్పి వుంది. తన తల్లి.. పక్కనే రోదిస్తూ కూర్చుని వుంది. పురోహితుడు ఆ పక్కనే ఏవో మంత్రాలు వల్లిస్తున్నాడు.

నిగమ్‌బోధ్ ఘాట్ దగ్గర ఓ మాదిరిగా జనం పోగయ్యారు. తన తండ్రి మరణానికి సంతాపం తెలిపిన వారందరికీ చేతులు జోడించి నమస్కరిస్తూ కృతజ్ఞతలు తెలియచేస్తున్నాడు సాగర్.

అక్కడకు ఎంతమంది జనమొచ్చారో మనసులో అంచనా వేయసాగాడు సాగర్. కొద్దిమంది లోకల్‌పార్టీ ఆఫీస్‌కు చెందిన వాళ్ళు మాత్రమే కన్పిస్తున్నారు. స్టేట్ ప్రెసిడెంట్, వైస్ ప్రెసిడెంట్, జనరల్ సెక్రటరీలు ఇంకా రావాల్సివుంది. కార్పొరేషన్‌కు చెందిన కొందరు మాజీ కార్పొరేటర్లు హాజరయ్యారు. పార్టీకి చెందిన సెంట్రల్ హైకమాండ్ వాళ్ళు ఎవరూ కన్పించట్లేదు. ప్రభుత్వానికి చెందిన వాళ్ళు ఎవరూ లేరు.

ఓ పక్క నిరాశచెందుతూనే.. సంతాపం తెలుపుతున్న వాళ్ళకి వినయంగా కృతజ్ఞతలు చెప్తున్నాడు సాగర్. చితి పేరుస్తూ వున్నారు. ఆ మధ్యాహ్నమే సాగర్ అన్నగారు వచ్చారు. చితి అంటించే బాధ్యతని ఆయనకప్పగించి, మిగతా వ్యవహారాలు చూస్తున్నాడు సాగర్.

అంతలో డిప్యూటీ మంత్రివర్యులు అనంత్‌జీ విచ్చేశారు. సాదరంగా ఆయన్ను రిసీవ్ చేసుకున్నాడు సాగర్. తండ్రి మరణానికి సంతాపం తెలిపిన ఆయనని చితివద్దకు తీసుకెళ్లాడు. మృతదేహంపై పుష్పగుచ్ఛాన్ని వుంచి గౌరవ సూచకంగా నమస్కరించారు మంత్రిగారు.

అది నాలుగోరోజు. శ్మశానవాటిక నుండి ఆరోజు చితాభస్మాన్ని సేకరించాలి. హరిద్వార్‌కి ఓ వ్యాన్‌లో వెళ్ళి, చితాభాస్మాన్ని గంగానదిలో కలపాలని నిర్ణయించారు. తండ్రి మరణం సాగర్ని కుంగదీసింది. భార్య అతన్ని ఓదార్చేందుకు ప్రయత్నించింది.

సాగర్‌ని నిరాశా నిస్పృహలు ఆవరించాయి. శ్మశాన దృశ్యం అతని కళ్ళముందు నిలిచింది. యూనియన్ కాబినెట్ నుండి హాజరయింది ఒక్క డిప్యూటీ మినిస్టరే. మిగతా వాళ్ళందరూ ఏమైనట్టు? ప్రామిస్ చేసిన కాబినెట్ మినిస్టర్ తను రాలేకపోతే తన తరపున కనీసం పి.ఎ.నైనా ఓ పుష్పగుచ్ఛంతో పంపొచ్చు కదా! కనీసం ఓ పదిహేను వందలమంది వచ్చినా ఓ గౌరవంగా వుండేది. కానీ వచ్చినవాళ్ళు అయిదువందలకు మించి లేరు. ఆ డిప్యూటీ మినిస్టర్ కూడా రాకుండా వుంటే పరిస్థితి మహాఘోరంగా వుండేది.

తన తల్లివైపు చూశాడు సాగర్. ఆమె కూడా మరెంతోకాలం బతకదనుకున్నాడు. ఆ ఊహ అతన్ని మరో లోకానికి తీసుకెళ్ళింది. శ్మశానవాటికలో తల్లి మృతదేహం. ప్రధాని తన కాబినెట్ మంత్రులతో అక్కడకు విచ్చేశారు. మరెందరో పెద్దలు చేరారు. అంతలో ఓ పెద్ద కారు అక్కడికి వచ్చింది. అందులోంచి రాష్ట్రపతికి చెందిన ఏడీసీలు మిలటరీ యూనిఫారంలో దిగుతారు. వాళ్ళ చేతిలో ఓ పెద్ద పూలహారం. నెమ్మదిగా చితివద్దకు వెళ్ళి సెల్యూట్‌చేసి ఆ హారాన్ని చితిపై వుంచుతారు..

..సాగర్ తదేకంగా తల్లివంకే చూశాడు. తన సీటులోంచి లేచి ఆమె పక్క కూర్చున్నాడు. పెల్లుబుకి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు. V

తెలుగు కథ

-జొన్నకూటి మార్టిన్ ఫిన్‌లె



# దోషి

ఆకాశం నిండా మబ్బులు... ఇపుడో- అపుడో వర్షించడానికి వేచి చూస్తున్నట్టుగా వున్నాయి. మబ్బుల వల్ల వెన్నెల మసక బారింది. గాలి విసురుగా వీస్తోంది. కిటికీలోంచి రివ్వున లోనికొస్తోంది గాలి. గోడకి తగిలించి వుంచిన క్యాలెండర్ కాగితాలు గాలికి ఎగురుతూ వింత శబ్దం చేస్తున్నాయి. క్యాలెండర్ తగిలించడానికి ఆధారంగా వుండే ఇనుప చువ్వ గాలికి గోడపై అటు ఇటు రాసుకుంటూ, అప్పటికే వృత్తాకారంలో గీతపడ్డ గోడని మరింత గంటు పెడుతోంది.

రాత్రిపూట ఆ శబ్దం కొంచెమైనా, వికృతంగా ధ్వనిస్తోంది. కిటికీ మూద్దామని దగ్గరగా వెళ్లాను. వరండాలో ఎవరిదో కూనిరాగం వినిపించింది. ఆ గొంతు నాకు పరిచయమైనదిలా అనిపించి శ్రద్ధగా ఆలకించాను. ఆ గొంతు వాడిదే! ఔను. అప్పుడప్పుడు కూనిరాగాలుతీసే వాడి గొంతు నాకు చిరపరిచితమే.

'ఇంత రాత్రివేళ వాడిక్కడ ఏం చేస్తున్నట్టు? ' తలుపు తెరిచి బయటకొచ్చాను. వాడే! వాడు నన్ను గమనించలేదు. వాడి ధోరణిలో వాడు కళ్లు మూసుకుని తన్మయంగా తనలో తనే పాడుకుంటున్నాడు. వాడు పాడుతుంది ఏ భాషో అర్థం కాకుండా వుంది. వాడి పేరు కూడా విచిత్రంగానే ధ్వనిస్తుంది నాకు.. చిన్నప్పటి చందమామ కథల్లోలా!

"భల్లూ.." పిలిచాను.

పాట ఆగింది.

"ఏం చేస్తున్నావిక్కడ? .."అంటూ దగ్గరగా వెళ్లాను.

వాడు బదులివ్వలేదు.

"నీ పాట బావుంది" అన్నాను వాడి పక్కన చతికిలబడుతూ.

వాడి కళ్లు మెరిశాయి.

"నా చిన్నపుడు రోజూ మా అమ్మ పాడేది" అన్నాడు మెరుస్తోన్న కళ్లతో.

"చాలా బావుంది. అది సరే! మీ అమ్మ లేదా? " అడిగాను.

"ఉంది" ఠక్కున బదులిచ్చాడు.

"మరి నువ్విక్కడ.." సాలోచనగా చూశాను.

వాడు బదులివ్వలేదు.

"ఇంత రాత్రివేళ ఇంకా బయటనే ఉన్నావేం? " రెట్టించాను బదులు కోసం.

"అమ్మకూ, నాకూ గొడవైంది" మోకాళ్ల మీద మొహం ఉంచి, ఆకాశంలోని మబ్బులకేసి చూస్తూ చెప్పాడు.

"అయితే.. ఇంట్లోకి రావద్దందా? "

"ఊహు" తల అడ్డంగా వూపాడు.

"మరి? " ప్రశ్నార్థకంగా చూశాను.

"నాకు కోపమొచ్చి.." తలెగరేసి బదులిచ్చాడు.

"మీ అమ్మ నిన్ను పొద్దస్తమానం తిడు

తూనే వుంటుంది".. అంటూనే సానుభూతిగా చూశాను.

"తప్పు చేస్తే.." బుల్లెట్‌లా దూసుకొచ్చింది వాడి నోటివెంట.

ఇంత రాత్రివరకు ఇంటికి పోకుండా వుండేంతగా అమ్మ ప్రవర్తన వాడికి కోపం తెప్పించింది. అయినా అమ్మను మాటంటే వాడు సహించలేకపోవటం.. ముచ్చటేసింది నాకు.

నిజానికి వాడు అమ్మ అంటున్నది .. అమ్మ కాదు. వాడికి అమ్మలేదు. వాడు ఆమెకి కొడుకూ కాదు. వాడు ఏ రాష్ట్రం వాడో.. ఆమె దగ్గర ఎలా చేరాడో ఎవరికీ తెలీదు. యాస ధ్వనించినా తెలుగు చక్కగా మాట్లాడగలడు.

వాడు 'అమ్మ' అంటున్న మణెమ్మ వయసు నలభై దగ్గర వుంటుంది. సంతానం లేదు. నిజానికామెకు పెళ్లయిందో లేదో కూడా తెలీదు.

నాలుగైదు రోజులకొకసారి ఇంట్లో 'మగ గొంతు' వినిపిస్తుంది. ఏ రాత్రివేళో వచ్చి తెల్లవారకముందే వెళ్లిపోతాడతగాడు.

భల్లూ బడికిపోడు. ఇంట్లోనే మణెమ్మకు పనుల్లో సాయం వుంటాడు. ఆమె ఒంటరి బతుక్కి వాడే పెద్దతోడు.

అడపాదడపా ఇద్దరి మధ్యా గొడవ లేస్తుంది. మణెమ్మ ఏదో విషయంగా వాణ్ణి తప్పుబడుతుంది. తన తప్పేం లేదంటాడు వాడు. గొడవ పెరుగుతుంది. వాగ్వివాదం జరుగుతుంది. మణెమ్మ కూడా చిన్నపిల్లే అయిపోతుందా క్షణం.

ఈ సాయంత్రం అంతే అయింది.

"పాల ప్యాకెట్ కోసం ఇరవై తీసుకెళ్లి, తెచ్చిన పది కాగితం ఇక్కడే పెట్టాను. ఇంతలోనే ఎలా మాయమవుతుంది? "

"ఈ మధ్య నీకు సరదాలెక్కువయ్యాయి. వచ్చిన సినిమా వచ్చినట్టు చూస్తున్నావ్. నిజం చెప్పు? "

"నేను తియ్యలేదు"

"ఒంటరిదాన్ని. ఏదో తోడుండిపెడతావుకదాని నిన్ను తెచ్చిపెట్టుకున్నాను చూడు.. నన్ను నేను చెప్పుతో కొట్టుకోవాలి"

"నేను తియ్యలేదని చెపితే వినిపించుకోవే" పెద్ద చప్పుడుతో తలుపు మూసిన చప్పుడు. అటుపై భల్లూ గొంతు మరి వినిపించలేదు.

"దొంగ ముండాకొడుకు. ఎంత ప్రేమగా చూసుకున్నా ఇంతే" మణెమ్మ చాలాసేపు గొణుక్కుంటూనే ఉంది.

"నిజం చెప్పు. ఆ పది రూపాయలు నువ్వు తియ్యలేదా? " అడిగాను.

"నేను తియ్యలేదు" గుర్రుగా చూశాడు వాడు నా వంక.

సన్నగా చినుకులు పడటం మొదలైంది. గాలికి జల్లు వరండాలోకొస్తోంది.

"లే.. లేచి ఇంటికి పో! మీ అమ్మ నీ కోసం చూస్తూంటుంది" అన్నాను పక్కింట్లో ఇంకా వెలుగుతోన్న లైట్‌ని చూస్తూ.

వాడు లేవలేదు.

'వాడికి బుద్ధిపుట్టినపుడే పోతాడులే' అనుకుంటూ లేచి లోనికి రాబోతుంటే- గాలికి రెపరెపలాడుతూ ఏదో రంగు కాగితం కళ్లబడింది కాళ్లదగ్గర. వంగి దాన్నందుకుని లోపలికొచ్చాను.

సగం చింపిన నేల టికెట్టు! పది రూపాయలది..

నా పళ్లు పటపటలాడాయి. 'రాస్కెల్! సాయంత్రం వాళ్లమ్మ ఎంతడిగినా 'నాకు తెలీదు. నేను తియ్యలేదు' అంటూ ఎంతలా బుకాయించాడు. 'సెకెండ్ షో' సినిమాకు వెళ్లొచ్చాడన్నమాట. బ్లడీ లయర్. అందుకే వాణ్ణి మణెమ్మ అలా తిడుతూ వుండేది' లోనికొచ్చేసి తలుపు గడియ పెట్టేశాను.

ఎంతకీ నిద్ర పట్టలేదు.



‘పాపం మణెమ్మ! తనకేమీ కాని వాడ్ని.. కనీసం తెలుగువాడు కూడా కాని వాణ్ణి చేరదీసి కొడుకులా చూసుకుంటోంది. పెట్టింది తిని.. చెప్పింది విని పడుండక వీడికిదేం బుద్ధి? పది రూపాయలు పెద్ద మొత్తం కాకపోవచ్చు. కానీ, ఇంట్లో మనిషి ‘దొంగ బుద్ధి’ని భరించడం ఎవరివల్లవుతుంది’.. ఆలోచిస్తూనే నిద్రలోకి జారుకున్నాను.

తలుపుమీద పెద్దగా ఎవరో తడుతోన్న శబ్దానికి మెలుకువొచ్చింది. దిగ్గున లేచి కూర్చున్నాను. బయట వర్షం పడుతోన్న చప్పుడు...గోడ గడియారంకేసి చూశాను. పడుకుని రెండు గంటలైనా కాలేదు.

తలుపుమీద మళ్లీ దబదబా చప్పుడు.. ‘ఇంత రాత్రివేళ ఎవరై వుంటారు’ కళ్లు నలుముకుంటూ లేచి, ముందు గదిలోనికొచ్చి, తలుపు గడియ తీయబోతూ ఆగాను.

‘ఇంకెవరు... ఆ భల్లూగాడే అయివుంటాడు. రాత్రి ఇంటికి పోలేదేమో? వర్షానికి లోపల చేరడానికే అయివుంటుంది? వాడేనా... కాదా’ అని తర్జనభర్జన పడుతూ కిటికీ రెక్క కొంచెం తెరిచి చూశాను. వాడే!

వరండాలోనికి విసురుగా జల్లు కొడ్తోంది. అందుకేనేమో? ‘పోనీ లోపలికి రానిస్తేనో? ’ అనిపించింది. అంతలోనే ‘అమ్మో! అసలే జీతం డబ్బులతో జేబు నిండుగా వుంది. వెధవ! ఇంట్లో కాజేసినట్టే.. ఇక్కడా కాజేయడని నమ్మకమేమిటి? వర్షానికి తడిసినంత మాత్రాన మొక్కేం మొలిచిపోదు. పోనీ! ఇంటికి పోకుండా వున్నందుకు.. వాడికి ఇకనైనా తెలిసిరావాలి’..

తలుపుమీద చప్పుడు పెరిగింది.

“రాస్కెల్! బంగారంలాంటి నిద్ర చెడగొట్టేశాడు” పళ్లు నూరుకుంటూ, కిటికీ మూసి బెడ్‌రూమ్ లోనికొచ్చేశాను.

తలుపుమీద చప్పుడు ఆగింది. కానీ, అంతలోనే ‘అమ్మా’ అంటూ అరుపు వినిపించింది.

నాకు నవ్వొచ్చింది, అలాగైనా నాచేత తలుపు తీయించాలనే వాడి ప్రయత్నానికి. బెడ్‌రూమ్ తలుపులు బిగించేశాను, వాడు అరిచి గీపెట్టినా వినిపించకుండా.

★ ★ ★

ఉదయమే లేచే అలవాటు వల్ల- రాత్రి ఆలస్యంగా పడుకున్నా తెలతెలవారుతూనే మెలకువ వచ్చేసింది.

కాలకృత్యాలు తీర్చుకుని తలుపులు తెరిచాను. వరండా ఖాళీగా కనిపించింది.

‘వెళ్లిపోయాడన్నమాట’ నవ్వుకుంటూ, పేపర్, పాలప్యాకెట్ అందుకుని లోనికి రాబోయాను. వీధిలో రోదిస్తోన్న ఎవరిదో స్త్రీ కంఠం వినిపించింది. మనసేదో కీడు శంకించింది.

గేటు తెరుచుకుని వీధిలోకొచ్చాను. పక్కింటిదగ్గర జనం గుమికూడి వున్నారు.

‘ఏమై వుంటుంది’ అడుగులో అడుగేసుకుంటూ మెల్లిగా గుంపుని సమీపించాను.

“ఎలా జరిగింది? ” ఎవరో ఎవరినో అడుగుతున్నారు.

“తల్లితో గొడవపడి రాత్రి ఇంటికి రాలేదంట. రాత్రి ఎక్కడున్నాడో.. ఏమో? వర్షానికి ఎటునుంచొచ్చిందో పాము, కాటేసిపోయింది. భయంతో ఇల్లు చేరాలని చూసి విషం తలకెక్కడంతో వీధిగుమ్మం ముందే ఒరిగిపోయాడు. ఇక్కడ తెల్లారిన తర్వాతగానీ ఎవరికీ తెలీలేదు” వివరిస్తున్నారెవరో.

“భల్లూ..? ? ” సందేహంగా.. వలయాకారంగా ఏర్పడిన గుంపుని చీల్చుకుంటూ ముందుకెళ్లాను.

వర్షంతో తడిసిన చిత్తడినేల మీద నిర్జీవంగా పడివున్నాడు భల్లూ. వాడి తలను తన ఒడిలో పెట్టుకుని రోదిస్తోంది మణెమ్మ. చుట్టూ మూగిన జనం జాలిగా చూస్తున్నారు.

భల్లూ పాదానికి కొంచెం పైన రెండు గాట్లు.. చిన్నసైజు తిలకం బొట్లలా.. ఎర్రగా! నోటికి ఓ పక్కగా కారిన నురగ, మెడమీదికి జారి చారికలు కట్టింది.

“తల్లిలా చూసుకుంటున్నది.. ఓమాట అనకుండా వుంటుందా? ‘అంతమాత్రానికే కోపంతో ఇల్లొదిలి పోవాలా? చూడండి. ఎంత దారుణం జరిగిపోయిందో”

జనం రకరకాలుగా వ్యాఖ్యానిస్తున్నారు.

“ఒక్కసారి కళ్లుతెరవరా నాన్నా.. నాతో మాట్లాడరా కన్నా..” వాడి గడ్డంకింద రెండు చేతులూ వుంచి పట్టి కుదుపుతూ ఏడుస్తోంది మణెమ్మ. “మతిమరుపు ముండని.. పది కాగితం ఓ చోట పెట్టి, ఇంకోచోట వెదికాను. నిన్ననుమానించాను. దొంగతనం అంటగట్టాను. ఆ కోపంలో ఇల్లొదిలిపోయావు. నాక్కాకుండా పోయావు. పాపిష్టిదాన్ని. నాకెంతటి శిక్ష వేశావురా..” వాడి అరచేతులతో తన చెంపలు వాయించుకుంటూ ఏడుస్తోంది మణెమ్మ.

దోషి మణెమ్మేనా? !

అంతరంగంలో-వేయి గొంతుకల ప్రశ్న!

రాత్రి- వాడు తలుపు ‘తట్టడం’.. ఆపై ‘అమ్మా’ అంటూ అరవడం..! నన్ను నేను సమాధానపర్చుకోలేకపోయాను.

వాడు పాము కాటు వల్లే చనిపోయాడని అంతా అనుకోవచ్చుగాక! కానీ.. నాలోని ‘నిర్దయ’కు తెలుసు- ‘అసలు నిజం’

నిర్జీవమైన భల్లూ మొహం చూడటానికి కూడా నాకు మొహం చెల్లలేదు. మరక్కడ నిలవలేక వెనుదిరిగాను.

గుండెల్ని పిండేస్తూ- అపరాధ భావం.. జీవిత పర్యంతం వెన్నాడుతూనే వుంటుంది.

V

**తెలుగు కథ**

-జంధ్యం వెంకటేష్ బాబు



# రెక్కల గుర్రమెక్కి..

'రమేష్ ఇంకా రాలేదేంటి?.. మరో ఐదు, పది నిముషాల్లో కారు వచ్చేయొచ్చు.. ఈ రోజూ తనకు కనిపించకుండా వెళ్ళిపోవాలేమో..' ప్రశాంతి మనసులో కాస్తంత ఇబ్బంది కదలాడింది.

సోఫాలో నుండి లేచి అసహనంగా అటూఇటూ తిరుగుతుంటే, సెల్ రింగయ్యింది. రమేష్ సెల్ నుండి కాల్!

"శాంతీ! అమీర్‌పేట్ ట్రాఫిక్ జామ్‌లో ఇరుక్కుపోయాను. రావడానికి మరో అర్ధ గంట ఆలస్యమయ్యేలా ఉంది. స్రవంతిని ఇంట్లో ఉంచి లాక్ చేసి, కీస్ వాచ్‌మెన్‌కి ఇచ్చేసి వెళ్ళిపో"

"అలాగే".. నిట్టూర్పుతో పలికింది ప్రశాంతి.

భార్యాభర్తలు ఒకరి ముఖం మరొకరు చూసుకోకుండా గడపొచ్చు కానీ.. నాలుగేళ్ల పాపను ఇంట్లో పెట్టి, బయట లాక్ చేసుకుని వెళ్లడం..?!

ప్రశాంతి తల తిప్పి చూసింది. సోఫాలో కూర్చుని కార్టూన్ నెట్‌వర్క్ ఛానెల్ చూస్తోంది స్రవంతి. నిద్రొస్తున్నట్టుంది. కళ్ళు వాలిపోతున్నాయి కానీ 'డాడీ వస్తాడ'ని నిద్రను ఆపుకుంటోంది.

"స్రవంతీ!"

పసిపాప తలతిప్పి చూసింది.

ఆ మాటలు కాస్త ఇబ్బంది పడుతూనే చెప్పింది.. "డాడీ రావడం కాస్త ఆలస్యమవుతుందట. నువ్వు కాసేపు టి.వి. చూశాక, పడుకో.. నేను బయట లాక్ చేసుకుని వెళ్తాను.."

స్రవంతి ముఖంలో ఆ క్షణం కదలాడిన భావం- భయమో, బాధనో, మరేదో ఆ తల్లికే అర్థం కాలేదు. కాకపోతే ఈ మధ్యకాలంలో పిల్ల ముఖంలో కదలాడే ఫీలింగ్స్ పట్టించుకోవడం మానేసింది.

కూతురు తల నిలువుగా ఆడించిందో, అడ్డంగా వూపిందో పట్టించుకోకుండానే హాలులోనుండి బయటకు నడిచింది. డోర్ లాక్ చేసి, లిఫ్ట్‌లో కిందికి దిగింది. వాచ్‌మెన్‌ని పిలిచి కీస్ అతడికి అందించాక, గేటు వైపు నడిచింది.

గేటు దగ్గర పది నిముషాలు వెయిట్ చేశాక కారొచ్చింది.

"హాయ్ ప్రశాంతీ! హౌ ఆర్ యూ?" కారులోని ఇద్దరమ్మాయిలు పలకరించారు. మరో ఇద్దరు అబ్బాయిలు సెల్‌లో బిజీగా మాట్లాడుతున్నారు.

"ఫైన్" అంటూనే కారెక్కి కూర్చుంది ప్రశాంతి.

కారు కాల్‌సెంటర్ వైపు సాగింది.

★ ★ ★

రమేష్ డోర్ నెడుతూనే లోపలికి తొంగి చూశాడు. స్రవంతి నిద్రపోతూ వుండొచ్చు కాబట్టి అలికిడి కాకుండా లోపలికి వెళ్లాలన్న ఆలోచన తనది కానీ.. అటు చూడగానే గుండె కలుక్కుమంది. ఐతే మనసుకి విలువిస్తే 'మనీ'ని దూరం చేసుకోవలసి వస్తుందని, వెంటనే మనసును మరల్చుకున్నాడు.

బుగ్గల చుట్టూ రెండు అరచేతులుంచి, సోఫాలో కూర్చుని ఉంది స్రవంతి. తను టి.వి. చూడడం లేదు. కనీసం తనొచ్చిన అలికిడి కూడా పట్టించుకోలేదు.

అతడు కూతురు దగ్గరగా వెళ్లాడు. సోఫాలో పక్కనే కూర్చున్నాక, "స్రవంతీ.." అంటూ భుజం మీద చెయ్యి వేశాడు.

ఆ స్పర్శకూ తను తలతిప్పి చూడలేదు.

కూతురికి కోపం వచ్చిందన్న విషయం ఆ తండ్రికి అర్థమైపోయింది. "కోపం వచ్చిందా తల్లీ"

"రాలేదు డాడీ"

"మరెందుకలా వున్నావ్? "

"ఇంట్లో ఒక్కదాన్నే ఉంటే భయమేస్తోంది".

"భయమెందుకమ్మా? .. కాస్త ఆలస్యమైనా, మమ్మీ డాడీల్లో ఎవరో ఒకరు వచ్చేస్తారుగా"

"ఒక్కరే కనిపిస్తారు. ఇద్దరూ కనిపించరుగా".

ఈసారి అతడికి కాస్త చిరాకనిపించింది. అసలే ఆఫీసులో ప్రాజెక్టులు, అసైన్‌మెంట్లూ, డెడ్‌లైన్లతో చస్తుంటే, ఇంటికొచ్చాక ఈ గోలేంటి? .. కోప్పడితే ఏడుస్తుంది. ఆ ఏడుపుతో నిద్ర పాడవుతుంది. అందుకే పళ్ల బిగువున కోపాన్ని దాచుకొని, పెదాలపై చిరునవ్వును కొనితెచ్చుకుని, ఆఫీసులో బాస్‌ల ముందు నటించినట్టే కూతురు ముందూ నటించాడు." నీ ప్రాబ్లమ్ అర్థమయ్యిందిలే స్రవంతీ! డే డ్యూటీ చేసొచ్చి డాడీ, నైట్ డ్యూటీ చేసొచ్చి మమ్మీ నిన్ను పట్టించుకోవటం లేదు. నీకు బోర్ కొడుతోంది. అందుకే భయాలు, పిచ్చి పిచ్చి ఆలోచనలూ వస్తున్నాయి. రేపు మీ మమ్మీతో మాట్లాడి ఏదో చేస్తాలే.. ఈ రోజుకి వెళ్ళి పడుకో."

అంతకు మించిన ఓదార్పు తనకు దక్కదని తెలిసినట్టు, స్రవంతి హాలులో నుండి బెడ్‌రూమ్ వైపు నడిచింది.

వీకెండ్‌లో రమేష్ ఈ విషయమే ప్రశాంతితో డిస్కస్ చేశాడు. "ఉద్యోగ బాధ్యతల మధ్య మనిద్దరిలో ఒకరు ఎప్పుడూ ఇంట్లో ఉండరు. ఆ ఒక్కరూ ఇంట్లో ఉన్నా, ఉండీ లేనట్లే. ఎందుకంటే డ్యూటీలో అలసి వచ్చిన మనం ఆదమరచి నిద్రపోతాం. పైగా అప్పుడప్పుడు ఇద్దరమూ ఇంట్లో ఉండని పరిస్థితి కూడా ఏర్పడుతోంది. దీంతో స్రవంతి భయపడుతోంది, బాధపడుతోంది."

"నిజమే! నేనూ ఇదే గమనించాను."

"మరి తనను బాధపెడుతూ ఇంకా ఎంత కాలం? "

ప్రశాంతి అర నిముషం ఆలోచించాక చెప్పింది "పోనీ! తనను ఏదైనా బోర్డింగ్ స్కూల్లో చేర్చేద్దామా? "

తనూ ఆలోచిస్తున్నట్టుగా ముఖం పెట్టి "మరో మార్గం లేదా? " స్వగతంతోనే ప్రశ్నించాడు.

"మరో మార్గం అంటే- మనిద్దరిలో ఒకరు ఉద్యోగం మానేయాలి.. ఉద్యోగం మానేస్తే మనకున్న ఫైనాన్షియల్ కమిట్‌మెంట్స్ తట్టుకోగలమా? ఆలోచించండి"

అరసెకను కూడా ఆలోచించకుండా "వద్దులే" అన్నాడు రమేష్. అంతలోనే మరో ఆలోచన వచ్చినట్టు ఆమె ముఖంలోకి చూశాడు.. " ఇలా చేస్తే ఎలా వుంటుంది? "

ఆమె కూడా అతడి కళ్ళలోకి ప్రశ్నార్థకంగా చూసింది.

" మన దూరపు బంధువుల్లో ఒంటరిగా వుండే ముసలాళ్లు ఎవర్నయినా తెచ్చి ఇంట్లో పెట్టుకుంటే? "

"ఏడ్చినట్టే వుంది..." చిరాగ్గా ముఖం తిప్పుకున్నాక, చెప్పదలచుకున్నది చెప్పింది "అప్పుడు తనకేదయినా అనారోగ్యం చేస్తే, ఇద్దరం ఆఫీసులకి సెలవు పెట్టి హాస్పిటల్స్ చుట్టూ తిరగాలి"

"హమ్మో' అనుకుంటూ రమేష్ తల విదిలించాడు.

"మరిప్పుడేం చేద్దాం"

"స్రవంతి చిన్నపిల్ల. తనేదో భయపడుతోందనీ, బాధపడుతోందని మనం మరీ అంత సీరియస్‌గా తీసుకోనక్కర్లేదు. చిన్నప్పటి నుండి అన్నీ అలవాటు కావాలి. చివరికి ఒంటరితనం కూడా అలవాటు చేసుకోక తప్పదు"

భార్య అభిప్రాయంతో ఏకీభవించినా, ఏకీభవించకపోయినా చేయగలిగిందేమీ లేనట్టు రమేష్ వుండిపోయాడు.

'సమావేశం జరిగింది. నిర్ణయాలేవీ తీసుకోలేదు' అన్నట్టుగా అయ్యింది అక్కడి పరిస్థితి.

★ ★ ★

నిద్రమత్తులోనే టైమ్ చూస్తే రెండయ్యింది. బెడ్‌మీద నుండి లేవాలనిపించడం లేదు గానీ, ఆకలి తనని పడుకోనివ్వటం లేదు.

బద్ధకంగా నిద్రలేచి స్నానానికి వెళ్ళబోతుంటే, సెల్‌ఫోన్ రింగయ్యింది. డిస్‌ప్లేలో నంబర్ చూస్తే- స్కూల్ నుండి!

"హలో"

"నమస్తే మేడమ్! నా పేరు రాజేశ్వరి... స్రవంతి క్లాస్ టీచర్‌ని"

"చెప్పండి"

"మీరొకసారి స్కూల్‌కి రాగలరా? "

ప్రశాంతి ఒక్కక్షణం నిశ్శబ్దంగా వుండిపోయింది. 'స్కూల్ ఫీజులేవీ బేలన్స్ లేవు. కంప్లయింట్ చేయడానికి స్రవంతి అల్లరిపిల్ల కాదు. మరి తననిప్పుడు స్కూల్‌కి ఎందుకు రమ్మంటున్నట్టు? '

"ఎనీ ప్రాబ్లమ్ టీచర్"

"నో ప్రాబ్లమ్.. బట్, స్రవంతి గురించి మీతో కాసేపు మాట్లాడాలి. స్కూల్ అవర్స్ అయిపోయాక మనం కలిస్తే బాగుంటుందనుకుంటున్నాను"

అంత దూరం వెళ్ళటం కష్టంగా అనిపించినా, తప్పదనుకుని "సరే" అంది.

'థాంక్యూ మేడం" అంటూ రాజేశ్వరి ఫోన్ కట్ చేసింది.

'స్రవంతి గురించి సమస్యలేవీ లేవంటోంది. మరి రాజేశ్వరి తనను ఎందుకు రమ్మన్నట్టు? !..' కొద్దిసేపే ఆలోచించింది. సమాధానం తోచకపోవటంతో, అసలా ఆలోచనే పక్కనపెట్టి బాత్‌రూమ్‌లోకి వెళ్ళింది ప్రశాంతి.

ఆ సాయంత్రం స్కూల్‌కి చేరుకుంటే, ఆఫీస్ ముందు తనకోసమే ఎదురుచూస్తోంది రాజేశ్వరి. "నమస్తే మేడమ్."

"నమస్తే" స్రవంతిని దగ్గరకు తీసుకుంది ప్రశాంతి.

"మనం అలా ఆఫీస్‌రూమ్‌లోకి వెళ్దామా? "

ప్రశాంతి తలాడించి అడుగులు ముందుకేసింది. స్రవంతి కూడా తమను అనుసరించబోతుంటే, చూపులతోనే ఆగమన్నట్టు సైగచేసింది రాజేశ్వరి.

'బహుశా తనతో చర్చించబోయే విషయం స్రవంతికి తెలియటం ఇష్టంలేనట్టుంది' మనసులో అనుకుని, మౌనంగా ఫాలో అయ్యింది ప్రశాంతి.

ఇద్దరూ ఆఫీస్‌రూమ్‌లో ప్రవేశించారు.

"కూర్చోండి"

ప్రశాంతి కుర్చీలో కూర్చుంటూ చుట్టూ చూసింది. ఆఫీస్‌రూమ్‌లో ఎవ్వరూలేరు. ఎవ్వరూ లేని చోటుకు రాజేశ్వరి తనను తీసుకొచ్చింది? ఎందుకో తెలియదు. తొలిసారిగా కాస్త భయంగా అనిపించింది ఆమెకు. 'విషయం మరీ ఇంత సీరియస్సా? '

"పేరెంట్, టీచర్స్ మీటింగ్‌లో మనమోసారి కలిశాం" అంటూ రాజేశ్వరి ఆమెకు ఎదురుగా కూర్చుంది.

"అవును."

"మీరు అప్పుడే 'అలాంటి మీటింగ్‌లకు

రాలేను కాబట్టి మెసేజ్‌లు పెట్టొద్దని చెప్పారు..." అంటూ అదోలా నవ్వింది.
ఆ నవ్వు క్యాజువల్‌గా అనిపించినా, సంజాయిషీ ఇచ్చుకోక తప్పలేదు. "నాకున్న బిజీలైఫ్ అలాంటిది."
"మనది బిజీలైఫ్ కావచ్చు. కానీ... మన పిల్లలకు ఇల్లు బందిఖానాలా అనిపించకూడదు."
"ఎందుకలా అంటున్నారు? "
రాజేశ్వరి ముఖం మీద నవ్వు మాయమయ్యింది. ఆమె తన హ్యాండ్‌బ్యాగ్‌లో నుండి ఒక పేపర్ తీసి టేబుల్ మీద పెట్టింది. "ఈ బొమ్మను చూడండి."
ప్రశాంతి ఆ పేపర్ తీసుకుని చూసింది. కలర్ పెన్సిల్స్‌తో గీసిన బొమ్మ. కార్టూన్ బొమ్మలా- నాలుగు నిలువు గీతలు, ఆ వెనుక ఓ చిన్నపిల్ల... 'ఈ బొమ్మలో ఏముంది? ఈ టీచర్ అసలు తనకీ బొమ్మ ఎందుకు చూపుతోంది? "
ఆ ప్రశ్న అడగక ముందే సమాధానం చెప్పింది రాజేశ్వరి. "ఆ బొమ్మను గీసింది స్రవంతి"
ప్రశాంతి చిన్నగా నవ్వింది. "మా అమ్మాయి బొమ్మలు గీయటం కూడా మొదలు పెట్టిందా? "
"బొమ్మలు కాదు.. ఒక్కటే బొమ్మ..ప్రతి నోట్స్‌లోనూ పిచ్చిగీతల్లా కనిపించే ఇదే బొమ్మ"
ప్రశాంతి ముఖం కాస్త ఎర్రబడింది. "అంటే.. తను ఇలాంటి పిచ్చి గీతలతో నోట్స్‌లన్నీ పాడు చేస్తోందా? "
ఇది కంప్లయింట్ చేయడానికేగా నన్నిలా పిలిచిందన్న ప్రశ్న కూడా అందులోనే వుంది.
రాజేశ్వరి ఆమె ముఖంలోకి తదేకంగా చూసింది. తర్వాత దీర్ఘంగా నిట్టూర్పు విడిచింది.. "పిల్లల ప్రతి పనిలో అంతరార్థాన్ని అర్థం చేసుకుని, ఆస్వాదించగలిగిన వారే నిజమైన తల్లిదండ్రులు. మరి మీరిలా అపార్థంచేసుకుని మాట్లాడుతుంటే ఏమనాలో నాకర్థంకావడంలేదు"
ఆమె మాటలు అర్థం చేసుకోవడానికి ప్రశాంతికి పదిసెకనులు అవసరమయ్యాయి. అర్థమయ్యాక సర్రున కోపం వచ్చేసింది. 'తన కూతురి చేష్టలు అర్థం చేసుకోలేనంత మూర్ఖురాలనని అనుకుంటోందా? ' అందుకే 'బీ యువర్ లిమిట్స్' అందామనుకుంది. కానీ తన కూతురి రాతల వెనుక వున్న అంతరార్థం తెలుసుకోవాలన్న క్యూరియాసిటీ.. కోపాన్ని పక్కన పెట్టేలా చేసింది.
"మీరు... మీరేం చెప్పాలనుకుంటున్నారు? "
"ఓ పసిదాని ఈ పిచ్చిగీతల వెనుక వుండేది అల్లరి కాదు ఆర్ద్రత"
ప్రశాంతి అయోమయంగా చూసింది. "ఆ... ర్ద్ర... త? !"
"అవును! మనసులోని బాధ ఎవరికి, ఎలా, ఎప్పుడు, ఎందుకు చెప్పుకోవాలో తెలియనప్పుడు పసిపిల్లలు దానిని వ్యక్తం చేసే తీరు అనేక రకాలుగా వుంటుంది. కొందరు ఏడుస్తారు, మరొకందరు అతిగా అల్లరి చేస్తారు. ఇంకొందరు ముడుచుకుపోతారు. స్రవంతి ఆ మూడో కేటగిరీలోకి వస్తుంది. ఆ కేటగిరీ వ్యక్తులే తమ మనుసులోని భావాలను ఇలా మరో రూపంలో వ్యక్తం చేస్తారు.
"ఇంతకీ తనా బొమ్మల ద్వారా ఏ భావం వ్యక్తంచేసింది? !"
రాజేశ్వరి ఆ ప్రశ్నకు బదులివ్వలేదు. తన దగ్గరున్న ఫైల్ లో నుండి మరికొన్ని బొమ్మలు తీసి ఆమె ముందుంచింది.
చంద్రుడు, చుక్కలు, గాలిపటాలు, సెలయేర్లు, పక్షులు, జంతువులు..
ఆ బొమ్మల్లో "పర్‌ఫెక్షన్' లేకపోవచ్చు. కానీ క్రియేటివిటీ వుంది. అవేవీ రోటీన్‌గా, అయిష్టంగా గీసినవి కావు. ఎంజాయ్ చేస్తూ, మైమరిచి గీసిన పిచ్చి గీతలు..
రాజేశ్వరి తన ప్రశ్నకు బదులివ్వకుండా ఆ బొమ్మలు ఎందుకు చూపిస్తోందో ఆమెకు అర్థంకాలేదు.
అర్థమై వుండదనే ఉద్దేశంతోనే రాజేశ్వరి చెప్పింది. "మనలా కాదు, పిల్లలు ఊహాలోకంలో విహరిస్తారు. చదివినా, బొమ్మ గీసినా తామూ అందులో పాత్రగా మారిపోతారు. చంద్రుడి బొమ్మ గీస్తే, 'చందమామ రావే- జాబిల్లి రావే' అనుకుంటూ, రెక్కల గుర్రం మీద తాము అక్కడికి వెళ్ళి మాట్లాడినట్టు ఊహల్లోకి వెళ్ళిపోతారు. చుక్కల్లో విహరిస్తారు. గాలిపటాలెక్కి ఊరేగుతారు. సెలయేర్లలో ఈత కొడతారు. పక్షులతో కబుర్లు చెపుతూ, జంతువులతో ఆడుకుంటారు... వాళ్ళు ఏం చేసినా అందులో లీనమైపోతారు... వారి సృజనాత్మకతను పెంచడం కోసమే పిల్లల చేత బొమ్మలు గీయిస్తాం. డ్రాయింగ్ క్లాస్‌లో స్రవంతి 'జైల్లో అమ్మాయి' బొమ్మగీయటం చూసి కన్‌ఫ్యూజ్ అయ్యాను. తర్వాత ఆమె నోట్స్‌లో ఇలాంటి బొమ్మనే చూసి నేను కంగారుపడ్డాను..."
స్రవంతి అలాంటి బొమ్మ ఎందుకు గీసి ఉంటుందో ప్రశాంతికి అర్థమయ్యింది. తనెప్పుడో ఒకసారి జైలు అంటే ఏమిటి మమ్మీ? అని అడగడమూ గుర్తుకొచ్చింది.
" నిలువుగా వున్న ఆ నాలుగు గీతలూ జైలు. వెనుక వున్న ఆ పాప.. అమ్మాయి. మీ అమ్మాయి తనను తాను జైల్లో వున్నట్టుగా భావించుకుంటోంది" చెప్పదలచుకున్నది పూర్తి చేసింది రాజేశ్వరి.
చుట్టూ వున్న గాలి బరువెక్కిన ఫీలింగ్. అందుకే కాబోలు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు నెమ్మదించాయి.
"సారీ"
"నాక్కాదు. మీ అమ్మాయికి చెప్పాల్సిన మాట ఇది. అలాగని మాట అనేసి వూరుకోకండి. మనసు తెలిసి మసలుకోండి... మా అమ్మానాన్నలు అలా నా తమ్ముడి మనసు తెలిసి మసలుకోలేదు కాబట్టే నేను వాడిని కోల్పోయాను."
"ఏమయ్యింది? "
"అమ్మా నాన్నా తనను పట్టించుకోవటం లేదనే బాధతో వాడు మేడమీద నుండి దూకేశాడు"
పిల్లల నిర్లిప్తతను నిర్లక్ష్యం చేయడం తప్పని సైకాలజీ కూడా చెపుతోంది.
ప్రశాంతి దీర్ఘంగా నిశ్వసించాక అంది. "ఇకమీదట నేను.. నా కూతురు ఆనందంగా వుండేలా చూసుకుంటాను. ఇట్స్ మై ప్రామిస్"
రాజేశ్వరి ఆనందంగా పలికింది. "థాంక్యూ".
ఆమె కళ్ళముందు.. స్రవంతి.. రెక్కల గుర్రం ఎక్కి ఆకాశంలో ఆనందంగా విహరించే దృశ్యం కదలాడింది. V

# పరామర్శ




## అమ్మా! నువ్వెళ్లిపో!

జీవన వైవిధ్యాన్ని, వైరుధ్యాన్నీ ఆవిష్కరిస్తూ మానవీయ స్పందనలకీ, సంఘర్షణలకీ అద్దం పడుతూ రూపుదిద్దుకుంటున్న ఎన్నో కథల అపురూప వేదిక 'విపుల'.

కొన్నికథలు... ఆరని గాయాలకు సాంత్వన చేకూర్చే చల్లని లేపనాలవుతాయి. మరికొన్ని కథలు... మనసుకు ఆరిపోని గాయాలవుతాయి. రంగువెలిసిన జ్ఞాపకాలు గుండె గోడలపై తారట్లాడతాయి... కదిలిన స్మృతులు కలత పెడతాయి.... కలవర పెడతాయి! అలా కదిలిన జ్ఞాపకాల అలలాంటి కథ... కాలిపు వీరభద్రుడు అనువదించిన నేపాలీ కథ... 'అమ్మా! నువ్వెళ్లిపో'! మూలకథలోని ఆత్మ చెదరకుండా ఆవిష్కరించిన తీరు ప్రశంసనీయం. ఏ దేశంలో అయినా ఎప్పుడైనా ఎక్కడైనా మానవ భావోద్వేగాలు విశ్వజనీనాలే!

పిల్లల్ని ప్రేమిస్తూ, ఎన్ని కష్టాలనైనా సహిస్తూ, వాళ్లని భరిస్తూ పెంచుతూ ఆ తర్వాత వార్ధక్యంలో ఆత్మీయ స్పర్శకోసం, పలకరింపు కోసం ఓ తల్లిపడే ఆరాటం... తల్లి సమక్షాన్నే భరించలేని ఓ కొడుకు జీవన వాస్తవికత... తల్లిని వదిలించుకోవాలన్న ఓ నిస్సహాయ ఆలోచన.... దూరం చేసుకోలేని వేదన... ఓ జాలి... ఓ భీతి... ఓ వ్యథ... ఓ మమకారం... ఓ వ్యాకులత... ఇన్ని భావోద్వేగాల మధ్య కొడుకు పడే సంఘర్షణే ఈ కథాచిత్రణ. ఆనందాలకన్నా మానవ సంబంధాలలోని జీవన విషాదాలే ఎక్కువగా మనల్ని వెంటాడి వేధిస్తాయి. అలాంటి ఉద్వేగాల్ని ఇలా అక్షరాలలో పలవరించేలా చేసిందీ కథ.



ఈ కథ చదువుతుంటే మనసెందుకో నిస్తేజమై, నిశ్శబ్దమై, నిర్లిప్తమై... ఏదో తెలీని దిగులుని రగిలిస్తుంది... వర్షించలేని మేఘంలా మిగిలిపోతాం! ప్రేమ, సేవ, కృతజ్ఞతల మైలురాళ్లని విస్మరిస్తూ, దాటుకుంటూ... ఆర్థిక విలువల కీకారణ్యంలోకి... సౌఖ్యాల, విలాసాల ఆశాసౌధాల్లోకి కృత్రిమ మానవ పర్యావరణంలోకి.... జీవన మాధుర్యాల తేమని కోల్పోతూ... గుండెల్లో ఎడారుల్ని విస్తరించుకుంటూ... దేనికోసం వెతుకుతున్నామో, దేన్ని కోల్పోతున్నామో తెలీని ఓ విచిత్ర అన్వేషణలో జీవనయానం సాగించటమే జీవన విషాదం!!

ఈ కథలో 'అమ్మా! నువ్వెళ్లిపో' అని కొడుకు అన్న మాటల్లోని అంతరార్థమేదో అవగతమై... అతనివేపు చూస్తూ పేలవంగా నవ్వుతుంది అమ్మ. వెలుగు కోల్పోయి, గాజు గోళీల్లా కాంతివిహీనంగా ఉన్న ఆ కళ్లలో ఆరిపోయిన నవ్వు కనపడుతుంది...! సుళ్లు తిరిగే నిర్వేదం వినపడుతుంది! శతకోటి భావాలు స్ఫురిస్తాయి! ఆ చూపులు ఎప్పటికీ అర్థంకాని జీవనవేదాన్ని లిఖిస్తుంటాయి! అనుభవాల దొంతర్లతో మరింత ముడతలు పడిన ఆ ముఖంలో జవాబులేని ప్రశ్నలు... ప్రశ్నలు లేని సమాధానాలు!!

అమ్మని తల్చుకుంటూ కళ్లు తడిచేసుకునే సందర్భం ఏ అక్షరాలకూ అందనంత బరువైనది...! గుండె మదిలో మిగిలి ఉన్న తడినీ, చెమ్మనీ మరోసారి తడిమి చూసుకునేలా చేస్తుందీ కథ!!

– *డా॥ సుదర్శన్,* సినీనటుడు

# పుస్తక సమీక్ష

## పీడనపై 'పాలికేక'



నాటి నైజాం వ్యతిరేక పోరాటం నుంచి నేటి మావోయిస్టు ఉద్యమం వరకూ ముఖ్యంగా తెలంగాణలో భూమి, భుక్తి, విముక్తి కోసం పీడిత, తాడిత జనం పోరాటాలు చేస్తూనే ఉన్నారు. ఈ పోరాటాల ఊపిరిగా అనేక మంది రచయితలు పాటలు కళారూపాల ద్వారా జనవాహినిలో మమేకమై ప్రజలను ఉద్యమాలకు సమాయత్తం చేశారు.. చేస్తున్నారు. ఈ క్రతువులో ఎందరో బూటకపు ఎన్‌కౌంటర్లకు గురయ్యారు. మరెందరో ఉద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొని జైళ్లపాలై చిత్రహింసలు అనుభవించారు.. అనుభవిస్తున్నారు. భూస్వామ్య, పెట్టుబడిదారీ పాలకవర్గాల కుతంత్రపు ఎత్తుగడలను ఒక వైపు దీటుగా ఎదుర్కొంటూనే నీళ్లల్లో చేపల్లా కలిసిపోయిన ఉద్యమకారులు సాయుధ రైతాంగ పోరాటాలకు బడుగు బలహీన వర్గాలను ఆయత్తం చేసిన తీరు చారిత్రాత్మకం. ఈ పోరాటాలకు ప్రత్యక్ష సాక్షి గూడ అంజయ్య. ఎమర్జెన్సీ చీకటిరోజుల్లో ఉద్యమకారులను పైశాచికంగా అణిచివేసిన తీరును అంజయ్య 'పొలిమేర'లో తనదైన శైలిలో ఆవిష్కరించారు. ఎమర్జెన్సీతోనే ఈ అణచివేత ప్రారంభం కాలేదు. అనంతరం ఆగనూ లేదు. రచనలో పాత్రలు వచ్చి అర్ధాంతరంగా ముగిసినా, పరిస్థితి సులభంగా అర్థమయ్యేలా జాగ్రత్తలు రచయిత తీసుకున్నారు. ముఖ్యంగా తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం తెలియనివారికి ఆ ఆనవాళ్లను 'పొలిమేర'లో అంజయ్య పరిచయం చేశారు. అక్షరం తెలియని పీడిత వర్గాలు సైతం తామున్న పరిస్థితులు మారాలంటే పోరాటమే మార్గంగా ఎంచుకుని విప్లవకారులను కడుపులో పెట్టుకుని కాపాడుకోవటం, నీడలా రక్షణ కల్పించటాన్ని పాఠకులకు చెప్పిన తీరు బాగుంది. అణచివేత ఏ స్థాయిలో ఉన్నా, భూస్వామ్య-పెట్టుబడిదారీవర్గ ప్రయోజనాలను కాపాడే పాలకవర్గాలు ఎన్ని కడగండ్లు కల్పించినా తాడిత ప్రజలు పీడనను ఎదుర్కోటంలో వెనుకంజ వెయ్యరని స్థూలంగా రచయిత వివరించిన తీరు ఈ నవలలో సుస్పష్టమవుతుంది.

(**పొలిమేర –గూడ అంజయ్య,** వెల: రూ.140/- ప్రతులకు: నవోదయ, విశాలాంధ్ర, ప్రజాశక్తి తదితర పుస్తక కేంద్రాలు)

– *డి.యన్.*

## రచయితే కోపైలట్




శతాధికంగా చలన చిత్రాలకు రచనలు చేసిన అనుభవసారాన్ని కాశీ విశ్వనాథ్ ఈ పుస్తకంలో అందించారు. ఆయన నటుడు, నాటకకర్త, దర్శకుడు, కథకుడు కూడా కావడంతో ఈ రచన మరింత ప్రామాణ్యాన్ని సంతరించుకుంది. 'సినిమా అనే విమానానికి డైరక్టరు పైలట్ అయితే, రైటరు కోపైలట్ అవుతారు', 'ఓ సినిమాకి రచయిత తల్లివంటివాడైతే, దర్శకుడు తండ్రి వంటివాడు' అని సినిమా రచయిత బాధ్యతల్ని గుర్తుచేశారు.

సినిమా రచయిత కావాలనుకునేవారికి విశ్వనాథ్ అన్ని విషయాలు, మెలకువలు సోదాహరణంగా వివరించారు. సినిమాకి కథ కల్పించడం- దాని ఆరంభం, నడక, ముగింపు, నవలను సినిమాకు అనువర్తించడం, దృశ్యవిభజన, నాయికానాయకుల స్థానం, సంభాషణలు, సినిమాలో వాడే తెలుగుభాష, పౌరాణిక, చారిత్రక కథలు, రచన నిడివి, సినిమా పాటలు, విరామం ముందు, తర్వాత, బడ్జెటు దృష్టి, హాస్యభాగం, సందేశం, ఉత్కంఠ మొదలైన మౌలికాంశాలను రచయిత సరళ వ్యావహారికంలో విశదీకరించారు. పుస్తకంలోని 30 ప్రకరణాలలో పాఠకులను ఇబ్బంది పెట్టే సాంకేతిక పరిభాష వాడకపోవడం ప్రశంసనీయం. రచయితలకు ఉపకరించే 15 సాంకేతిక పదాలను ప్రత్యేకంగా ఒక ప్రకరణంలో వివరించడం మంచి ఆలోచన. ఉత్తమ సినిమా పుస్తకంగా 2006లో నంది పురస్కారం పొందిన ఈ పుస్తకం రచయితలకే గాక నటులకు, దర్శకులకు, సాంకేతిక నిపుణులకు ఎంతో ఉపయోగపడుతుంది.

(**సినిమా రచన... కొన్ని మౌలికాంశాలు – కాశీ విశ్వనాథ్,** వెల: రూ. 120/- ప్రతులకు: విశాలాంధ్ర, తదితర పుస్తక కేంద్రాలు)

# ఉపాహారం

ముప్ఫైమూడేళ్లనాటి ఉదంతం

గోదావరి నీటి వివాదాల ట్రిబ్యునల్ సభ్యులు, ఇతర సంబంధిత ఇంజినీర్లు పాతికమంది, గోదావరి నదీ పరీవాహక ప్రాంతంలో పర్యటన చేస్తూ- ఆయా రాష్ట్ర రాజధానుల్నే కాక కొన్ని ముఖ్యమైన ప్రాజెక్టుల్ని కూడా సందర్శిస్తున్నారు. ఆ సందర్భంగా వారు హైదరాబాద్‌లోని ఇంజినీర్లతో సంప్రదింపులు జరిపేందుకు ఫలానా తేదీ వస్తున్నారన్న వర్తమానం, ఇంటర్ స్టేట్ ఇంజినీరింగ్ శాఖకి మూడు రోజులు ముందుగానే పంపారు.

ఉదయం అల్పాహారం, మధ్యాహ్నం లంచ్, రాత్రి డిన్నర్‌కి ప్రత్యేకంగా చేయవలసిన 'వంటకాల సూచి' వచ్చిన వర్తమానానికి జత చేర్చి పంపారు. ఆ సూచిలో మధ్య మధ్య 'టీ'తో పాటూ 'స్నేక్స్' కూడా సభ్యులకు ఇవ్వాల్సిందిగా సూచించారు.

సభ్యుల భోజనాల ఏర్పాటుకు నియమితుడైన అసిస్టెంట్ ఇంజినీరు, జీ.వి.రత్నం మెసేజ్ చదివి నివ్వెరపోయాడు. పరుగున పక్క రూమ్‌లో ఉన్న ఎగ్జిక్యూటివ్ ఇంజినీరు శాస్త్రి వద్దకు వెళ్లి, "సార్! సభ్యులకు మధ్య మధ్య టీలు ఎన్నిమార్లయినా



ధారాళంగా సర్వ్ చేయొచ్చు. కాకుంటే పాముల్ని ఎక్కణ్ణించి తేవాలి? " మెసేజ్‌తోపాటు వచ్చిన మెనూ చార్ట్ శాస్త్రి బల్లమీద ఉంచాడు రత్నం.

వర్తమానం జాగ్రత్తగా చదివిన శాస్త్రి విరగబడి నవ్వసాగాడు.

"మైడియర్ జీ.వీ! 'స్నేక్స్' కాదయ్యా- అది 'స్నాక్స్' అయి ఉంటుంది. ప్రింటు తప్పు పడింది. అయినా వస్తున్న వాళ్లలో నీవెరిగిన చైనా దేశపు ఇంజినీర్లు ఎవరైనా ఉన్నారా పాముల్ని భోంచేయడానికి!" అంటూ నవ్వాడు శాస్త్రి.

– ఎం.సి.ఆంజనేయులు

బంజారాహిల్స్, హైదరాబాద్






# సజీవం

"అమ్మగారు రాలేదా అయ్యా!? " అని అడిగింది గుడిని ఆశ్రయించుకు ఉండే ముసలమ్మ. "లేదమ్మా ఇంకా అక్కడ నుంచి రాలేదు" అని చెప్పాడు ఒక యువకుడు. "రప్పించేసుకోండయ్యా ఎన్నాళ్లిలా ఇబ్బంది పడతారు!? "

"ఆవిడ తనంత తాను తిరిగి రాలేనంత దూరంలో ఉంది. బహుశా నేనే వెళ్లాలేమో!? " అన్నాడు యువకుడు.

"అలక తీరితే ఆమే వస్తుంది లెండి" అంది ముసలమ్మ.

రోజూ గుడికి వచ్చే నాకు ఈసీను, సంభాషణలు మామూలు అయిపోయాయి. ఆ రోజు ఉండబట్టలేక పూజారిగారిని అడిగాను అసలు విషయం ఏమిటని. దానికి సమాధానంగా ఆయన... వారు మాట్లాడుకునేది ఆ యువకుడి భార్య గురించని, సంవత్సరం క్రితం ఆమె హఠాత్తుగా చనిపోయిందని, ఆ ఇంట్లో పనిమనిషిగా ఉన్నా... అమ్మకన్నా ఎక్కువగా ప్రేమించిన ఆ ముసలమ్మ, ఆ యువకుడు ఒకరినొకరు ఓదార్చుకుంటూ మభ్యపరచుకుంటూ ఉంటారని చెప్పారు. బతికున్న వాళ్లని మాటలతో చేతలతో చంపే ఈ సమాజంలో చనిపోయిన ఆ పుణ్యమూర్తి వాళ్లిద్దరి హృదయంలో సజీవంగా ఉండడం ముదావహం అనిపించింది నాకు.

– ఎం.వి.ఎస్.ఎస్.ప్రసాద్

ట్రెజరీకాలనీ, కాకినాడ-4





# రిటర్న్ గిఫ్ట్

శివపార్వతుల షష్టిపూర్తి. అతిథులు హాజరయ్యారు. వారిలో చాలామంది మహిళలున్నారు. పంజాబీ డ్రెస్‌లు, పరికిణీ ఓణీలను తరిమేశాయి. చీరెలు చిక్కిపోతున్నాయి. బంగారం ధాటికి మట్టిగాజులు, నల్లపూసలు బీరువాలో దాక్కున్నాయి. కాలిమట్టెల కలర్ మారింది. బుసకొట్టే వాలుజడ బుడుంగుమంది. హెన్నా హెయిర్ స్టయిలైంది. ఫేషియల్స్ పసుపుని 'రఫ్' ఆడించేశాయి. బ్యూటీ టిప్స్ నలుగుపిండిని నలిపేశాయి. కనుబొమల కొడవలి వంపుల్లో కుంకుమ బొట్టు చిన్నబోతోంది. అంతా మాడర్న్. ఆధునిక మహిళలు.

షష్టిపూర్తి పెళ్లయింది. భోజనాలు ముగిశాయి. మహిళా అతిథులకు తాంబూలంతో బాటు రిటర్న్ గిఫ్ట్‌గా పేపర్ బ్యాగులు ఇచ్చారు శివపార్వతులు. ఏముందాని విప్పి చూశారు మహిళలంతా.

నల్లపూసల దండ, డజను మట్టిగాజులు, పసుపు కుంకుమ, మల్లెపూలు, మరువాలు. వాటితోబాటు చిన్న కాగితం మీద చిన్నవాక్యాలు. "సహజ సౌందర్యాన్ని కాపాడండి. కనీసం మీ పెళ్లిరోజైనా వీటిని ధరించండి"

అప్పుడు గుర్తుకొచ్చింది మహిళలకు, శివపార్వతుల కాళ్లకు దండం పెట్టాలని.

– మురారి సుబ్బారావు

దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్




# సివిక్ సెన్స్

రామనాథం బస్ ఎక్కాడు. తనది ఊబ శరీరం, పైగా 60 ఏళ్లు పైబడి ఉండటంతో నిలబడటానికి అవస్థపడుతున్నాడు. కూర్చోడానికి బస్‌లో సీట్లు ఖాళీ లేకపోవడంతో నిలుచునే ఉన్నాడు. ఎవరైనా పిలిచి చోటిస్తారని చూశాడు. ఎవరూ పిలవలేదు. సీట్లో కూర్చున్న వారివైపు చూశాడు. ఎవరూ పట్టించుకోవడంలేదు. అది అవమానంగా భావించిన రామనాథం కోపంతో "ఈ కాలం పిల్లలకు బొత్తిగా పెద్దలంటే గౌరవం లేదు. అందుకే దేశంలో విలువలు ఇలా తయారయ్యాయి. పెద్దవారు పక్కన నిలబడితే లేచి నిలబడి సీటివ్వడం లేదా, సర్దుకుని కూర్చోవడం కూడా తెలియదు. అయినా మిమ్మల్ని కాదు. 'సివిక్ సెన్స్' లేని మీ తల్లిదండ్రుల పెంపకాన్ని అనాలి" అని అంటున్నాడు. సీట్లో ఉన్న వారికి కోపం వచ్చినా ఎందుకులే, పెద్దాయనలే అని గౌరవంతో ఊరుకున్నారు.

ఇంతలో తమ స్టాప్ రావడంతో ఆ సీట్లోంచి ఇద్దరు కుర్రాళ్లు దిగి వెళ్లిపోయారు. రామనాథం రెండు సీట్లలో దర్జాగా కూర్చున్నాడు. అదే



స్టాప్‌లో బస్ ఎక్కిన కుర్రాడు రామనాథం దగ్గరకు వచ్చి "సార్, ఇది ఇద్దరి సీటు కొంచెం సర్దుకోండి సార్" అన్నాడు అంతే.

"ఇది నాకు రెండు సీట్లని తెలీదా. బొత్తిగా జ్ఞానం లేదు ఈ కాలం కుర్రాళ్లకి. నన్ను చూసైనా సీటు అడగకుండా ఉండాలి. పెద్దలంటే గౌరవం లేదు. సివిక్‌సెన్స్ లేదు. అందుకే దేశం ఇలా తయారవుతున్నది" అని ఒంటికాలి మీద లేచాడు రామనాథం. రామనాథం సివిక్‌సెన్స్, నైజానికి బస్సులో మిగతావారు నోరెళ్లబెట్టారు.

– సిహెచ్. నాగేశ్వరరావు

రాజాం, శ్రీకాకుళం జిల్లా


నువు చేసిన ఆ మైసూర్ పాక్‌ని ముందుగా
దీని మీద ప్రయోగిస్తే బాగుంటుందేమో కాంతం!!


నేను నిద్ర లేచిన తర్వాత అరగంట వరకు బద్దకంగా, ఒళ్ళంతా నొప్పులుగా బాధగా ఉంటుంది డాక్టర్!
ఐతే! మరో అరగంట నిద్రపోయాక లేస్తే సరి.


భవిష్యత్‌లో కోర్టు కేసులు చూసుకోవడానికి మీ వాడ్ని లాయర్ చదివించరా! మనకు మంచి హెల్పవుతుంది.

డాక్టర్ గారు మావార్ని ఆరోగ్యం కోసం "గేమ్స్" ఆడమన్నారు. అప్పట్నుంచి ఆ గదిలో కూర్చుని కాసేపు "కంప్యూటర్ గేమ్స్" ఆడుతుంటారు వదినె!



వంటేం చేయట్లేదు పిన్నీ... వరద బాధితుల కోసం చేసిన పొట్లాలు మూడు పూటలా తీసుకొస్తున్నారు...

స్వాహారావ్
ప్రభుత్వోద్యోగి

పులిహోర
పొట్లాలు
వరద బాధి
తులకు
పంపిణీ



రాంమోహన్


అమ్మగారు వంటవ్వాలేద
న్నరని.. సాయంసేత్తున్న
బాబయ్యా....!


సారీ అండి అయ్యగారూ.. సాలీడు మీ మొహంమీదికి
వచ్చిందని..అదే పనిగా బాదేశాను....


అబ్బే, అజెండాపా నాకేంటో?! లోపల
దొడ్డుబియ్యం ఎలా వండి, వార్చి వడ్డించాలో
ప్రయోగాత్మకంగా చూపిస్తారట....!!
మంత్రివర్గ సమావేశం


ఏమండీ విన్నారా..? కోడలుపిల్ల పదిలక్షల
కట్నంతెచ్చిందట.. అందుకని..
రిమోట్ దానిదగ్గరే
వుంచుకుంటుందట....


తరతరాలు సీరియల్ పూర్తవకుండానే....
పోయావా.. అత్తయ్యా....వాఁ....!!
?



పనిపిల్లని ఓ కంట కనిపెట్టాలండీ.. దొంగముండ...
మొన్న నేను పెళ్ళిలో కొట్టుకొచ్చాను
చూడండే.. ఆ రెండు గ్లాసులు
పట్టుకు పోయింది..
హూ

మల్లాది వెంకటకృష్ణమూర్తి

# 16 మిస్టర్ మిరియం



మూర్ఖులు ఇంటిని నిర్మిస్తే, తెలివైనవాడు అందులో నివసిస్తాడు.

– ఇంగ్లీషు సామెత

**అతను ఎక్కడికి వెళితే అక్కడంతా చిరునవ్వులే. అతను నోరు తెరిచి జోక్ చేయకుండానే చుట్టుపక్కలవాళ్లను నవ్విస్తాడు. అతడే మిస్టర్ మిరియం.**

*షరా:* అక్కడక్కడ చదివితే హాస్యోక్తులు. వరుసగా చదివితే మిస్టర్ మిరియం జీవితం.

★ ★ ★

**ఓ**సారి ఆఫీసులో ఓ కంప్యూటర్ పాడయింది. దాన్ని బాగుచేసే టెక్నీషియన్‌కి ఫోన్ చేశాడు మిరియం. సమస్య ఏమిటో వివరించాడు.

“అయితే దాన్ని మీరు నా దగ్గరకి తీసుకువస్తే బాగు చేస్తాను. సర్వీసింగ్ చేయాలి”

“అలాగే”

“ప్లగ్‌కున్న ఎలక్ట్రికల్ వైర్‌ని తీసేసి దాన్ని తీసుకురండి”

అరగంట తర్వాత మిరియం ఆ టెక్నీషియన్ దగ్గరకి వెళ్లాడు. కుడి చేతిలో కంప్యూటర్ నించి తీసిన ఎలక్ట్రిక్ వైర్‌తో!

దాంతో ఆ ఉద్యోగం ఊడింది.

“నీ వంశంలోని మేధావులకి యుఎఫ్‌ఓలకి ఓ పోలిక వుంది” కోపంగా చెప్పాడు డిస్మిసల్ ఆర్డర్ మిరియం చేతిలో ఉంచిన సాఫ్ట్‌వేర్ కంపెనీ మేనేజర్.

“అంటే ఏమిటి? ” అడిగాడు మిరియం.

“వాటి గురించి వింటాం తప్ప ఎన్నడూ చూడలేం”

మిరియం గురించి చాలా మందికి తెలిసిపోయింది. క్రమేపి ప్రపంచంలోని అంతా తనని పరిహసిస్తున్నారని గ్రహించాడు మిరియం.

ఓ రోజు అతను ఓ బార్‌కి వెళ్తే, రెండు పెగ్గులు తాగి, హుషారెక్కిన ఓ గుడ్డివాడు గట్టిగా చెప్పసాగాడు.

“అంతా వినండి. మీకు మిస్టర్ మిరియం జోక్‌ని చెప్తాను”

వెంటనే మిరియం లేచి గట్టిగా చెప్పాడు.

“నువ్వు జోక్ మొదలుపెట్టేముందు జాగ్రత్త. ఈ బార్ యజమాని మిరియం బావమరిది. నీకు సర్వ్ చేసే వెయిటర్ మిరియం అన్నకొడుకు. అతను వెయిట్ లిఫ్టర్. నీ వెనక సీట్‌లో కూర్చున్నతను మిరియం మేనమామ కొడుకు. అతను బాక్సర్. నీ పక్కన కూర్చున్న వాడు మిరియం, అతని చేతిలో ఓ కత్తి ఉంది. ఐనా ఆ జోక్‌ని చెప్పదలచుకుంటే చెప్పు”

“చెప్పను”

“ఎందుకని? ”

“ఆ నలుగురికి అర్థమయ్యేలా దాన్ని నాలుగుసార్లు వివరించే ఓపిక నాకు లేదు” జవాబు చెప్పాడు ఆ గుడ్డివాడు.

**ఒ**కతను ఓ సాయంత్రం ఓ పార్క్‌కి కాసేపు ప్రశాంతంగా గడుపుదామని వచ్చాడు. ఓ సిమెంట్ బెంచీ మీద కూర్చున్న అతను ముగ్గురు వర్కర్స్ చేసే పనిని ఆసక్తిగా చూశాడు.

ఒకరు గోతులు తవ్వితే, మరొకరు మట్టితో ఆ గోతిని కప్పితే, మూడో వ్యక్తి నీళ్లు పోస్తున్నాడు.

“మీరెందుకిలా చేస్తున్నారు? ” అడిగాడతను.

“మేం ఈ పార్క్‌లో పనిచేసే తోటమాలులం. విత్తనాలని నాటుతున్నాం” చెప్పారు ఒకరు.

“విత్తనాలు ఏవి? ” అడిగాతడను.

“విత్తనాలు నాటేవాడు ఇవాళ శెలవులో ఉన్నాడు. కాబట్టి మా పనిని మేం చేసుకుపోతున్నాం” చెప్పాడు వారిలో ఒకరైన మిరియం.

**మి**రియం కొద్దిరోజులు ఎలక్ట్రీషియన్‌గా పనిచేశాడు.

“హలో మిరియమేనా? మా డోర్ బెల్ రిపేర్ చేయమని నాలుగు రోజుల క్రితం చెప్పాను. ఇప్పటిదాకా రాలేదు మీరు” కోపంగా అరిచింది ఒకావిడ.

“నాలుగు రోజులుగా మీ ఇంటి బెల్ కొట్టి కొట్టి నా వేలు నెప్పెట్టింది. డోర్ తీస్తేగా మీరు? రోజూ రావడం, వెనక్కెళ్లడమే సరిపోయింది నాకు” మరింత కోపంగా చెప్పాడు మిరియం.

డోర్‌బెల్ రిపేర్ :

ఎంత కొట్టినా డోర్ తీయరే..?



**ఆ** తర్వాత మిరియం ఇంజనీరింగ్ కంపెనీలో టెక్నీషియన్‌గా పనిచేశాడు. పనిలో భాగంగా పైకెళ్లి ఓ భవంతి కిటికీని రిపేర్ చేయాల్సి ఉంది. అందుకని నలుగురు వర్కర్స్ క్రేన్‌కి వేలాడే చిన్న గొలుసులని పట్టుకుని పైకి వెళ్లసాగారు. వంద అడుగులు పైకి వెళ్లాక క్రేన్ డ్రైవర్ గట్టిగా చెప్పాడు.

“క్రేన్‌కి బరువు ఎక్కువైంది. కూలిపోయేలా ఉంది. మీలో ఒకరు కిందకి దూకేస్తే మిగిలినవాళ్లు రక్షింపబడతారు”

ఆ నలుగురిలో ఒకరు చెప్పారు.

“ఆల్ రైట్. నేను దూకేసి మిగిలిన వాళ్లని రక్షిస్తాను”

వెంటనే మిరియం అతన్ని అభినందిస్తూ చప్పట్లు కొట్టాడు!

**ఓ** హోటల్‌లో ఉద్యోగానికి అప్లికేషన్‌ని నింపుతూ ‘సేలరీ ఎక్స్‌పెక్టెడ్’ అన్న కాలం ఎదురుగా ఇలా రాశాడు మిరియం.

“యస్”

**హో**టల్లో రిసెప్షనిస్ట్‌గా చేరాడు మిరియం. అయితే ఐదు రోజుల తర్వాత అతన్ని ఆ పోస్ట్ నుంచి వెయిటర్‌గా మార్చారు. కారణం తమ గది నంబరు మర్చిపోయిన అతిథులు తమ పేర్లు చెప్పి ‘నేనే గదిలో ఉన్నాను? ’ అని అడిగినప్పుడల్లా ‘లాబీ’లో అని మిరియం జవాబు ఇచ్చేవాడు.

**చే**సిన సవాలక్ష ఉద్యోగాల్లో మిరియం పోస్టాఫీస్‌లో సార్టింగ్ క్లర్క్ ఉద్యోగం ఒకటి. మిగిలిన అందరికన్నా వేగంగా

మిరియం ఉత్తరాలని సార్ట్ చేయడం చూసిన పోస్ట్‌మాస్టర్ మెచ్చుకోలుగా చెప్పాడు.

"ఇరవై ఏళ్ల అనుభవం ఉన్నవారు కూడా ఇంత త్వరగా సార్ట్ చేయలేరు"

"అవునా? రేపు వీళ్లందరిలా చేస్తాను కాబట్టి నా వేగం తగ్గచ్చు" చెప్పాడు మిరియం.

"అంటే? ఏం చేస్తున్నావు?

"రేపు చిరునామాలని చదివి సార్ట్ చేస్తాను" చెప్పాడు మిరియం.

**2008లో** బీజింగ్‌లో జరిగిన ఒలింపిక్స్‌కి చెందిన ఓ ప్రకటనని చదవసాగాడు మిరియం.

"ఓ! ఓ! ఓ! ఓ! ఓ!"

"అవి ఒలింపిక్ రింగ్స్. ప్రకటన కింద ఉంది" అతని పక్కనున్నతను చెప్పాడు.

**మి**రియానికి ఓ పట్నాన ఉద్యోగం రాక పోవడంతో పెళ్లి సమస్య అయ్యింది. అంతా అబ్బాయి ఉద్యోగం ఏమిటి అని అడుగుతూంటారు.

దాంతో అల్లం ఆ విషయంలో అబద్ధ మాడదల్చుకున్నాడు.

"మీ అబ్బాయి ఏం చేస్తున్నాడు? " అని అడిగితే అల్లం జవాబు చెప్పాడు.

"విమానంలో కండక్టర్‌గా పనిచేస్తున్నాడు"

**కొం**తకాలం అరటి పళ్ల వ్యాపారం చేశాడు మిరియం. అతని దుకాణానికి వచ్చినవారు "అరటిపళ్లు ఎలా ఇస్తున్నావు? " అని అడిగితే, 'లెక్క పెట్టి ఇస్తాను' అని మిరియం వినయంగా జవాబు చెప్పేవాడు.

**మి**రియం కార్ ఫైనాన్స్ వ్యాపారాన్ని ఆరంభించాడు.

ఓ కస్టమర్ మిరియం దగ్గరకి లోన్ కోసం వస్తే, అప్లికేషన్ నింపించాడు. ఆయన సంతకం చేశాక, సభ్యత్వ రుసుముగా వంద రూపాయలు చెల్లించమని కోరాడు.

"దేనికి? "

"మీరు మా వ్యాపార సంస్థలో సభ్యత్వం పొందితే మీరు అప్పుకి అర్హుల వుతారు" వివరించాడు మిరియం.

"నేనీ వంద రూపాయలు చెల్లించను" నిరాకరించాడతను.

"కాని ఇది తప్పనిసరి"

"నాకు మీ వ్యాపారంలో సభ్యత్వం తీసుకునే ఆసక్తి లేదు కాబట్టి నా అప్లికేషన్‌ని రద్దుచేయండి" చెప్పాడు ఆ కస్టమర్.

"సరే, మీ సభ్యత్వ రుసుముని రద్దు చేసేస్తాను"

"కాని అది తప్పనిసరి అన్నారుగా? "

"మీ సభ్యత్వ రుసుముకన్నా మాతో మీరు వ్యాపారం చేయడం మాకు ముఖ్యం"

"అలాంటప్పుడు అసలు మీరు సభ్యత్వ రుసుముని ఎందుకు ప్రవేశపెట్టారు? "

"అదా? అది తప్పనిసరి కాబట్టి" జవాబు చెప్పాడు మిరియం.

త్వరలోనే ఆ వ్యాపారంలో మిరియం దివాలా తీశాడు.

**మి**రియం ఓ ధనవంతుడి ఇంటికి చేతిలో బ్రష్‌లతో వెళ్లి చెప్పాడు.

"నేను ప్రొఫెషనల్ పెయింటర్‌ని. మీ






ఇంటికి రంగులు వేయించదలచుకుంటే నాకు చెప్పండి"

"అలాగే, మా ఇంటి పోర్టికోకి రంగువేయాలి. ఎంత తీసుకుంటావు? " అడిగాడు ఆ ధనికుడు.

"అయిదు వందల రూపాయలు"

"పని పూర్తిచేయడానికి ఎన్నిరోజులు పడుతుంది? "

"అరరోజు చాలు"

"అరరోజు చాలా? సరే అయితే రేపు పని మొదలెట్టు. రంగుడబ్బాలు తెస్తాను"

మర్నాడు ఉదయం మిరియం, ఆ ధనికుడింటికి వెళ్లి రంగు డబ్బాలు అడిగి తీసుకున్నాడు. మధ్యాహ్నానికల్లా పని పూర్తిచేసి చెప్పాడు.

"పోర్టికోకి పూర్తిగా రంగువేశాను. కాని నిజానికి దానిపేరు పోర్టికో కారు కాదు. ఫోర్డ్‌కారు"

**ఓ** రాత్రి మిరియం తన గర్ల్‌ఫ్రెండ్ ఇంటికి వెళ్లాడు. కాని వెంటనే బయటకి వచ్చేశాడు.

"అంత త్వరగా వచ్చేశావే? " అడిగాడు ధనియం.

"మేం చక్కటి రొమాంటిక్ సినిమాని టి.వి.లో చూస్తున్నాం. చటుక్కున లేచి ఆమె లైటార్పేసి గదిని చీకటి చేసింది. నేను ఎక్కువసేపు ఉన్నానని ఆమె సూచిస్తోందని గ్రహించి వచ్చేశాను" వివరించాడు మిరియం.

**ఓ**రోజు ధనియం రోడ్డుమీద వెళ్తూంటే, ఓ చోట రోడ్డుమీద ఏదో పూస్తూన్న మిరియం కనిపించాడు.

"ఏం చేస్తున్నావు? " స్కూటర్ ఆపి అడిగాడు ధనియం.

"ఆయింట్‌మెంట్ పూస్తున్నాను"

"దేనికి? "

"డాక్టర్ ఇచ్చి పూయమన్నాడు"

"రోడ్డుకా? అసలు డాక్టర్ నీతో ఏమన్నాడూ చెప్పు"

"ఎక్కడ దెబ్బతగిలితే అక్కడ పూయమన్నాడు, నాకు దెబ్బ తగిలింది సరిగ్గా ఇక్కడే" చెప్పాడు మిరియం.

**మి**రియం ఏటా హైదరాబాద్‌లో జరిగే ఇండస్ట్రియల్ ఎగ్జిబిషన్‌కి వెళ్లాడు. అక్కడ బీహార్ నుంచి వచ్చిన ఒకతనికి కళ్లజోళ్ల షాపుంది. ఒక్కో కళ్లజోడు 5000 రూపాయలు అన్న బోర్డుని చూసి అడిగాడు మిరియం.

"ఇంత ధరా? "

"ఇవి మామూలు కళ్లజోళ్లు కావు. ఎక్స్‌రే కళ్లజోళ్లు. పెట్టుకుని చూడండి"

దాన్ని అతను పెట్టుకుని చూస్తే అక్కడికి వచ్చిన వారంతా నగ్నంగా కనపడటంతో మిరియం దాన్ని కొన్నాడు. ఇంటికి వచ్చి దాన్ని తన భార్యకి చూపిద్దామనుకున్నాడు. కాని ఆమె, పక్కింటావిడ కలిసి సినిమాకి వెళ్లారని తెలిసింది. పక్కింటాయనకి చూపిద్దామనుకుని లోపలికి వెళితే అక్కడ ఆయన కనబడలేదు. బెడ్‌రూంలోంచి మూలుగులు వినిపించడంతో అక్కడికి వెళ్లి చూస్తే పక్కింటాయన, పనిమనిషి మంచం మీద నగ్నంగా కనిపించారు. వెంటనే కళ్లజోడు పెట్టుకుని చూస్తే, మళ్లీ నగ్నంగానే కనిపించారు. ఈసారి కళ్లజోడు తీసి చూసినా మళ్లీ నగ్నంగానే కనిపించారు.

వెంటనే మిరియం కళ్లజోడుని తీసి నేలకేసి కొడుతూ అనుకున్నాడు.

"ఛ! అయిదు వేల రూపాయలు ఇచ్చి దీన్ని కొన్నాను. అప్పుడే ఇది పాడయిపోయింది"

**ధ**నియం పెళ్లికి వెళ్లిన మిరియం చెప్పాడు.

"జాగ్రత్తరోయ్. భార్యలు మొదట్లో బానే ఉంటారు. కాని పెళ్లయిన కొంతకాలానికి నిర్లక్ష్యంగా ఉండి మనకి సమాధానం కూడా చెప్పరు"

"ఓ ఉదాహరణ చెప్పు" అడిగాడు

